# అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని

ప్రథమ ముద్రణ :- డిసెంబరు 2020

ప్రతులు : 500

వెల : రూ॥ 200/-

పేజీలు : 164

ప్రతులకు-శ్రీమతి జంధ్యాల కుసుమకుమారి

ప్లాట్ నెం. 102, కుసుమప్రియా మాన్షన్

నల్లకుంట, హైదరాబాద్-500044.

ఫోన్.నెం. 040-27651608, సెల్.నెం. 7382006600

E-mail : jkkumari1952@yahoo.co.in

యం. నాగలక్ష్మి

కేరాఫ్/ మూలా దక్షిణామూర్తి

29-185, న్యూ విద్యానగర్

నేరెడ్‌మెట్, మల్కాజిగిరి

సికింద్రాబాద్-500056

నియోగి-9553097319

కవర్ డిజైన్: రమ్య, కె.శ్రీధర్

డి.టి.పి. దేవయాని

ముద్రణ :

అక్షయ గ్రాఫిక్స్,

చిక్కడపల్లి, హైదరాబాద్

సెల్ : 9989890588

E-mail : rajendratammisetty3@gmail.com

# ఇందులో...

# అంకితం



ఎన్ని అందమైన అక్షరాలను కూర్చి

పదాల పూలను చేర్చి

కవితలమాలలల్లి ఇచ్చినా

మాతృత్వపు విలువకు సరితూగవు

అడగకుండా ఆకలితీర్చే

అమ్మతనానికి

ప్రతీకలుండవు

నాకాలంలోనే

నాపై అనురాగం చూపిస్తూ

అమ్మరూపాలుగా నిల్చి

ఆత్మీయత పంచే

అక్కలు రాజ్యశ్రీ, కుసుమకుమారిగార్లకు

నా ఈ అక్షరాల అడుగుజాడల్లో

పంచసహస్రావధాని గ్రంథం-

– నియోగి

# విస్మృతకవిని వెలుగులోకి తెచ్చిన నియోగి

**"కొందరు గొప్ప సృజనగావించి**

**విస్మృతులు కావడం బాధ కలిగించే అంశం" (నియోగి)**

**నా** మిత్రుడు నియోగిగారి ఈ బాధలోంచే ఈ విమర్శ గ్రంథం పుట్టుకొచ్చింది. ఒక విస్మృత కవిని వెలుగులోకి తెచ్చిన నియోగి గారికి నా హృదయపూర్వక అభినందనలు.

జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 01.03.1892న జన్మించి 24.10.1980న కన్నుమూశారు. వీరు గుర్రం జాషువ వంటి గొప్ప కవులు సమకాలికులు. కన్యాశుల్కం మొదటి ప్రదర్శన జరిగిన సంవత్సరంలో పుట్టారు. సంఘ సంస్కరణ, స్వాతంత్ర్యోద్యమకాలంలో పుట్టి విప్లవోద్యమ కాలంలో కన్నుమూశారు. అనేక సామాజిక ఉద్యమాలను పరిణామాలను చూశారు. అయినా ఆ ఉద్యమాలతో ఈయన మమేకమైనట్లు లేరు. శాస్త్రిగారు అవధాని, చారిత్రక కావ్య కవి. అవధాన విద్యలో శాస్త్రిగారు చాలా ఎత్తుకు ఎదిగారు. సహస్రావధానం, పంచ సహస్రావధానం చేశారు. తెలుగు కాలంలో తిరుపతి వేంకటకవులు మొదలుకొని అవధానాలు అవిచ్ఛిన్నంగా జరుగుతున్నాయి. వాటికి రాచమర్యాదలు దక్కుతున్నాయి. శాస్త్రిగారు ఈ అవధాన ప్రస్థానంలో బాగా ప్రయాణం చేశారు. అవధానులుగా ఉంటూ గొప్ప కావ్య రచన చేసినవారు బహుశా పరిమిత సంఖ్యలోనే ఉన్నారనుకుంటాను. అవధానంతో పాటు చిన్న చిన్న ఖండ కావ్యాలు రాసిన వాళ్లన్నారు గానీ, మహాకావ్యాలు రాసినవాళ్లు తక్కువే. ఆ కొద్దిమందిలో శాస్త్రిగారు ఒక్కరు.

భారతీయ సమాజం అందులో భాగంగా తెలుగు సమాజం 1980 నాటికి చాలా ఆధునికతను సాధించాయి. ఎంత ఆధునికతను సాధించినా,

తాత్విక చింతనలోనూ, సాంస్కృతిక చైతన్యంలోనూ గతకాలపు ఆలోచనలు తెరమరుగు కాలేరు అనడానికి చాలా ఉదాహరణలున్నాయి. ఆధునిక కాలంలో సంప్రదాయ భావ ప్రచారం చేసే వాళ్లకు మంచి గుర్తింపు ఉంది. కాని సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఎందుకో మరుగునపడిపోయారు. ఈ విస్మృత కవిని నేటి సమాజానికి ఈ విమర్శ గ్రంథంతో పరిచయం చేశారు నియోగిగారు. ఇది ఒక బాధ్యతాయుతమైన కర్తవ్యంగా నేను భావిస్తున్నాను. ఈ పుస్తకం చదవగానే నియోగి గారిని అభినందించాలని ఎందుకనిపించిందంటే: ఈ మధ్య సాహిత్య విమర్శ అవాంఛనీయం అనే అభిప్రాయం చర్చనీయాంశంగా నలుగుతున్నది. రచయితకు పాఠకులు చాలు, విమర్శకులక్కరలేదు అనే కొందరు అభిప్రాయపడుతున్నారు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 1960లలో రెండు చారిత్రక కావ్యాలు రాశారు. కవి రాశాడు. కాని పాఠకులు ఆయనను పట్టించుకోలేదు. ఇప్పుడు నియోగిగారు విమర్శకుడుగా పట్టించుకున్నారు. పాఠకులు చాలు విమర్శకులు అక్కరలేదు అనుకుంటే, 50ఏళ్ల క్రితం వచ్చిన కావ్యాలను విస్మరించిన సమాజానికి దిక్కెవరు? ఆ కవికి దిక్కెవరు? విమర్శకులే. నియోగి వంటి విమర్శకులే. నియోగిగారి ఈ విమర్శ గ్రంథం సాహిత్యానికి విమర్శకులెంత అవసరమో రుజువు చేస్తున్నది.

శాస్త్రిగారి అవధానాలలో పౌరాణిక భావాలే గాక, దేశభక్తిభావాలు కూడా ఉన్నట్లు నియోగి గారు సోదాహరణంగా పేర్కొన్నారు. గాంధీజీ, సుభాష్‌చంద్రబోస్ వంటి వాళ్ళ మీదనే గాక, శ్రీశ్రీ వంటి కవుల మీద కూడా పద్యాలు చెప్పారు శాస్త్రిగారు. **'కాదేదీ కవితకనర్హం'** అని శ్రీశ్రీగారంటే శాస్త్రిగారు చింతగింజమీద పద్యం చెప్పారని తెలియజేశారు. తిరుపతి వేంకట కవుల మీసాల మీద పద్యం చెప్పినట్లు విన్నాం. శాస్త్రిగారు కూడా మీసం మీద పద్యం చెప్పారని నియోగిగారు తెలియజేశారు. శాస్త్రిగారు సంప్రదాయ

పద్యకవి అయినా వ్యావహారిక భాషను వ్యతిరేకించకపోవడం ఆయన సామాజిక సంస్కారం. ఒక అవధానిని పరామర్శించే విమర్శకునికి అవధాన విద్యా పరిజ్ఞానం ఉండాలి. నియోగిగారికి ఈ పరిజ్ఞానం ఉంది. శాస్త్రిగారి అవధానాలను నియోగిగారు పరామర్శించిన తీరే ఇందుకు నిదర్శనం.

నియోగిగారు ఒక ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావించి, దానిని సూక్ష్మంగా ఒక వాక్యంలో వ్యాఖ్యానించి వదిలేశారు. జటప్రోలు సంస్థానంలో రామసుబ్బరాయకవి అనే ఆయన ఉండేవారట. ఆయన అక్కడ విద్యాధికారి. మహాభారతాన్ని అనువదించారట. జంధ్యాలవారు అక్కడి స్నేహలతా కవితా సంఘం ప్రశస్తిని ఒక పద్యమాలికగా రాసి పంపారు. దానిని రామసుబ్బరాయ కవిలాగా కొనియాడారట. దీనిని నియోగిగారు ఇలా వ్యాఖ్యానించారు. "ఒక మహాపండితుణ్ణి మరో మహాపండితుడు కొనియాడినదిగా దీన్ని మనం భావించాలి. ఈ సంప్రదాయాన్ని నేటి కవి పండితులు ఒంటపట్టించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది". ఈ వ్యాఖ్య చేయడంలో నియోగి గారి అనుభవాలేమోగానీ, నాకు కూడా అనుభవాలున్నాయి.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రత్నలక్ష్మీశతపత్రం (105పాఠాల పద్యమాలిక) శ్రీలక్ష్మీనరసింహస్వామి శతకము, శ్రీశ్రీశ్రీజినకుంట వేంకటేశ్వరస్వామి శతకము, సీతారామకళ్యాణం అనే పద్యనాటకం రచించారు. ఇవి మాత్రమే రాసి ఉంటే శాస్త్రిగారిని పెద్దగా పట్టించుకోవలసిన అవసరం ఉండేది కాదు. అలాంటివి చాలామంది రాశారు గనక. శాస్త్రిగారు శంకర భగవత్పాదుల "వేదాంత పంచదశి"ని "శ్రీమదాంధ్ర వేదాంత పంచదశి"గా అనువాదం చేశారు. నావరకు ఇది కూడా అంత ముఖ్యం కాదు. శాస్త్రిగారు రెండు చారిత్రక కావ్యాలను కూడా రాశారు. అవి మహాకావ్యాలు. అవి సాలంకార కృష్ణదేవరాయలు, ఆంధ్రసామ్రాజ్యము అనేవి. ఇవి రెండూ నియోగిగారు

ఈ రచనలన్నిటినీ ఓపికగా పరామర్శించారు. ఒక కవి ఒక వేదాంత గ్రంథం రాయాలంటే కవికి వేదాంతం తెలిసి ఉండాలి. దానిని పరామర్శించే విమర్శకునికి కూడా ఆ వేదాంతం తెలిసి ఉండాలి. లేకుంటే పరామర్శించడం కుదరదు. నియోగిగారు. ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాల పరిజ్ఞానంతో శాస్త్రిగారి వేదాంతకావ్యానువాదాన్ని పరామర్శించారు.

నియోగిగారు రెండు చారిత్రక కావ్యాలను ఈవిమర్శగ్రంథంలో మూడింట రెండు వంతుల పుటలలో పరామర్శించారు. ఇది న్యాయం కూడా. చారిత్రక కావ్యం రాసే కవికి చరిత్ర తెలియకుండా ఉండదు. ఆ చారిత్రక కావ్యాలను పరామర్శించే విమర్శకునికి చరిత్రజ్ఞానం లేకుంటే పరామర్శ చేయటం కష్టం. నియోగిగారు తెలుగుజాతి చరిత్రజ్ఞానం పుష్కలంగా ఉన్నవారని ఈవిమర్శ గ్రంథం రుజువు చేస్తున్నది.

శాస్త్రిగారు చాలా పరిశోధన చేసి ఈరెండు చారిత్రక కావ్యాలు రచించారు. చరిత్రను పరిశోధించకుండా చారిత్రక కావ్యం రాయడం కష్టం. 'సాలంకార కృష్ణదేవరాయలు' విజయనగర రాజ్య చరిత్రను ప్రతిబింబిస్తుంది. 'ఆంధ్రసామ్రాజ్యము' శాతవాహనుల కాలం నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ దాకా గల తెలుగుజాతి చరిత్రను ప్రతిబింబిస్తుంది. బహుశా తెలుగుజాతి చరిత్ర మీద ఇంత పరిమాణంలో–రెండు కావ్యాలూ కలిపి 5000పద్యాలకు పైగా రాయలేదనుకుంటాను. నియోగిగారు తనకు తానుగా చారిత్రక జ్ఞానం నేపథ్యంగా ఈ రెండు కావ్యాలనూ పరామర్శించారు. ఆంధ్రరాష్ట్రం కోసం పొట్టిశ్రీరాములు చేసిన నిరాహారదీక్షను కవి "వీరనిరాహారదీక్ష"అన్నారు. అలంకార శాస్త్ర పరిభాషలో ఇది వీరరస ప్రధానమైన కావ్యం. ఒక చారిత్రక కావ్యంలోని చారిత్రకత నిరూపించి కవిత్వ విశ్లేషణ చేయడం చారిత్రక కావ్య విమర్శకుని పని. నియోగిగారు చరిత్రను

చెప్పి కావ్యంతో సమన్వయం చేస్తూ పరామర్శించారు. రాజవంశాల కాలనిర్ణయంలో కవితీసుకున్న జాగ్రత్తలు మొదలు అనేకంగా కవి ప్రదర్శించిన నైపుణ్యాలను విమర్శకుడు గుర్తించారు.

ఈ రెండు కావ్యాలూ 1960లలో శాస్త్రిగారు రాశారు. బహుశా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణే ఇందుకు ప్రేరణ అయ్యుంటాయి. దుర్భాక రాజశేఖర శతావధాని "రాణా ప్రతాపసింహచరిత్ర", గడియారం వెంకటశేషశాస్త్రి "శివభారతము", మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి "ఆంధ్రపురాణము", విశ్వనాథ సత్యనారాయణ "ఝాన్సీ లక్ష్మి", "ఆంధ్రపౌరుషము" వంటి అనేక చారిత్రక కావ్యాలు బాగా గుర్తింపు పొందాయి. జంధ్యాల వారి కావ్యాలు ఎందుకు గుర్తింపుపొందలేదు? చారిత్రక కావ్య రచనలు భారత స్వాతంత్ర్యోద్యమకాలంలో ఎక్కువగా వచ్చాయి. అప్పటికి గత చరిత్రను స్మరించుకోవడం ఒక చారిత్రక అవసరం, సాహిత్య అవసరం. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా కొన్ని చారిత్రక కావ్యాలు వచ్చాయి. 1960లు వచ్చేసరికి చారిత్రక కావ్యాల పట్ల ఆసక్తి తగ్గింది. ఇది కారణం కావచ్చు. పైగా అప్పటికి స్వాతంత్ర్యానంతర భారతదేశ పరిణామాల పట్ల విమర్శనాత్మకంగా కవిత్వం రాసే పద్ధతి బాగా బలపడింది తెలుగులో. వచన కవిత ప్రధానవాహికగా ఉంది. ఈ కారణం వల్ల కూడా జంధ్యాల వారి కావ్యాలు మరుగునపడి ఉటాయి.

ఇప్పటికే చారిత్రక నవలలు వస్తున్నాయి. తెలుగుపాఠకులు చదువుతున్నారు. అద్దేపల్లి రామమోహనరావుగారు ఇటీవలే అల్లూరి సీతారామరాజు చరిత్రకు వచన మహాకావ్యంగా రాశారు. పాఠకులు దానిని బాగా ఆదరించారు. అంతకుముందే మల్లెల గురవయ్యగారు అల్లూరి జీవితాన్ని రెండువేల పద్యాలలో రచించారు. పాఠకులు పట్టించుకోలేదు. కారణం

సామాజికమైనది. ఇదీ శాస్త్రిగారికీ వర్తిస్తుంది. నియోగిగారు జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచనలకు విమర్శ ద్వారా వెలుగులోకి తెచ్చారు. ఈనాటి పాఠకులకు ఆయనను దగ్గర చేయాలన్నది నియోగిగారి సంకల్పం. విస్మృతకవి సముద్ధారకులుగా నియోగిగారు నిలుస్తారు. ఇదివరకే నియోగిగారు అనేకమంది విస్మృత రచయితలను వ్యాసాలతో పరిచయం చేశారు. ఇప్పుడు ఒక విస్మృత కవిమీద ఒక విమర్శ గ్రంథమే రాశారు. నియోగి గారి కృషి అభినందనీయం. "అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని" ఈ గ్రంథం పేరు. పాఠకుల చేతులలో ఈ పుస్తకాన్ని పెట్టిన సందర్భంగా నియోగిగారికి శుభాకాంక్షలు.

**–రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి**
**కేంద్ర సాహిత్య అకాడమి పురస్కార గ్రహీత**
**9440222117**

# అక్షరయాత్రలో మరో మజిలీ

**ని**యోగిగారు సీనియర్ పాత్రికేయులు. కొన్ని పదుల పుస్తకాల రచయిత. ఉత్తమ కవి. ఇంగ్లీషు తెలుగు సంస్కృతాల్లో నిష్ణాతులు. వారు ఏ గ్రంథం రాసినా అది సమగ్రంగా వుంటుంది. ప్రధానంగా పాఠకులలో విలువైన విషయాల పరిజ్ఞానం కలిగించటానికి వారు బాగా శ్రమ తీసుకుంటారు. దీంతో వారు రచించిన గ్రంథాలు జ్ఞానదాయకంగా వుంటాయి. ఇక భాషాశైలుల విషయానికి వస్తే పండితుల సమాసభూయిష్ఠమైన శైలిలో కాక, అరటిపండు వలచి అరచేతపెట్టినట్లుండే సరళ వ్యావహారికంలో వుంటూనే సాహిత్య పరిమళాన్ని విరజిమ్మే పద్ధతిలో వారి శైలి వుంటుంది. దీంతో పఠనీయత బాగా పెరుగుతుంది.

ప్రస్తుతం వారు రచించిన 'అక్షరాల అడుగుజాడల్లో పంచ సహస్రావధాని' అన్న గ్రంథం కూడా బ్రహ్మాండమైన పఠనీయతతో, జ్ఞానమార్గంలో సాగుతున్నది. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (1892–1980) మహాపండితులు, కవీశ్వరులు. అష్టావధానులు, శతావధానులు, సహస్రావధానులు వందల సంఖ్యలో వుండే ఆ రోజుల్లో, అందరికీ తలమానికంగా వీరు పంచసహస్రావధానులు! ఈ ఒక్క యోగ్యత చాలు వారి ప్రతిభావ్యుత్పత్తి అభ్యాసాలను వెల్లడించటానికి. నియోగిగారు ఈపుస్తకానికి పెట్టిన పేరు కూడా అందువల్ల సముచితంగా వుంది.

సాధారణంగా అవధానులు మతైకదృష్టి కలిగిన సంప్రదాయవాదులై వుంటారు. ఈరెండూ వున్నా జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిలో శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వాన్ని మెచ్చుకోగలిగే సహృదయత వుండటం అరుదైన లక్షణం. నిజంగా ఇది అభినందనీయం. కవీశ్వరుల ఈ సంస్కార బలాన్ని పాఠకుల

దృష్టికి తీసుకువచ్చినందుకు గ్రంథకర్త కూడా అభినందనీయులే. బహుశా ఈ సంస్కారం తమ గురువర్యులైన చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి నుండి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి సంక్రమించి వుంటుంది.

శాస్త్రిగారు అవధానవిద్యా ప్రదర్శనం నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలో ఎంత పర్యటించారో, తెలంగాణలో కూడా అంతగా పర్యటించారు. సంస్థానాధీశులకు, పండితపక్షపాతులకు, వదాన్యులకు తెలంగాణలో లోటు లేదన్న సత్యాన్ని ఈ అంశం నిరూపిస్తున్నది. అంతేకాదు సీమాంధ్ర అవధానులను ఢీకొనగలిగే పండితప్రకాండులకు కూడా లోటులేదని వీరు రుజువు చేశారు. తెలంగాణ ప్రాంతంలో శాస్త్రిగారు తమ జీవితంలోని అత్యంత విలువైన కాలాన్ని గడిపారు. అష్టావధాన, శతావధాన, సహస్రావధాన, పంచసహస్రావధానాలు చేసి సాహిత్యజీవితాన్ని సార్థకం చేసుకున్నారు. కరీంనగర్‌లో అవధాన విద్య ప్రదర్శించారు. గద్వాలలో 1933లో తమ విద్యను ప్రదర్శించి పాలకులను, పండితులను, ప్రజలను మెప్పించారు. రాణిగారి కోరిక మేరక 30 సంవత్సరాల పాటు పరీక్షాధికారిగా వున్నారు. ఇక్కడే 'నానాదేశ కవీశ్వర పద్యరత్నావళి'ని ప్రచురించారు. కొల్లాపూర్, జటప్రోలులో పాండిత్య ప్రతిభను ప్రకటించారు. యాదగిరిగుట్ట దేవస్థానం వారు 'సహస్రావధానాధ్వదర్శి' అన్న బిరుదు ప్రదానం చేశారు.

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అందరిలాంటి అవధానులు కారు. వారు మంచి చరిత్రకారులు కూడా. వారు మంచి ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నులని కూడా అని వారి రచనలు తేటతెల్లం చేస్తున్నాయి. విషయవస్తువులను బట్టి శైలిని ప్రయోగించటం వారికే చెల్లింది. వర్ణనలను అలంకారిక శైలిలో, చరిత్రను సరళశైలిలో, భక్తిని పోతనలాగా సమర్పణ భావంతో, జ్ఞానదాయక ఘట్టాలను వేమనలాగా అతిసులభశైలిలో నిర్వహిస్తూ వచ్చారు.

విద్యారణ్యులవారి 'వేదాంత పంచదశి'ని 'శ్రీమదాంధ్ర వేదాంత పంచదశి' పేరిట తెనిగించిన జంధ్యాలవారు అతి గహనమైన తాత్విక విషయాలను సరళీకరించారని చెప్పవచ్చు. బౌద్ధమతాన్ని బాహాటంగా ఖండించి, హిందూమత వైభవాన్ని తిరిగి ప్రతిష్ఠించినవారు ఆదిశంకరులేనన్నది అందరికీ తెలిసిందే. వారు ప్రవచించింది అద్వైతం. ఇది జ్ఞానమార్గం. జగన్మిథ్యావాదం. ఇట్లాంటి వివాదాస్పద సందర్భాలలో ఎం.ఎన్.ఘోష్ వంటి చరిత్రకారుల అభిప్రాయాలను క్రోడీకరించి చెప్పటం నియోగిగారి బౌద్ధికమైన నిజాయితీకి రుజువు. ఆచార్య రామానుజుల వారు రచించిన 'శ్రీభాష్యం' లోని గొప్పదనాన్ని ప్రస్తుతించారు. విశిష్టాద్వైతాన్ని నియోగిగారు సగౌరవంగా ప్రస్తావించారు. బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానమే శ్రీభాష్యమని వ్యాఖ్యానించారు. రామానుజులు కులమతాతీత దృష్టితో సమసమాజస్థాపనాచార్యులైన సత్యాన్ని కూడా వారు చెప్పారు. ఇప్పటి ఉభయ తెలుగు రాష్ట్రాలను పరిపాలించిన కాకతీయ వంశం గూర్చి కవిగారికీ, రచయిత నియోగిగారికి పూర్తి అవగాహన వుంది. ప్రాచీన జైనబౌద్ధాలు క్షీణించటంతో శైవవైష్ణవ మతాలు పుంజుకోవటం గూర్చి, రాజ్యాన్ని సామ్రాజ్యంగా విలసిల్లజేసిన గణపతిదేవ చక్రవర్తిని గూర్చి, తండ్రి లక్ష్యాలను ముందుకు తీసుకుపోయిన రుద్రమాంబను గూర్చి, ఆమె వారసుడైన ప్రతాపరుద్రుణ్ణి గూర్చి జంధ్యాల వారు పద్యాలలో రాసిన చారిత్రక అంశాలతో నియోగిగారు పూర్తిగా సమ్మతి కలిగి వున్నారు. ప్రధానంగా జంధ్యాల వారు ప్రస్తావించిన ఆనాటి సాంఘిక ఆర్థిక పారిశ్రామిక, సాహిత్య కళారంగాలకు సంబంధించిన విశేషాలతో ఏకీభవించారు.

ఇట్లా ఆంధ్రసామ్రాజ్య చరిత్ర మొదటిభాగంలో క్రీ.పూ. 221 నుండి క్రీ.శ. 1323 వరకు, రెండవభాగంలో క్రీ.శ. 1324 మొదలు విశాలాంధ్ర (1956) వరకు జరిగిన రాజకవి పరిణామాలను ప్రధానంగా చిత్రిస్తూ

వచ్చారు. ఈరెండు భాగాల చరిత్ర పద్యాలలో కాక వచనంలో వుండి వుంటే అది ఇప్పటి పరిశోధకులకు, విద్యార్థులకు పఠనీయ గ్రంథంగా వుండేది. అత్యంత విలువైన జాతీయోద్యమం కూడా ఈ రెండోభాగంలో చిత్రితమైంది. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పద్యరూపంలో వున్న ఈ విరాట్ చరిత్ర రచనకు పూనుకొని వుండకపోతే కనీసం పది ఛందోబద్ధమైన కావ్యాలు రచించి వుండేవారు. నియోగిగారి అక్షరయాత్రలో ఒక మజిలీగా దీన్ని చెప్పుకోవచ్చు. మొత్తం మీద నియోగిగారు చాలా క్లిష్టమైన బాధ్యతను సాధించారు. ఒకటి–తమ చరిత్ర పరిజ్ఞానంతో శాస్త్రిగారి చరిత్ర గ్రంథాన్ని అనుశీలించటం, రెండు అలంకార రసధ్వనులతో ఒప్పారిన శాస్త్రిగారి గ్రంథంలోని కావ్యలక్షణాలను బేరీజు వేయటం. ఇతర గ్రంథాల విషయంలో కూడా నియోగిగారు ఈ బాధ్యతను నిర్వహించటం ద్వారా తమ రచనలో సమతౌల్యాన్ని సాధించారు. నియోగి గారి కృషి అభినందనీయం.

**– అమ్మంగి వేణుగోపాల్**

**కాళోజీ నారాయణరావు పురస్కార గ్రహీత,**

**9441054637**

# పుంభావ సరస్వత్యై నమః

**హ**రివంశోద్భవులు, జంధ్యాల వంశ పారావార రాకా సుధాకరులు, కవి కిశోర, అవధాన ఫణీంద్ర, సహస్రావధానాధ్వదర్శి, సహస్రావధాన చతురానన, సహస్రావధానాద్యనేక బిరుదాంకితులు శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మా పెదనాయనగారగుట మా అదృష్టము.

గత శతాబ్దమున పండిత ప్రకాండులందరిలో సముచిత గౌరవములు సంపాదించుకుని ఆంధ్ర కవితామ తల్లిని పల్లకీనెక్కించి అశేష ఆంధ్ర దేశమున విద్వన్మణులై కిం కవీంద్ర ఘంటా పంచాననులైభాసిల్లినవారు. వెయ్యేళ్ల తెలుగు పద్యమునకు మరో వెయ్యేళ్ల ఆయుర్దాయమును ప్రసాదించిన ఘనులు.

1.3.1892లో జన్మించి 24.10.1980వరకూ పూర్ణపురుషాయుష్కులై, సాహితీలోకమున అజరామరమైన కీర్తి సముపార్జించినవారు.

అనేక రాజాస్థానములు సంచరించి అనంత గౌరవమునార్జించి నాటి కవి పండిత లోకమున దిదృక్షాయమానులై ప్రకాశించినవారు. అతులిత మేధాసంపన్నులు ఆంధ్రదేశమున పంచసహస్రావధానులు మా పెదనాయన గారొక్కరే మహబూబ్‌నగర్ జిల్లా నుంచి పశ్చిమ గోదావరి జిల్లా వరకూ గల అనేక ప్రాంతములు సంచరించి తమ అవధాన ప్రతిభచే పండిత ప్రకాండుల నుండి పామరజనము వరకూ తమ కవితా ప్రావీణ్యంతో మెప్పించి మెప్పులు పొందినవారు. వారికి స్వర్ణ పత్ర ఖచితాక్షర పత్రిక సమర్పింపబడినదని, వారికి స్వర్ణపుష్ప కనకాభిషేకము జరిగినదని ఎందరకు తెలియును.

అవధానములు కనుమరుగైనవి. భారతీయ విద్యావిధానము మారుటతో మస్తకములలో ఉన్న విద్య పుస్తకములలోకి చేరినది. నాటి పత్రికలు అభినవసరస్వతీ, వైజయంతీ, నవభారతీ లాంటి పత్రికలు వారి రచనలు ముద్రించినవి. వృద్ధాప్యాన్ని దరిచేరనీయకుండా అనేక పద్యాలు పాడుకునే వారట. పద్యము పాడుటయన్న సాంప్రదాయము ఎన్నడో చచ్చిపోయినది.

దానిని తమ మధుర కంఠముతో జీవించి ఉన్నంతవరకూ కాపాడినవారు మా పెదనాయనగారు 1914 నుండి 1974 వరకూ ఆంధ్రదేశమున అవధాన సరస్వతిని పల్లకీనెక్కి ఊరేగించిన ఘనత శ్రీ శాస్త్రిగారికే దక్కినది. 32 గ్రంథములు వ్రాసిన మా పెదనాయనగారి రచనలు 32 ముద్రితములైనవని వారి కుమార్తె మా సోదరి శ్రీమతి జంధ్యాల కుసుమకుమారి ఆంధ్రదేశమునకు తెలుపువరకూ ఆయనను గూర్చి ఆలోచించలేకపోవడానికి ఈ ఆంగ్లేయ విద్యావిధానమే ఈ మోహములో మనవారు మన మాతృభాషనే మరిచి పోవుచున్న చెడ్డకాలము. ఈ మోహమును గుర్తించిన మా పెదనాయనగారు ఆరోజులలోనే తిరిగి విద్యను మస్తకములలోకి తెచ్చుటకు ఆంగ్లములో "సక్సెస్ ఇన్ వన్ రీడింగ్" పుస్తకము ముద్రించిరి. ఇంతకంటె క్రాంత దర్శిత్వము ఏమి కావలయును. ఎవరికి కలదు.

సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి సముచిత గౌరవము రాలేదన్న కొందరికి సమాధానముగా మా సోదరి స్పందించినది. స్పందన ఏమి, విజృంభించినది. మా పెదనాయనగారు ఎన్ని గ్రంథములు వ్రాసిరో అన్నిటినీ ఆంధ్రదేశీయులకు తెలుపవలెనని పంచసహస్రావధాని బ్రహ్మశ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి జీవితము సాహిత్యము అన్న పరిశోధనాత్మక స్థాయిలో ముద్రించి ఆంధ్రదేశములోని అవధానులందరికీ అందునట్లు చేసినది. ఆమె మరో ముద్రణ సాలంకార కృష్ణదేవరాయలు, మరొక ఉద్గ్రంథము విద్వన్మణి.

ఈ స్పందన విజృంభణ శ్రీ నియోగి గారితో ఇవాళ ఈ పుస్తకము వ్రాయించినది. వారి సాలంకార కృష్ణదేవరాయల గ్రంథము అలంకార గ్రంథ గ్రంధి విశ్లేషణము. దీనిలో 100కు పైగా అలంకారాలు ప్రస్తావించడం ఓ గొప్ప ప్రయోగం.

వారి ఆంధ్రసామ్రాజ్యము 4339 పద్యాల ఉద్గ్రంధము ఇట్టి చారిత్రాత్మక కావ్యమును ఇంత పెద్ద పద్య గ్రంథమును రచించిన వారు ఆంధ్రదేశమున నభూతో నభవిష్యతి. రాయవచ్చును కదా అనే వారికి రాసినప్పుడు కదా అన్నది సమాధానము జంధ్యాలాన్వయ పూర్ణచంద్రునిగా కవితా సామ్రాజ్య

దేవేంద్రునిగా ప్రస్తుతింపబడినారు. ఇంకేమి కావలయును. అద్యతనాంధ్ర రసమయ ప్రపంచమునకు తమ తండ్రిగారి ప్రతిభను తెలుగువారికందించి వారి కవన సామ్రాజ్యమునకు మరోసారి పట్టాభిషిక్తుణ్ణి చేసిన మా సోదరి జంధ్యాల కుసుమకుమారిని ఏమని ప్రశంసించను శుభాశీస్సులనొసంగుట తప్ప.

పితృఋణము తీర్చుటయనగా తమ తండ్రి గారిని మరో వందేళ్లు బ్రతికించుట తప్ప మా సోదరి చేసిన పని పితృఋణ విమోచనమే. పట్టిన ప్రక్రియలను సువర్ణ శోభితము చేసిన మా పెదనాయన గారికి నమస్కరించుట తప్ప. కె. రమాదేవి సాలంకార కృష్ణదేవరాయలలో అలంకార పరిశీలన మా పెదనాయనగారి ప్రతిభకు నిలువుటద్దము.

**కావ్యం యశసే అర్ధకృతే వ్యవహారవిదే**
**శివేతరక్షయతే సద్యఃపరనివృత్తయే**

ఆంగ్ల విద్యా విధానము వలన ఆంధ్రదేశము మరిచిన కవిని పునః ఆంధ్రులకు అందించవలెనన్న **'అక్షరాల అడుగుజాడల్లో పంచ సహస్రావధాని'** అనే పేరుతో శ్రీ నియోగి గారి గ్రంధం ఈ శతాబ్దంలో వారికి పునర్జన్మని ప్రసాదించింది.

శాస్త్రిగారికి ఏ జన్మలో ఋణమో అది ఈ గ్రంధము ద్వారా శ్రీ నియోగిగారు తీర్చుకుంటున్నారు. మా అందరి తరపున కృతజ్ఞతలు. మాసోదరి కుసుమకుమారి మా బావగారు కోటేశ్వరరావు గారి ప్రేరణ వాళ్ల సంతానం చంద్రాదిత్య, భార్య రాధిక, సంతానము ప్రణవ్, మౌక్తికలు కుమార్తె సింధూర అల్లుడు సాయిరాం మనుమలు భార్గవ, సాకేత్‌లు శతవిధాలా ప్రోత్సహించుట వలన మా సోదరి ఇన్ని పుస్తకాలు ముద్రించుట సాధ్యమైనది. గత శతాబ్దపు తండ్రిగారిని ఈ శతాబ్దమునకందించినది.

వారి రచనలన్నీ కలిపి ముద్రించిన ఇంకో సహస్రాబ్దము వారు ప్రజలతో మమైకపోవుట నిశ్చయము. చాలా మంది ప్రముఖుల చాలా రచనలు ఒకచోట జాగ్రత్త పరచకపోవుటచే అవి కనుమరుగైపోయి కవులు మరుగునపడుతున్న చెడ్డకాలము. అందుకే ఈ మధ్యకాలమున కవుల సమగ్ర రచనా సంపుటములు ముద్రింపబడుచు కవికి శాశ్వతత్త్వము కల్పించుచున్నారు

వారి సంతానము. ఇట్టి ప్రయత్నము ఆంధ్రదేశమున అందరూ చేయవలయునని ప్రార్ధన. ఈ యత్నము అందరూ చేసిన ఓ వైపు పితృఋణము మరోవైపు వారికి శాశ్వతత్వము లభించును. తల్లిదండ్రుల ఆస్తులు అనుభవించుచున్నట్లు వారి సాహిత్యమును తరువాత తరములకు అందించవలసిన అవసరమును అందరూ గుర్తించవలసిన అవసరమున్నదని ఆంధ్రదేశమును సుసంపన్నము చేయవలసిన ఆవశ్యకతను గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

ఈ ప్రేరణతో మరెన్నో పుస్తకాలు పుడితేనే వ్రాసిన వాక్యము చిరంజీవిత్వము సాధించుకున్నట్లే. సాహితీ బంధువులారా పితృఋణం తీర్చుకునే ప్రయత్నం చేయండి.

నేటి సాహిత్య చరిత్రకారుల ప్రయాణమెటు సాగుతున్నదో నేటి సృజనకారుల ప్రయాణమెటు సాగుచున్నదో అంతుచిక్కదు. ఈ క్రమంలో అలా విస్మరించబడిన గొప్ప సాహిత్య సృజనకారులను కొందరినైనా స్మరించుకుంటూ సాహిత్య లోకానికి వీరి సేవలను గురించి తెలపాలనే శ్రీ నియోగి గారి యత్నం ఈ గొప్ప ప్రయత్నం. ఈ ప్రయత్నంలో అక్షర నక్షత్రాల పేర 111మంది సాహితీవేత్తలను పరిచయం చేసిన ప్రముఖులు. వారి గ్రంధమును పరిశీలించుట నా అదృష్టము.

ముంజేతి కంకణమునకు అద్దమేల. దీని పూర్వభాగము నే చెప్పితిని. ప్రస్తుత భాగము సహృదయ సాహితీ బంధువులు పఠించి సమాదరింతురుగాక. శ్రీ నియోగి గారు ఇలా ఎన్నో వ్రాయాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

**జయంతితే సుకృతినో రససిద్ధా కవీశ్వరః**

**శుభం భూయాత్**


**భవదీయుడు**

**హరి సనత్కుమార్**

**రిటైర్డ్ ప్రిన్సిపాల్-వరంగల్**

**9849392400**

# విమర్శకు వన్నె తెచ్చిన నియోగి

**ఒ**క కవి గురించి చెప్పాలంటే వారు రచించిన రచనల్లో, విశేష ప్రాచుర్యం పొందినా, చరిత్రలో నిలిచిపోయినవి కొన్నింటి గురించి చెప్పాలి. అయితే విస్తృతంగా రాసి కూడా కొందరు సరి అయిన గుర్తింపును, ప్రాచుర్యాన్ని పొందకపోవడం సాహిత్య చరిత్రలోపమనే చెప్పాలి. అంతే తప్ప ఆ సాహితీవేత్త లోపమని చెప్పలేము, చెప్పకూడదు. ఇటువంటి మహాగొప్ప సాహితీవేత్త, పరిశోధకులు, నా స్నేహితురాలు కుసుమ తండ్రిగారు, పంచసహస్రావధాని కీ॥శే॥ జంధ్యాల సుబ్రమణ్యశాస్త్రిగారు ఒకరు.

కుసుమ, నేను ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్‌లో సహోద్యుగులం. తండ్రి సాహిత్య వారసత్వాన్ని కుసుమ అందిపుచ్చుకుంది. నేను సచివాలయంలో "చేతన సచివాలయ సాహిత్య వేదిక" అధ్యక్షురాలిగా కవిసమ్మేళనాలు నిర్వహించినప్పుడు తమ కలాలు ఝళిపించి కవితలు రాయమని సచివాలయంలోని సాహితీ పిపాస కలిగిన వారందరిని ప్రోత్సహించేవాళ్ళం. అలా నిర్వహించిన కవిసమ్మేళనాల్లో కుసుమ కూడా పాల్గొనేది. అలా తనతో నాకు పరిచయం. అది కూడా బాగున్నారా! అని పలుకరించుకునేంత మాత్రమే. సచివాలయంలో నాతో పాటు చేరిన "నవనీతం" అనే నా క్లోజ్‌ఫ్రెండ్‌కి ఫ్రెండ్ కుసుమ. సచివాలయంలో మనం ఒక డిపార్ట్‌మెంటులో చేరితే, అక్కడే ఉండిపోము, వేరే చోటుకు బదిలీ అవుతాము. అలా నేను నవనీతం కార్మిక సంక్షేమశాఖ నుంచి వేరుపడినప్పుడు కుసుమ నవనీతం ఫ్రెండ్‌గా నాకూ స్నేహితురాలయింది. ఒక రకంగా చెప్పాలంటే పదవీవిరమణ తర్వాతే నేనూ కుసుమా దగ్గరయ్యాము. నేను కవయిత్రిగా అనేక కార్యక్రమాలలో పాల్గొన్నప్పుడు తను ఆ కార్యక్రమాలకు వచ్చి నన్ను శాలువాతో సత్కరించి వెళ్లేది.

సాహిత్యరంగంలో నేను ఎదుగుతున్న కొలది ప్రతి సందర్భంలోనూ ఎట్టి ఈర్ష్యాఅసూయలు లేకుండా మనస్ఫూర్తిగా సంతోషించేది. ఇక్కడ మరొక విషయమేమంటే కుసుమ కూడా ఒక మంచి రచయిత్రి. అయితే తను నిండుగోదారిలా నెమ్మదిగా వుంటుంది. నేనేమో గలగల గోదారిలా వుంటాను. అది నా స్వభావం. అయినా మా స్నేహం పెరుగుతూనే వస్తున్నది.

ఒక సందర్భంలో తనలో ఏదో నిర్వేదం, నిరుత్సాహం ఆవరించి ఉన్నాయని గ్రహించాను. దాన్ని పారద్రోలడం నా బాధ్యతనుకున్నాను. ఒక స్నేహితురాలిగా, అడపాదడపా తనకి ఫోన్‌చేసి కవిత రాసి ఫలానా పత్రికకు పంపమని ప్రోత్సహించేదాన్ని సభలకు నాతోపాటు తీసుకెళ్ళేదాన్ని. అలా మా స్నేహం గాఢస్నేహంగా మారింది. అదే సందర్భంలో "అక్షరనక్షత్రాలు" పేరుతో నియోగిగారు రాస్తున్న ధారావాహికలో కుసుమతండ్రిగారి గురించి రాస్తే బాగుంటుంది అనిపించి నియోగి గారికి మీ నాన్నగారి గురించి పంపమని చెప్పాను. అలా ఒక వ్యాసం రాసి నియోగిగారు ప్రచురించారు. నియోగి గారికి కూడా విస్తృతంగా కుసుమ తండ్రిగారి గురించి రాయాలనే ఆలోచన పురుడు పోసుకున్నది. అదే సమయంలో కుసుమ లండన్‌లో ఉన్నది. ఆమె వచ్చిన తర్వాత నేను కుసుమ నియోగిగారిని కలవడం, కుసుమ నాన్నగారి రచనలు అందించడం, ఆయన శ్రద్ధపెట్టి గొప్పగా అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని" అనే విమర్శాగ్రంథాన్ని రాయడం జరిగింది. ఇదంతా ఎందుకంటే ఈ గ్రంథం వెలువడే ముందు జరిగిన పూర్వాపరాలను తెలపాలని మాత్రమే. ఇక్కడ నియోగిగారి గురించి చెప్పాలి. ప్రముఖ పాత్రికేయునిగా, సాహితీవేత్తగా, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ద్వారా ఉత్తమ విమర్శకునిగా ప్రతిభా పురస్కారమందుకున్న విమర్శకునిగా పేరుపొందినవారు. వారు నాకు మంచిమిత్రులు, సోదరులు. వారి శ్రీమతి నాగలక్ష్మి గలగల

మాట్లాడుతూ అందరితో కలిసిపోయే ఆత్మీయురాలు. నియోగిగారు "అక్షర నక్షత్రాలు" పేరిట చరిత్రకందని సాహిత్యకారులనెందరి గురించి రాసి 111 మందితో మొదటి సంపుటిని ముద్రించారు. ఆ పుస్తకం మండలిబుద్ధప్రసాద్ గారి చేతులమీదుగా అమెరికాలో గ్రాండ్‌గా రిలీజ్ అయింది.

మరో వందమంది సాహితీకారుల గురించి రాసి ఉన్నారు. అందులో మా తండ్రిగారి గురించి, మా తాతగారి గురించి, కుసుమ తండ్రిగారి గురించి అలాగే మరెందరో సాహితీకారుల గురించి ఉంది. నియోగిగారి ఈ విమర్శా గ్రంథరచన సందర్భంలో కుసుమతండ్రిగారికి మా తాతగారికి స్నేహముందని, వారివురు చెళ్ళపిళ్ళవారి శిష్యులని తెలిసింది. నియోగిగారి అక్షరనక్షత్రాల వల్ల ఈ విషయం తెలిసినందుకు ఆయనకు కృతజ్ఞతలు.

ఇక ఈ అక్షరాలు "అడుగుజాడల్లో పంచసహస్రావధాని" గ్రంథం తెలుగు విమర్శ రంగానికి వన్నె తెస్తుందని నేను గాఢంగా నమ్ముతున్నాను. ఇదొక సాహిత్య విజ్ఞాన గ్రంథంగా రూపుదిద్దుకున్నది. ఇది ఆగకుండా చదివించగలిగే రీతిలో నియోగిగారు రాశారు. ఎక్కడెక్కడో చరిత్రలో నిక్షిప్తమైన అనేక విషయాలను ఇందులో ఆయన చూపించారు. సందర్భానుసారంగా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పద్యాలనుటంకిస్తూ ఆయన విమర్శ చేశారు. తెలంగాణలో విమర్శకులు తక్కువన్న అపవాదు నియోగిగారి ద్వారా పూర్తిగా తుడిచి పెట్టుకుపోతుందని నేను చెప్పగలను. ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలు మొదలుకొని సామ్రాజ్య చరిత్రలు వరకు నియోగిగారికి తెలుసునని ఈ గ్రంథం నిరూపిస్తుంది. ఇక నేను చెప్పేదానికన్నా గ్రంథం మీ చేతుల్లో ఉంది గనుక చదివి మీరే గ్రహించమని కోరుతున్నాను.

**– డా॥కేతవరపు రాజ్యశ్రీ**

**హైదరాబాద్. సెల్.నెం. 8500121990**

# నియోగికి ఆశీస్సులు

**చ**తుష్షష్టి కళలలో ఒకటైన అవధానం ఒక అపూర్వమైన కళ. ఇది తెలుగునాట వర్థిల్లినట్లుగా మరెక్కడా వృద్ధి చెందలేదు. అవధాన రంగంలో ప్రప్రథమ 'పంచసహస్రావధాని'గా పేరొందినవారు మా పితృపాదులు కీ॥శే॥ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (1892–1980). వారు అనర్గళమైన ఆశు కవితాసంపద, అసాధారణ ధారణాశక్తి, సద్య:స్ఫురణ, భాషాపటిమ కలిగినవారు. అవధానంలో తనదైన ఒక ప్రత్యేక మార్గం రూపొందించుకొని దానిని సహస్ర, పంచ సహస్ర స్థాయిలో నిలిపి, అనేక చోట్ల విజయవంతమైన ప్రదర్శనలిచ్చి నాటి విద్వత్కవులను మెప్పించారు. "బహుసహస్రావధానమే సహజధనము" అని సగర్వంగా చెప్పుకున్నారు. అనేక సత్కారాలు, బిరుదులు పొందారు.

ఇటీవల అవధాన విద్య యొక్క పూర్వాపరాలను శతాధిక అవధానుల (సాహిత్య) విశేషాలను జగద్విదితం చేస్తూ, డా॥ రాపాక ఏకాంబరాచార్యుల వారు 'అవధాన విద్యా సర్వస్వం' అనే గ్రంథాన్ని వెలయించారు. దానిలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి సముచితమైన స్థానం కల్పించారు. అవధాన చరిత్రలో (సుస్థిరస్థానం) స్మరణీయులుగా శాశ్వతస్థానమలంకరించారు. మా తండ్రి గారి సాహిత్యాన్ని పదిలపరిచే కార్యక్రమంలో భాగంగా 1. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి జీవితము–సాహిత్యము 2. విద్వన్మణి అను సంకలనాలను వెలువరించాను. శ్రీకృష్ణదేవరాయల పంచశతాబ్ది ఉత్సవాల సందర్భంగా "సాలంకార కృష్ణదేవరాయలు" పునర్ముద్రించబడింది. 2013సం. రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి వారు గుర్తించి సమాదరించారు. ఉచితరీతిలో మా తండ్రిగారి సాహిత్యంలోని కమనీయ కల్పనలను, (సు) శాబ్దిక సంపదను

నేటితరం వారికి తెలియజేయాలని ఆకాంక్షిస్తున్న తరుణంలో నా ఆత్మీయ సహోద్యోగిని, ప్రఖ్యాత రచయిత్రి, డా॥ కేతవరపు రాజ్యశ్రీ సహాయపడింది. సాహిత్యశ్రీ, ప్రజ్ఞాశ్రీ వేదాంత వక్త భారత్ భాషాభూషణ్ వంటి బిరుదులు అందుకొన్న రాజ్యశ్రీ, స్నేహపూర్వకంగా శ్రీ నియోగి గారిని పరిచయం చేసింది. శతాధిక కవులను "అక్షరనక్షత్రాలు" అనే రచన ద్వారా పరిచయం చేసిన నిశిత విమర్శకుడు శ్రీ నియోగి. నా ఆశయానికి రూపకల్పన చేసి "అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని" అనే పుస్తకాన్ని అందించారు. ఒక కావ్యనిర్మాతలో గల వైదుష్యాన్ని వ్యక్తపరిచే భారం తనదిగా భావించి, భుజస్కంధాలపై వేసుకొన్నారు.

మా తండ్రిగారి సాహిత్యాన్ని శ్రీ నియోగిగారు వివిధ కోణాల నుంచి పరిశీలించారు. అవధాన పద్యాల సొగసులతో బాటు, వాటిలో ఇమిడి ఉన్న దేశభక్తిని, మానవతావాదాన్ని ఎత్తిచూపారు. శ్రీనియోగిగారు మా తండ్రిగారు అనువదించిన విద్యారణ్యుల వారి 'వేదాంత పంచదశి'ని గురించి చర్చిస్తూ, సంబంధిత నేపథ్యం చేకూర్చారు. వివిధ భక్తిమార్గదర్శకుల సిద్ధాంతాలను సైతం చక్కగా విశదీకరించారు.

"సాలంకార కృష్ణదేవరాయలు", "ఆంధ్రసామ్రాజ్యము" అను చారిత్రక పద్యకావ్యాలు సాహిత్యపరంగా ఘనమైనవి. దేశ, కాల స్వరూపాలు, వాస్తవిక, చారిత్రక ఆధారాల వినియోగం, సంఘటనల మధ్యగల కార్యకారణ సంబంధం మొదలగునవి చారిత్రక రచనకు మూలస్తంభాలు. మా తండ్రిగారు ఎంచుకొన్న పద్యప్రక్రియలో, చరిత్ర కావ్యకల్పనలకు సమప్రాధాన్యతనిచ్చి పై గ్రంథాలు రచించారు. అలంకార దీప్తులతో, అసమాన వర్ణనా నైపుణ్యంతో విరాజిల్లే ఈ రెండు కావ్యాలను, శ్రీనియోగిగారు ప్రత్యేక శ్రద్ధాసక్తులతో

పరిశీలించారనడం అతిశయోక్తి కాదు. ఈరచనలలోని చారిత్రకాంశాలను, మరిన్ని చారిత్రక విశేషాలను జోడించి, ఆసక్తికరంగా అందించారు.

"కృష్ణానది"ని వర్ణించిన సందర్భంలో కౌశలం తనను అబ్బురపరిచినట్లు పేర్కొన్నారు నియోగిగారు. శాస్త్రిగారు ఏది వ్రాసినా అందులో లీనమై, అనుభూతిని చెంది ఆ అనుభూతిని మనకు అందిస్తారు(99వపేజీ) అని వ్యక్తపరిచారు. ఈ మాటలు అక్షరసత్యాలు కవి యొక్క హృదయాంతర్గత భావాలను, సుకుమారంగా స్పృశించి, ఒక విధమైన పారవశ్యంతో ఈ రచన చేశారనిపిస్తుంది. మూలగ్రంథాల ముఖ్యోద్దేశ్యాన్ని పదిలపరుస్తూ, ఎంతో పరిశ్రమించారు నియోగిగారు. ఈ విమర్శనాత్మక రచన చేయడం అద్భుతమైన విషయం. మా తండ్రిగారు సంప్రదాయబద్ధ కవిత్వాన్ని మాత్రమే విశ్వసించి, ఆ మార్గంలో సాగారు. పై రచనల కాలం నాటికి పద్యరచనలకు ఆదరణ తగ్గిందని చెప్పవచ్చు. కాని ప్రతిభకు ఎప్పుడూ వన్నె తరగదు.

శ్రీ నియోగి గారి అనల్పకృషి మాన్యుల మన్ననలనందుకుంటుందని ఆశిస్తున్నాను.

**స జీవతి యశోయస్య కీర్తిర్యస్య సజీవతి.**

**–జంధ్యాల కుసుమకుమారి**
**హైదరాబాదు.**

# కృతజ్ఞతతో నాదోమాట

**కొ**న్ని గ్రంథాలను రాయాలంటే విశేష కృషి చేయవలసి ఉంటుంది. అవసరమైన పరిశోధన తప్పనిసరిగా చేయవలసి ఉంటుంది. అలాగే పుస్తకం వెలుగు చూసే క్రమంలో ఎందరెందరి సహకారం అవసరం ఉంటుంది. నేను 'అక్షరనక్షత్రాలు' వెలువరించిన సందర్భంలో కొందరు మహాపండితుల గురించి తెలుసుకోవడం, వారి రచనలను విస్తృతస్థాయిలో పరిచయం చేయాలని సంకల్పం కలగడం జరిగింది. అటువంటివారిలో విద్వన్మణి, పంచసహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారొకరు. అలంకార, వ్యాకరణ, తత్త్వ, తర్కశాస్త్ర కోవిదులు వారు. అయితే వారి గురించిన పూర్తి సమాచారం నావద్దలేదు. అయినా వారి గురించి రాయాలనే సంకల్పం బలంగానే ఉంది. అదృష్టవశాత్తు గౌరవనీయ సోదరి డా॥కేతవరపు రాజ్యశ్రీగారి ద్వారా శాస్త్రిగారి కుమార్తె జంధ్యాల కుసుమకుమారిగారి పరిచయం కలిగింది. ఆ పరిచయబలమేమోగాని ఆమెగారు మరో ఆత్మీయసోదరయింది. ఆమెగారి ద్వారా పంచసహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారి గురించి తెలపడమే గాకుండా కొన్ని గ్రంథాలను అందించడం జరిగింది. ఇది ఒక శుభపరిణామంగా భావించాను.

అవధాన విద్యలో ఆరితేరిన శాస్త్రిగారు రాసిన గ్రంథాలన్నీ పద్యాలతో నిండి వున్నవే. ఆయన ఎక్కడా వచనం రాసి ఉండలేదు. అయితే ఒక గొప్ప విషయమేమంటే వారి పద్యాలన్నీ సరళమైన భాషలో ఉండటం నా సంకల్పాన్ని సుగమం చేసిందని చెప్పాలి. వారి "ఆంధ్రసామ్రాజ్యం" గ్రంథం నాలుగువేల పద్యాలతో నిండి వున్న మహాగ్రంథం, అలాగే సాలంకార కృష్ణదేవరాయలు గ్రంథం దాదాపు తొమ్మిదివందల పద్యాలతో నిండి ఉండి అలంకార శాస్త్రానికి వన్నెతెచ్చిన గ్రంథం. ఇలా వారి రచనా విశిష్టతను నేను తెలుసుకోవడమేగాక

పదిమందికి తెలిపే గొప్ప అవకాశం కుసుమకుమారి గారి ద్వారా నాకు కలిగింది. ఇది ఒక అదృష్టంగా భావిస్తున్నాను.

ఇక నేను ఆ గ్రంథాలను చదివి నా పరిజ్ఞానం మేరకు అర్థం చేసుకొని ఈ "అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని" గ్రంథాన్ని అందించాను.

గ్రంథాన్ని పూర్తి చేసిన తర్వాత కుసుమకుమారిగారు తానే ముద్రిస్తానని ముందుకొచ్చారు. ఇది నాకు దక్కిన మరో అదృష్టంగా నేను భావించాను. గ్రంథాన్ని ముద్రించడానికి వెంటనే పూనుకొని సకాలంలో వారు పూర్తిగా వించారు. ఇందుకు వారికి సర్వదా కృతజ్ఞతలు. సోదరి కుసుమకుమారిగారు తలపెట్టిన ప్రతిపనిలోను ఎల్లప్పుడు తోడునీడగా, అండదండగా నిలచే వారి భర్తగారు గుడిపాటి కోటేశ్వరశర్మగారు భౌతికంగా లేకపోవడం తీరనిలోటుగా చెప్పక తప్పదు. అయినప్పటికీ దుఃఖసందర్భాలను ఎదురీదుతూనే భర్తగారు తనను ఆశీర్వదిస్తూ ముందుకు నడిపిస్తూనే ఉంటారనే భావనను మనసెల్లా నింపుకున్నారామె.

ఒక సంకల్పబలంతో తన తండ్రిగారి పట్ల గల గౌరవాభిమానాలను వ్యక్తపరుస్తూ వస్తున్నారామె. ఈ గ్రంథ ముద్రణకు అదే తోడ్పడిందని చెప్పకతప్పదు. అంతేగాకుండా తన తండ్రిగారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చేసిన విశిష్ట సాహితీకృషిని లోకానికి తెలియజేయాలనే బలమైన కాంక్ష కూడా దీనికి తోడైయింది. కల్మషాలంటని హృదయాలు గల మనుషుల సంకల్పానికి ఎదురుండదని నేను భావిస్తాను. అటువంటి వ్యక్తే కుసుమకుమారి గారని చెప్పకతప్పదు. కోటేశ్వరశర్మ, సుబ్రహ్మణ్యశాస్త్రిగార్ల దివ్యాశీస్సులతో ఆమె ఈ సాహిత్య సేవను కొనసాగించగలరని ఆశిస్తున్నాను.

నేను ఈ "అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని" గ్రంథం పూర్తిగావించడానికి ఒక సంవత్సరకాలం పట్టింది. కొంత చరిత్ర పరిశోధన

గావించవలసి వచ్చింది. ఒక రకంగా సంవత్సరకాలమంటే తక్కువ కాలమేనను కుంటాను. దీన్ని నేను పూర్తిచేయడం, పుస్తకరూపం సంతరించుకోవడం సంతోషం కలిగించింది.

ఇక నా సాహిత్య ప్రయాణంలో ప్రతిక్షణం అండగా నిలుస్తూ తన ఆశీస్సులందిస్తున్న ఆత్మీయసోదరి, ప్రముఖ కవయిత్రి, రచయిత్రి కేతవరపు రాజ్యశ్రీగారు నా అభివృద్ధిని కాంక్షిస్తూ ఈ గ్రంథం విషయంలో కూడా తన అమూల్యమైన అభిప్రాయాన్ని "విమర్శకు వన్నె తెచ్చిన నియోగి" పేరుతో తెలియజేశారు. ఇందుకు సోదరి రాజ్యశ్రీ గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. కుసుమకుమారి, రాజ్యశ్రీగార్ల వంటి ఆత్మీయమైన వారికి ఈ గ్రంథం అంకితమివ్వడం సముచితమని మనస్ఫూర్తిగా భావించాను. ఇది నేను వారికి ఇవ్వగలిగిన చిన్నగౌరవంగా భావిస్తున్నాను.

ఇక "విస్తృతకవిని వెలుగులోకి తెచ్చిన నియోగి" పేరుతో ముందుమాట అందించిన కేంద్రసాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత ఆత్మీయులు శ్రీ రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారికి, "అక్షరయాత్రలో మరో మజిలీ" పేరుతో నన్నాశీర్వదించిన కాళోజీ నారాయణరావు పురస్కార గ్రహీత అమ్మంగి వేణుగోపాల్‌గారికి, "పుంభావసరస్వత్యైనమః" పేరుతో తమ అమూల్య అభిప్రాయాన్ని తెలియజేసిన పెద్దలు హరిసనత్కుమార్ గారికి, "నియోగికి ఆశీస్సులు" పేరుతో ఈ గ్రంథంపై తనకు కలిగిన భావనని తెలిపిన సోదరి కుసుమకుమారిగారికి, డి.టి.పి. చేసిన దేవయాని, శ్యాంప్రసాద్‌కి, కవర్‌డిజైన్ చేసిన రమ్య, కె.శ్రీధర్‌కు కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాను.

**– నియోగి**

**సెల్.నెం. 9553097319**

**సా**హిత్యకారులు తమ సృజనను ప్రపంచానికి అందించడానికి నిరంతరం కృషి చేస్తూ తమ వంతు బాధ్యతను నెరవేరుస్తారు. ఒక కవి లేక రచయిత పేరు చెప్పగానే వారి రచనలన్నీ కాకపోయినా సాహిత్య లోకంలో విశేష ప్రాచుర్యం పొందిన రచనలు మనకు కనిపిస్తాయి. అలా ప్రాచుర్యం పొందిన వాటిని పునర్ముద్రిస్తూ చదువరులకు చేరువ చేయడం కనిపిస్తుంది. శ్రీశ్రీ పేరు చెప్పగానే మహాప్రస్థానం, విశ్వనాథ పేరు చెప్పగానే వేయిపడగలు, తిలక్ పేరు చెప్పగానే అమృతం కురిసిన రాత్రి, ఆరుద్ర పేరు చెప్పగానే సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సోమసుందర్ పేరు చెప్పగానే వజ్రాయుధం, కరుణశ్రీ పుష్పవిలాపం ఇలా గుర్తుకు రావడం సహజంగా జరిగేదే. దీనికి కారణం సాహిత్య చరిత్రకారులు అట్టి కవులకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చి వారి రచనలకు ప్రాచుర్యం కల్పించడమే. ఇక కొందరు మరికొందరిని మోస్తూ వారి గురించి ప్రచారం చేయడం కూడా కాదనలేని సత్యం. అయితే పైన పేర్కొన్న కవుల రచనలను ఏ మాత్రం తక్కువ చేసి చూడలేమనేది విస్మరించకూడని నిజం. ఇలా ప్రాచుర్యం పొందిన కవులు, రచయితలు అనేకమంది మన తెలుగు సాహిత్య ప్రపంచంలో మనకు దర్శనమిస్తారు. అయితే గొప్ప రచనలు చేసి కూడా, గొప్ప పరిశోధనలు గావించి కూడా తెలుగు సాహిత్య చరిత్రలో విస్మరింపబడిన సాహిత్య సృజనశీలులెందరో ఉన్నారు. కొందరు సాహిత్య చరిత్రకారులు వారి వారి పరిధిలో వారికందిన సమాచారం మేరకు చరిత్రనందుంచి సంతృప్తి చెందితే, మరికొందరు కావాలని కొందరిని తక్కువ చేసి చూపించిన సందర్భాలు, పూర్తిగా దూరంగా పెట్టిన సందర్భాలు తక్కువేమీ కాదు. నేటి సాహిత్య చరిత్రకారుల ప్రయాణమెటు సాగుతున్నదో, నేటి సృజనకారుల ప్రయాణ మెటు సాగుతున్నదో అంతుచిక్కదు. ఈ క్రమంలో అలా విస్మరింపబడిన

గొప్ప సాహిత్య సృజనకారులను కొందరినైనా ఒకసారి స్మరించుకుంటూ సాహిత్యలోకానికి వారి సేవలను గురించి తెలపాలని నేను భావించాను. ఈ మార్గంలో కొందరి సమాచారం సేకరించడం వారి సాహిత్య కృషిని తెలపడం చేస్తూ వస్తున్నాను.

ఇటీవల నేను "అక్షర నక్షత్రాలు" పేరుతో నూట పదకొండు మంది సాహిత్యకారుల పరిచయాలనందించాను. అలాగే మరో వందమంది సాహితీవేత్తల పరిచయాలను సేకరించి ఆంధ్రప్రభ ఆదివారం సంచికలో ప్రచురించడం జరిగింది. అక్షర నక్షత్రాలు గ్రంథానికి ప్రముఖ విమర్శకులు రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారు పీఠికను అందిస్తూ "నియోగి"గారు రచించిన ఈ పుస్తకం పాక్షికంగానైనా ఆధునిక తెలుగు సాహిత్యచరిత్ర. ఈయనను చాలా మంది నిలదీయవచ్చు, 'అక్షర నక్షత్రాలు' వీళ్ళేనా? ఇంకెవరూ లేరా? అని. దండిగా ఉన్నారు. ఆయన ఇప్పటికి ఈ పనిచేశారు. ఈ కృషి కొనసాగుతుంది. ఈ పనిచేసినందుకు ఆయనను అభినందిద్దాం. ఈయన ఈ గ్రంథం రాయకుంటే కనీసం ఇరవై మంది విస్మృత రచయితలు, విస్మృతులుగానే ఉండిపోయేవారు. ఇందుకైనా నియోగి గారిని అభినందించాలి. ఈ గ్రంథం హిందీ, ఆంగ్ల భాషల్లోకి వెళ్లగలిగితే మన సాహిత్యం, మన రచయితలు ఇతర భాషల వారికి పరిచయం కావడానికి వీలవుతుంది అన్నారు. వారి పీఠిక ద్వారా నా బాధ్యతను పెంచేదిగా చేశారు. అలాగే ఈ కృషిని కొనసాగించమని ఆదేశించినట్లుగా కూడా నేను భావించాను. ఈ క్రమంలో నా కృషిని కొనసాగిస్తున్నాను.

కొందరు గొప్ప సృజన గావించి కూడా విస్మృతులు కావడం బాధ కలిగించే అంశం. ఆ సాహితీవేత్తలు మనం చెబితే తప్ప వారెవరో సాహిత్య లోకానికి తెలియకపోవడం ఇక్కడ మనం ఆలోచించవలసిన ముఖ్య అంశం. ఇక ప్రస్తుత అంశానికొస్తే కేశవేంద్ర విలాసము, వీరాచల క్షేత్రమహాత్మ్యము,

ఆంధ్ర సామ్రాజ్యము, అరేబియన్ నైట్స్ కథలు, సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి కథలు, రంజని, మతధర్మ ప్రబోధము వంటి రచనలందించిన "విద్వన్మణి, పంచసహస్రావధాని, పరిశోధకులు, మహా రచయిత జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి గురించిన చాలా సమాచారం లభించింది. అలాగే వారి కుమార్తె శ్రీమతి జంధ్యాల కుసుమకుమారి గారి పరిచయం కేతవరపు రాజ్యశ్రీగారి ద్వారా కావడం, వారి ద్వారా సుబ్రహ్మణ్య శాస్త్రి గారి సాహిత్యా నికి సంబంధించిన అనేక విషయాలు చర్చకు రావడం మరింతగా సుబ్రహ్మణ్య శాస్త్రిగారిని గురించి తెలుసుకోవడానికి దోహదపడింది. ఈ కారణంగా ఆ మహానుభావుణ్ణి తలచుకోవడానికి అవకాశం దొరికింది. వారి గురించి నేటి సాహిత్య ప్రపంచం తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వారి గురించి నేటి తరానికే గాక భావితరాలకు కూడా అందించ వలసిన బాధ్యత మనపై ఉందని నేను భావిస్తున్నాను.

ఏ కీర్తికాంక్షలు ఎరుగని సాహితీవేత్త జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు కృష్ణాజిల్లా కలువపాముల గ్రామంలో 1892లో జన్మించారు. వారు "హరి" వంశీయులయినప్పటికీ పెద్దమ్మ జంధ్యాల శేషమ్మ గారింటికి దత్తుడి గా వెళ్లటం వల్ల వారి ఇంటిపేరు జంధ్యాలగా మార్పు చెందింది. ఆయన ప్రాథమిక విద్య స్వగ్రామంలో సంప్రదాయబద్ధంగా జరిగింది. అటు పిమ్మట దువ్వూరి నాగేశ్వరశాస్త్రి గారి వద్ద లఘు సిద్ధాంత కౌముది, బాలమనోరమ తెలుగు వ్యాకరణం వంటివి క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. 1912లో బందరు వెళ్లి హిందూ కళాశాలలో అధ్యాపకులైనారు. అక్కడ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారి అభిమానం సంపాదించి వారి వద్ద అవధాన విద్యకు సంబంధించిన రహస్యాలను ఒడిసిపట్టుకున్నారు. అలాగే ప్రాచీన సాహిత్యం లోని లోతుపాతులు, గుట్టుమట్టులు, మెళకువలు, ఛందోవ్యాకరణ, అలం కార, కావ్యశాస్త్ర లక్షణాలు, సంస్కృత తెలుగు పంచకావ్యాలు, ఇతిహాస,

పురాణ కావ్యాలలోని ఘట్టాల రచనా విధానాలను చెళ్ళపిళ్ళ వారి వద్ద సంపూర్ణంగా గ్రహించారు. అప్పటికే ఆంధ్రదేశంలో చెళ్ళపిళ్ళ వారు శతావధానిగా గొప్ప కీర్తిమంతులు. వారి సాంగత్యం జంధ్యాల వారు రాటుదేలేలా చేసింది. నాడు చెళ్ళపిళ్ళ వారింట అనేక సాహిత్య చర్చోపచర్చలు జరుగుతుండేవి. వాటిలో మహామహులతో కలిసి పాల్గొనే అవకాశం జంధ్యాల వారికి దక్కింది. ఈ వాతావరణం శాస్త్రిగారిని సరస్వతి పుత్రునిగా మార్చింది. అపారమైన ధారణాశక్తి, ఆశువుగా పద్యపఠనం వంటివి వారి స్వంతమైనాయి. ఇవి వారి అపారకీర్తికి పాత్రమైనాయి. తెలుగు ప్రాంతాలంతటా అవధానాలు నిర్వహించి తనకు తానే సాటి అని జంధ్యాలవారు అనిపించుకునేలా చేసింది.

వారు సమస్యాపూరణాన్ని అనితర సాధ్యంగా చేసేవారు. వారు ఏ ప్రాంతంలో అవధానం నిర్వహించినా అక్కడి సభికులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేసేవారు. జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఆంధ్ర ప్రాంతంలోనే గాక తెలంగాణలో అనేక ప్రాంతాలలో అవధానాలు నిర్వహించి తన ప్రతిభను చాటుకున్నారు. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వెంకటేశ్వర స్వామి వారితో మొదలుకొని దుర్గాదేవి, శంకరస్తవము, కాళి, పార్వతి, ఆదిశక్తి, మహిషాసురమర్థిని, చాముండి, నృసింహావతారము, సత్యనారాయణస్వామి, రాధాకృష్ణులు, శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, ఆంజనేయుడు, వంటి దేవతామూర్తుల ప్రస్తావనతో సమస్యాపూరణం గావించిన సందర్భాలు అనేకం కనిపిస్తాయి. అలాగే భారతీయ సంస్కృతి, ఆంధ్రభాషోత్పత్తి, వ్యవహారిక భాష సాహిత్యాలతో పాటు నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, శంకరాచార్యులు, కాళిదాసు, శ్రీశ్రీ వంటి కవుల ప్రస్థావనలతో పద్యపఠనం గావించి సభికుల ప్రశంసలు పొందారు. అలాగే దేశభక్తి, మహాత్మాగాంధీ, సుభాస్‌చంద్రబోసు వంటి అంశాలు ప్రకృతి వర్ణనలు ఇలా వీరి అవధానాలలో లెక్కలేనన్ని ఆశువుగా

చెప్పిన పద్యాలు కనిపిస్తాయి.

**మ॥ "రసవత్కావ్యకలాపమందొకటియైరాజిల్లునంచార్యరాట్**
**ప్రసరంబాడగవిందు,గేయములతో ప్రస్తూయమానంబనన్**
**బసిపాపన్సయితంబుదన్పును మహాప్రస్థానమౌసదృశ**
**స్వసుఖవ్యాప్తిఁజెలగుమాంధ్రమున శ్రీశ్రీశ్రీకవీంద్రాగ్రణీ"**

ఇలా గుడివాడలో జరిగిన ఒక అవధాన సభలో శ్రీశ్రీమహాప్రస్థానాన్ని ప్రశంసిస్తారాయన. శ్రీశ్రీ శాస్త్రి గారి కంటే చిన్నవాడైనప్పటికీ శ్రీశ్రీలోని కవితాశక్తినీ, ఆయన మహాప్రస్థానాన్నీ సహృదయతతో కొనియాడతారు. ఎవరిలోనైనా కవితాశక్తి ఉంటే చిన్నా పెద్ద, కుల, మత తారతమ్యమెరుగక ప్రశంసించడం మనం జంధ్యాల వారిలో గమనించవచ్చు. జంధ్యాల వారిలో దేశభక్తీ మెండుగానే కనిపిస్తుంది.

**సీ॥ భారతదేశాన స్వాతంత్ర్య మార్జింప**
**విద్యయవశ్యమైవెలయుననగ**
**ఏనాటికైన బాహానైపుణినినాటి**
**తేరగావలెనను తీరుతోప**
**అలఘు సాహసవైభవాదిగుణోద్ధతి**
**వెలయగావలెనను విధముతోప**
**సూత్రసంధానైక శుభదాయిరాట్నంబు**
**లీలగావలెనను లీలతోప**
**గీ॥ పొత్తమున్గదసింగంబు భూమి విజయ**
**వాచియైనట్టి జెండాయుంబ్రజ్వలింప**
**భారతీమాత కర్తవ్యభావబోధ**
**నాచరించెడు గనుడదే యన్నలార**

అంటూ ఈ దేశంపై గల తన భక్తిని స్వాతంత్రోద్యమ కాలంలో గురజాలలో

జరిగిన ఒక అవధానంలో చాటుకున్నారాయన.

**"కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా-**
**హీనంగా చూడకుదేన్నీ,**
**కవితామయమేనోయ్ అన్నీ!**
**రొట్టెముక్కా, అరటితొక్కా, బల్లచెక్కా-**
**నీవేపే చూస్తూ ఉంటాయ్!**
**తమలోతు కనుక్కోమంటాయ్!**
**తలుపుగొళ్ళెం, హారతి పళ్ళెం, గుర్రపు కళ్ళెం-**
**కాదేది కవిత కనర్హం!**
**ఔనౌను శిల్పమనర్ఘం!**
**ఉండాలోయ్ కవితావేశం!**
**కావాలోయ్ రసనిర్దేశం!**
**దొరకదటోయ్ శోభావేశం?**
**కళ్ళంటూ ఉంటే చూసి**
**వాక్కుంటే వ్రాసీ!**
**ప్రపంచమొక పద్మవ్యూహం**
**కవిత్వమొక తీరనిదాహం"**

అంటాడు శ్రీశ్రీ. ఏదీ కవితకనర్హం కాదంటూనే కవిలో కవితావేశంతో పాటు తీసుకున్న వస్తువును రసవంతం చేయగల నేర్పు, వాక్కు ఉండా లంటాడు. శ్రీశ్రీ ఏదైతే చెప్పాడో అంతకుముందే జంధ్యాల వారు "చింత గింజ" మీద కొల్లాపూర్‌లో జరిగిన సభలో చెప్పి సభను రంజింపజేశారు. శ్రీశ్రీ అన్నట్టు జంధ్యాల వారికి కవిత్వం తీరని దాహమే అయింది. ఆయన దేన్నైనా కవితామయం చేయగల భాషా పటిమ వారిలో మెండుగా ఉంది.

**నూరివండినగాని నోరువిచ్చుచు వచ్చి**
**యతుల బాంధవ్యము లమరజేయు**
**దూరదూరంబుగా బారవైచినగాని**
**ధన్యచిత్తులను పాదముల నేర్చు**
**బహుళ కోపంబున బాతిపెట్టినగాని**
**శాఖోపశాఖయై సరగలేచు**
**క్రోధంబుపై బూని కొరకగా బూనుచో**
**బాధించి దంతముల్ బాపజూచు**

**వడియముల లోనజేరి రూపంబు దాచి**
**బావమరుదుల శుభవేళ బాధపెట్టు**
**అన్యహింసానుబంధ కార్యములందు**
**జెలిమిమై వైచు ముందంజ చింతగింజ**

శాస్త్రిగారి ధారణాశక్తికి, ఆశు పద్య కవితా వైభవానికి పండిత పామరులందరూ ఆనంద పరవశులయ్యేవారు. అలాగే మీసములపై చక్కని పద్యము గుడివాడలో జరిగిన సభలో చెప్పి కరతాళ ధ్వనులతో సభ మారుమ్రోగేలా చేశారు. వారిలోని వ్యంగ్యము, చమత్కారాలు కూడా ఆకట్టుకునేవి.

**ఉ॥ మీసములాత్మరూపములు, సమీక్షణ మాత్రమనోజ్ఞమౌనటుల్**
**జేసెడికార్యసమ్మతి వశీకృత రమ్యకళాధి సూచనన్**
**జేసెడినట్టి మీసములజెన్నుగబెంచినవాని గార్యదీ**
**క్షాసముపేతుడీతడను గణ్యయశంబవిపెంచి మించెడున్**

ఇలా వారి అవధానాలు తెలుగు రాష్ట్రాలలో జనబాహుళ్యమంతా అబ్బురపడే విధంగా నిర్వహించారని చెప్పడం ఏమాత్రం అతిశయోక్తి కాదు. శాస్త్రిగారు ఆంధ్రదేశంలోని వివిధ సంస్థానాలలో అవధాన విద్య ప్రదర్శించి "విద్వ

న్మణి"గా గుర్తింపు పొందారు. తెలంగాణ విముక్తి పొందిన తర్వాత శాస్త్రి గారు తెలంగాణలోనే నివసించారు. వారి నివాసాన్ని హైదరాబాద్‌కు మార్చు కున్నారు. తెలంగాణలోని అనేక దేవస్థానాలలోనూ, సంస్థానాలలోనూ తన ప్రతిభను చాటుకొని గౌరవాలు పొందారు. శాస్త్రిగారు గద్వాల సంస్థానంలో విద్వత్సభలకు పరీక్షాధికారిగా పనిచేశారు. వీరి ప్రతిభాపాటవాలను తెలుసు కున్న పన్నాలాల్ పిట్టిగారు యాదగిరి గుట్టలో జరిగిన లక్ష్మీ నరసింహస్వామి వారి బ్రహ్మోత్సవాల సందర్భంగా జరిగే సాహిత్యసభలకు అధ్యక్షులుగా ఉండాలని కోరారు. వారి విన్నపం మేరకు జంధ్యాల వారు అంగీకరించారు. ఆయన ఈ గౌరవ పదవిలో 40 సంవత్సరాల పాటు కొనసాగి పదవికి వన్నె తెచ్చారు.

ఖమ్మం జిల్లా అమ్మపాళెం జమిందారు కాళ్ళూరి రాజేశ్వరరావుగారు శాస్త్రిగారిచే అవధాన సభను ఏర్పాటు చేసి ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమం 1920 ప్రాంతంలో జరిగింది. 1924లో వైరాలో శాస్త్రిగారు పలివెల శేషగిరిరావుగారి కోరిక మేరకు అవధాన విద్యను ప్రదర్శించి ఘనసన్మానం అందుకున్నారు.

అలాగే 1942లో ఆలంపూర్‌లో తహసీలుదార్ కొండపల్లి వాసుదేవ రావుగారి కోరిక మేరకు సహస్రావధానం చేసి అందరిచే కొనియాడబడ్డారు శాస్త్రిగారు. వారు కర్నూలు జిల్లా దైవము దిన్నె ఆస్థానంలో మహాసహస్రా వధానం నిర్వహించారు. రామిరెడ్డి ఆస్థానంలో ఆయన 1935లో నిర్వహిం చిన మహాసహస్రావధానం వారు నిర్వహించిన గొప్ప అవధానాలలో ఒకటిగా నిలిచిపోయింది. కవిశరభగా ప్రసిద్ధి చెందిన పెద్దమందడి వేంకటకృష్ణ కవి, ఆశు కవితా చక్రవర్తి గాడేపల్లి రాఘవశాస్త్రి, ద్వర్థికావ్యకర్త పోకూరి కాశీపత్యావధాని, అనుముల శేషకవి, జానపాటి పట్టాభిరామశాస్త్రి, అభినవ వాగనశాసన సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, అష్టావధాని చెమికల

చెన్నారెడ్డి, ఆర్.రామారెడ్డి వంటి మహాపండితుల, కవుల, వ్యాకరణ శాస్త్ర వేత్తల సమక్షంలో ఈ సహస్రావధాన సభ జరిగింది. పృచ్ఛకులు సంధించిన అనేక సమస్యలను సమయస్ఫూర్తితో పూరించి పండిత ప్రశంసలందు కున్నారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అవధానాల్లోనే గాక జంధ్యాల వారు ఆశువుగా స్తవ,స్తోత్రాది సమయాల్లో కూడా తన భక్తిని చాటుకునే వారు. వేంకటేశ్వరుని భక్తితో అమితానందంగా స్తుతించేవారాయన.

**సీ॥ పదునాల్గు భువనముల్ పాలింపనర్హమై**
**అతి విశాలమైన యాస్యసీమ**
**అంబరచుంబి భూజావళీ సంవృత**
**భూమీధరమ్ముల మ్రోయు మూపు,**
**ధరనాకసము నొకే తరుణాన స్పృశియింప**
**భద్రమౌనాజానుబాహుయుగము**
**స్వర్గమ్మునున్ భూమి పాతాళమొక్కట**
**ఆవరించువెడంద యడుగుదమ్మి**
**గీ॥ కలుగు శ్రీవెంకటేశుమూపులనలర్ప**
**నైన శ్రీరామకృష్ణ సత్యాధులీరు**
**కవులభరియించుటిఁక నేటిఘనము మీకు**
**హృద్యమతులార శ్రీరామకృష్ణులార!**

దైవభక్తి మెండుగా గల జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అవకాశం కలిగిన ప్రతిసారి తన భక్తిని ప్రదర్శిస్తూ వచ్చారు. పలివెల శేషగిరిరావుగారి కోరిక మేరకు వైరాలో నిర్వహించిన అవధానంలో

**సీ॥ శ్రీ కరీంనగరంబు జేర నాయాసోప**
**శాంత్యుపచారముల్ సల్పినావు**
**అవధాని! నా మిత్రుడరుగుదెంచె నటంచుఁ**

**చిన్నపెద్దలకు జూపించినావు**

**ఆంధ్రభాషా నిలయపు సభ్యులకు నా**

**పాండిత్యమున్ శ్రుత పఱచినావు**

**కొలది కాలమ్మున గురుబంధురాదర**

**పాత్రునిగాc జేయబరగినావు**

**గీ॥ మనదు మైత్రికి సతత సంబంధ కథల**

**కల్పనముసేసి సత్కీర్తిగాంచినావు**

**సకల శుభముల శౌరినిన్ సాకుcగాత**

**సరస గేయcపలివెల శేషగిరిరాయ**

అంటూ మిత్రున్ని ఆశువుగా కొనియాడారు జంధ్యాలవారు. 1916లో కరీంనగర్‌లో ఆయన నిర్వహించిన అవధానాన్ని శేషగిరిరావు గారు పరవశులై జంధ్యాల వారితో మైత్రిని పెంచుకున్నారు. ఈ మైత్రిని కొనసాగిస్తూ అవకాశమున్న చోటల్లా జంధ్యాల వారి ప్రతిభను చాటుతూ వచ్చారు పలివెల వారు. ఈ క్రమంలోనే జంధ్యాలవారి అవధానం ఖమ్మం జిల్లా వైరాలో ఏర్పాటు చేశారు.

**సీ॥ వైరా తరంగణీ తీరంబునన్ నన్ను**

**బొడగాంచినంత నుప్పొంగినావు**

**ఎనిమిదేడు లేగిన బునర్దర్శ**

**నంబాయని యాశ్చర్యమందినావు**

**అడుగడుగునకు ప్రమోదాలింగనములిచ్చి**

**సేమమా యంచు ప్రశ్నించినావు**

**అల కరీంనగరికి ఆహ్వానమొసగి శ**

**తావధానము సేయనడిగినావు**

**గీ- తీరుబాటున కేను సందియముఁజూపఁ**
**చేతిలోఁజేయి వేయగా జేసినావు**
**బలిమి నుపకృతి సేయ నీ చెలిమి మఱువ**
**శక్యమౌనె? పలివెల శేషగిరిరాయ**

స్నేహానికి అత్యంత ప్రాధాన్యమివ్వడం, ఆదరించినవారి యెడ అవ్యాజమైన ప్రేమ, గౌరవాలను చూపడం మనం జంధ్యాల వారిలో చూడగలం.

**సీ॥ అధిప సంస్థాన సమర్థవేష్టనములన్**
**వెడద కుళ్ళాయిల నడరినాడు**
**దేశాలు తిరుగుచో దేవేరులిచ్చిన**
**వెల్లులియే కేల బిసికినాడు**
**శారీరపాటవ సంగతిన్ దలపక**
**అంబలియే త్రావనైనవాడు**
**అధిపార్థ రుచులకై యలవాటుపడియును**
**వివిధ రుచి శ్రేణి వీడినాడు**
**గీ॥- లేమి కతమున కెంతయో క్లేశమంది**
**మూపునన్ నల్లగుండును మోసినాడు**
**అకట! శ్రీనాథునంతటి యర్థకవియె!**
**కవిత కిటులేల వ్రాసెనో కంజభవుడు**

అంటూ శ్రీనాథుని జీవితాన్ని, అతననుభవించిన వేదనని మన కళ్లకు కడ తారు ఒక సందర్భంలో జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**సీ॥ ధరణీశుడెక్కెడు కరిరాజు నెక్కించి**
**అలసాని పెద్దన నఁతజేసె**
**అష్టభాషలకు వాగ్వ్యాపార మొనరించి**
**నన్నయ్యభట్టు కానందమొసగి**

**మితిమీరుసౌఖ్యాల మేనాల నెక్కించి**
**శ్రీనాథునెల్లడఁద్రిప్పజేసె**
**శాశ్వతానంద ప్రచారంబు నొందగా**
**పోతన్నకైగతి స్ఫూర్తి జేసె**
**గీ॥ రమ్యకోమల చూతాంకుర ప్రశస్త**
**మృదుల కవితా ప్రభావంబు నెనయునట్టి**
**సత్కవుల కిట్టి సౌఖ్యమెసంగుచుండు**
**మాటిమాటికి నేటికి మనవిసేయ?**

సాహిత్యం సంఘంపై ఎంతో ప్రభావం చూపిస్తుందనేది కాదనలేని సత్యం. వాల్టేర్, రూసో వంటి కవుల ప్రభావం ఫ్రెంచి విప్లవానికి నాంది పలికిందంటారు. స్వాతంత్రోద్యమ కాలంలో భారతీయ కవుల ప్రభావం ఏ మాత్రం తక్కువగాదు. 'మాకొద్దీ తెల్లదొరతనం–దేవా మా కొద్దీ తెల్లదొర తనం" అంటూ సమరశంఖం పూరించిన గరిమెళ్ళ సత్యనారాయణ కేవలం ఆ పాట వల్ల కారాగార శిక్షలకు గురైనాడు. అన్నమయ్య తన పదకవితల వల్ల ఎంత పేరు పొందాడో అన్ని బాధలు అనుభవించాడు. ఇందుకు మన ప్రాచీన తెలుగు కవులు మినహాయింపు కాదు. తమ కవితల వల్ల వారు అనేక సౌఖ్యాలననుభవించారు. కష్టాలు చూశారు. అలసాని పెద్దన, నన్నయ్య, శ్రీనాథుడు, పోతన తమ కవితల వల్ల పొందిన సౌఖ్యాలను చక్కని సీస పద్యంలో హృద్యంగా చెప్పారు. జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కొల్లాపూరు సంస్థానం వారి ఆధ్వర్యంలో జరిగిన ఒక అవధాన సభలో.

**చం॥ ప్రతత కళావిశేషముల ప్రజ్ఞను మున్ను మునీంద్రరాజ సం**
**స్మృతమున వ్రాసియుంట విపరీత మహాద్భుత విద్యలెల్ల సం**
**స్మృత పఠనంబు సేయకయె సిద్ధముగావటు భారతీయ సం**
**స్మృతికి నవశ్యమై తనరు శ్రీకర సంస్మృత వాఙ్మయోద్ధతుల్**

గుడివాడలో జరిగిన ఒక అవధాన సభలో ఒక పండితుడడిగిన ప్రశ్నకు జంధ్యాల వారు ప్రాచీన కాలం నుండి భారతీయత సంస్కృతిలో ఒక భాగ మైనది. అట్టి సంస్కృతి యొక్క అవశ్యకత గురించి వివరించారాయన. ఆంధ్రభాష పట్ల వారికి ఎనలేని భక్తి గౌరవాభిమానాలున్నాయి.

**చం॥ "ప్రకృతిని బుట్టి తత్సమపుభాతిని గొంతయుదద్భవంబునన్**
**బ్రకటిత దేశ్యరూపమున గ్రామ్యమునన్ మరికొంత పుట్టియున్**
**సకల కలాంతరస్థరస సంగత మాధురి సుంతలెక్క సే**
**యక సుమనస్కులన్దనుపునాంధ్ర సరస్వతికేనుమ్రొక్కెదన్"**

తనకు గల ఆంధ్రాభిమానాన్ని చాటుకొనటమే గాదు వ్యవహారిక భాషలో రచనలు సాగించటాన్ని కూడా సమర్థించారు. ఆయన పద్యరచనకు పూను కున్నప్పటికీ సరళమైన భాషనుపయోగించి పండిత పామరులను రంజింప జేశారు. మన భాషాకవులందరికీ కాళిదాసంటే గొప్ప గౌరవభావం ఉందనేది కాదనలేని సత్యం. ఇందుకు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మినహాయింపు కాదు. వారికి కాళిదాసుపై గొప్ప అభిమానముంది, గౌరవముంది.

**మ॥ నవభావప్రతిభాభ్యుదంచదుపమానప్రోక్తి శ్రీకాళిదా**
**సవచోవైఖరి, ప్రౌఢభావరసవచ్ఛయ్యా ప్రకారంబులా**
**భవభూత్యుక్తులు తత్తదుత్తమకవిత్వప్రౌఢిభేదంబు సం**
**స్తవనీయంబుగ జెప్ప శక్యమగునే:సాధ్యంబెమాబోంట్లకున్**

కాళిదాసు భవభూతుల కవిత్వంలో గల తారతమ్యాన్ని ఈ పద్యంలో జంధ్యాల వారు చెప్పారు. పృచ్ఛకులు ఇచ్చిన సమస్యను పూరించటంలో అవధానులు అత్యంత మెళకువతో వ్యవహరించాల్సి ఉంటుంది. అట్టి మెళకువ మనం జంధ్యాల వారిలో గమనించగలం.

**మ॥ ధరణీజాతములెల్లలేజిగురులన్దారుణ్యమున్ జూపె హ్రా**
**త్సరసీజంబులు పల్లవించెవిట సంజాతంబులన్ జూతసుం**
**దర శాఖతతి దాల్చె సత్ఫలములన్ దాళోర్వ్విరుట్పత్ర భా**
**స్వరలీలాధుర చామరంబు లెగరెన్ వైశాఖమాసంబునన్**

అని వైశాఖ మాసాన్ని అద్భుతంగా మనముందు ఆవిష్కరింపజేశారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

**ఘనరుచిభాసినిశానిచయంబులుగా నగనయ్యెడి దీర్ఘములై**
**కనదుడుసంతతియాకసమెల్లగానడనయ్యెడి స్వచ్ఛములై**
**ఘనఘన సంతతిక్లాంతి విహీనత గానగనయ్యెడి శుభ్రములై**
**కను శరదంచిత దినంబులు గానగనయ్యెడి హ్రస్వములై**

ఇలా శరత్కాలాన్ని వర్ణిస్తారు. ఋతువుల వర్ణనలో తనదైన ఒక ప్రత్యేకతను చూపిస్తూ చెప్పిన విధానం అనితర సాధ్యమైనదని ఘంటాపథంగా చెప్ప వచ్చు. పృచ్ఛకులడిగిన ప్రశ్నకు వైశాఖ, శరత్కాలాలను కరీంనగర్‌లో జరి గిన అవధాన సభలో వర్ణించారు. ఆయన వర్ణించిన విధానాన్ని చూసి నాటి సభ కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది. ఇది అవధానిగారి భాషా పాండిత్యాలకు నిదర్శనంగా నిలిచింది.

**సీ॥ ప్రథిత గోవర్ధన భార సంవాహియై**
**ప్రాంచిత రూపమెవ్వాడు పూనె**
**సకల మునీంద్ర కౌతుక మూలకర్తయై**
**భవనీయరూపమెవ్వాడు పూనె**
**భక్త వల్లభ వరప్రార్థనల్ దీర్పగ**
**పటుతర తేజమెవ్వాడు పూనె**
**గురునరాధిపవ్రజ క్రూరతాశాసియై**
**భయదవేషంబునెవ్వాడు పూనె**

**గీ॥- ఆ మహాత్ముండు సర్వలోకైక కర్త**
**యుండియున్ లేని వైఖరి నుండువాడు**
**అఖిల మాయా ప్రచార రహస్యమూర్తి**
**మమ్మమిమ్ములను నెల్లరన్మనుచుగాత**

పరమాత్ముని వర్ణన చేసి తన సాహితీ వైభవాన్ని చాటుకున్న జంధ్యాలవారు మానవుడు ఏ నిజసత్యమైతే తెలుసుకోవాలో కూడా ఈ పద్యంలో అంత ర్లీనంగా చూపించారు. ఆ పరమాత్ముడు ఏమిటో తెలపడంలో వారు నిరం తరం అన్వేషణ అధ్యయనాల ద్వారా గ్రహించారని అవగతమవుతుంది. అవధాన విద్యను ప్రదర్శించాలంటే సర్వశాస్త్ర విజ్ఞానం సంపాదించాలి. లోకరీతే గాక తాత్విక ప్రపంచపులోతులు తెలిసుండాలి. పృచ్ఛకులు ఏ సమస్యనిచ్చినా పూరించగలగాలి. మామూలు పరిజ్ఞానం చాలదు. అన్ని విషయాల్లో పరిజ్ఞానం సాధించినవారు మాత్రమే అవధాన విద్యా ప్రదర్శనకు దిగాలి. నాడు ఎవరూ చేరుకోలేని శిఖర సమాన స్థాయిని జంధ్యాల వారు చేరుకున్నారంటే వారి జ్ఞానమలాంటిది. ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో గద్వాలలో కేశవస్వామి తిరుణాల ఘనంగా జరుగుతుంది. అంతేగాకుండా కవిగాయక పండిత కళాకారుల సభలు జరుగుతాయి. ఆ సందర్భంగా వివిధ ప్రాంతాల వారు తమ పాండిత్యాన్ని ప్రదర్శించి సంస్థానాధీశుల ద్వారా ఘన సత్కారాలను అందుకునేవారు. 1933వ సంవత్సరం జరిగిన సభలలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పాల్గొన్నారు. ఈ సభలలో పండి తుల పద్యాలను సంస్థానం వారు ప్రచురించేవారు. 1933లో ప్రచురించిన నానాదేశ కవీశ్వర పద్య రత్నావళి పేరుతో గ్రంథాన్ని ముద్రించారు. ఈ గ్రంథంలో జంధ్యాల వారి పద్యాలు దర్శనమిస్తాయి. ఇటువంటి గ్రంథంలో పద్యాలు ప్రచురణ కావడం నాడు కవులు గొప్ప గౌరవంగా భావించేవారు.

**సీ॥ కవిరాజులకు కోర్కె దివియనిచ్చెనెగాని**
**యేనాడు లెక్కించియీయలేదు**
**గాన కళావిజ్ఞానికి గుప్పెటన్**
**జిమ్మెనెగాని యోజింపలేదు**
**పండితుండని స్పష్టపడనేని యంజలి**
**నింపెనేగాని శంకింపలేదు**
**అర్థి సంభావ్యుడెయయినచో కేల్పొంగ**
**నిచ్చెనేగాని గణించియీయలేదు**
**గీ॥ అనుయశఃకాంత గద్వాలనునిచి దివికి**
**బోవనాయె సీతారామభూమిజాని**
**యయ్యశము నిల్పినావు పుణ్యమ్ముగొమ్మి**
**త్యాగ భూషితపాణి గద్వాల రాణి**

గద్వాల సంస్థానం కళలకు, విద్యలకు నెలవై ఉండేది. ఎక్కడెక్కడి పండితులు ఇక్కడకు విచ్చేసి తమ విద్యలను ప్రదర్శించి బహుమానాలందుకునేవారు. మహాపండితులైనవారిని విద్వత్సభలకు పరీక్షాధికారులుగా నియమించడం జరిగేది. ఈ విధంగా విద్వద్గద్వాలగా పేరుగాంచిన గద్వాల సంస్థానం వారిచే విద్వత్సభలకు పరీక్షాధికారిగా నియమింపబడ్డారు జంధ్యాలవారు. ఇలా నియమించబడటం అత్యంత గౌరవమేగాక వారి పాండిత్యమెంతటిదో అవగతమవుతుంది. ఈ బాధ్యతను వారు 30సంవత్సరాల పాటు నిర్వహించారు. గద్వాల సంస్థానాధీశుల ఔదార్యమెలాంటిదో, కవి, పండిత, కళాకారుల యెడల వారు చూపిన గౌరవం ఎలాంటిదో జంధ్యాల వారుపై పద్యాలలో వివరించారు.

గద్వాల వలె తెలంగాణలో కొల్లాపూర్ (జటప్రోలు) సంస్థానాధీశులు కూడా కవి, పండితులను ఆదరించినవారే 1933లో కొల్లాపూర్ సంస్థా

నాధీశ్వరి రాణి వేంకట రత్నమాంబ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సహస్రా వధాన సభను ఏర్పాటు గావించి జంధ్యాల వారిని ఘనంగా సత్కరించారు.

**సీ॥ నీహార శిఖరి జనించి వాసము సేసి**
**ఫాలాగ్ని సహియించు పరమసాధ్వి**
**జగదేక సౌందర్యశాలినియై ప్రేత**
**భూతనాయకునకు మ్రొక్కుచాన**
**అమృతోపమాన దయారసస్ఫారమై**
**గరళసంశ్లేషాన మురియు సరస**
**రజతాద్రి కందర రాజరాజిల్లనై**
**ప్రేతాలయపుటున్కివేడు పడతి**
**గీ॥ కష్టమున్ సౌఖ్యముగ జేయగల నెలంత**
**అమలగుణజాత సర్వలోకైక పూత**
**పార్వతీమాత మిమ్ము కాపాడుగాక**

అంటూ రాణి రత్నమాంబని ఆశీర్వదించారు జంధ్యాలవారు. నాటి సంస్థానా ధీశులు కవి పండితులను గౌరవించి సత్కరించడం, వారిని సముచిత రీతిలో ఆదరించడం చేసేవారు. ఇది తమ బాధ్యతగా భావించేవారు. ఒక రకంగా కవి పండితులు తమ జీవనానికి ఇబ్బందిపడకుండా గడపగలిగే వారు. సమాజంలో వారికి గౌరవమర్యాదలకు కొదవ ఉండేది కాదు. అందువల్లనే కవులు మహా గ్రంథాలను ప్రపంచానికి అందించగలిగేవారు. కవులు రాసినవి పాలకులు శ్రద్ధగా వినేవారు. వారిలో సాహిత్యాభిమానం, కళాభిమానం, మెండుగా ఉండేది. కాలానుగుణంగా అనేక మార్పులు చోటు చేసుకున్నాయనే చెప్పవచ్చు. కవి పండితులకు ఆదరణ తగ్గుతున్నదనే చెప్పవచ్చు. చివరకు కవిత్వం కూడు పెడుతుందా అనే పరిస్థితి వరకు చేరుకున్నది. ఇది నిజమే కదా! అని అనిపించకమానదు. ఏది ఏమైనా

నాటి సంస్థానాలు, రాజాస్థానాలే గాక ప్రజలలోని ధనవంతులు కూడా కవి, పండితులను ఆదరించి సత్కరించేవారు. తెలుగునాట ఈ సంప్ర దాయం అన్ని ప్రాంతాలలోనే కనిపిస్తుంది. జంధ్యాలవారు సంస్థానా ధీశుల చేత, ప్రజల చేత సత్కారాలు అందుకున్నారు. జేజేలు పలికించు కున్నారు. పంచ సహస్రావధానిగా మొట్టమొదటివారాయన. జంధ్యాల వారు అసామాన్య ప్రజ్ఞను ప్రదర్శించేవారు. జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 1936లో రత్నలక్ష్మి శతపత్రము అనే పద్యమాలికను రచించారు. ఇది 105 పాదాలతో విస్తరించి ఉంటుంది. దీన్ని మత్తేభ వృత్త లక్షణాలతో రూపొందించారు. కొల్లాపూర్‌లో కొలువైన లక్ష్మీదేవిని కొల్లాపూర్ సంస్థానాధీశురాలు సురభి వెంకట రత్నమాంబను, వారి వంశాన్ని తరింపజేయమని వేడుకుంటూ రాసినది.

జటప్రోలు సంస్థానంలో పేరెన్నికగన్న మహాపండిత కవోత్తములు వాజపేయయాజుల రామసుబ్బరాయకవిగారు. ఆయన ప్రసన్న భారతాన్ని ఒంటిచేత్తో పూర్తిగావించినవారు. వారికి రాసురాట్కవి అని బిరుదు ఉన్నది. ఆయన జటప్రోలు విద్యాధికారిగా ఉండేవారు. మరో విశేషమే మంటే ఇప్పటివరకు మహాభారతాన్ని తెనుగు చేసినవారు, నన్నయ, తిక్కన, యఱ్ఱాప్రగడలు మొదటివారు కాగా శ్రీకృష్ణభారతం పేరుతో సంపూర్ణంగా భారతాన్ని అందించిన శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి రెండోవారు. ఇక రాసు రాట్కకవి రామసుబ్బరాయ కవి మూడవవారు. వీరు తప్ప మరొకరు కనిపించరు. సరళ సుందరంగా వారి "ప్రసన్నభారతము"ను అందించి మహాపండితులచే ప్రశంసలందుకున్నారు. 1929లో జటప్రోలులో "స్నేహ లతా కవితాసంఘం" స్థాపించబడింది. దీని స్థాపనలో రామసుబ్బరాయ కవిగారు ముఖ్య భూమికను పోషించారు. అలాగే వీరు "వైజయంతి" పేరుతో ఒక మాసపత్రికను కూడా వెలువరించేవారు. దీని సంపాదకురాలిగా

చేబ్రోలు సరస్వతి దేవి గారు వ్యవహరించేవారు. సాహిత్యాభివృద్ధికి, మరుగున పడ్డ కవులను వెలుగులోకి తేవడానికి స్నేహలతా కవితా సంఘం, వైజయంతి పత్రికలు విశేష కృషి చేశాయి. వైజయంతి పత్రిక సంపాద కురాలు సరస్వతి దేవి రాసిన రామాయణం అప్పట్లో మద్రాసు విశ్వ విద్యాలయంలో పాఠ్య గ్రంథంగా ఉండేది.

జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రామసుబ్బరాయకవి గారితో ఇతర సాహితీమిత్రులతోను చెలిమి నెరిపారు. ఈ క్రమంలోనే స్నేహలతా కవితా సంఘం యొక్క ప్రశస్తిని తెలుపుతూ ఒక పద్యమాలికను అల్లి వారికి బహుకరించారు. మహా పండిత కవైన రాసురాట్కకవి వాజపేయ యాజుల రామసుబ్బరాయకవి గారిచే జంధ్యాల వారు గొప్ప ప్రశంసలందు కున్నారు. ఇది మన జంధ్యాల వారికి దక్కిన మహాగౌరవంగా భావించవచ్చు.

**“జనసందోహమహోపకారి కవితా సాంద్ర ప్రమోదోద్ధతిన్**
**గనులారంగని యిట్టి యాదర మొసంగంజాలెనం చెంచుమీ**
**వనజాతాక్షపదారవింద భజన వ్యాపార మేనాడునీ**
**మనమందున్ విడంబోక సుహృన్మర్యాదలన్ నిల్పుమీ**
**నినుఁగృష్ణుండె పరోపకారరచనా నిస్తంద్రచారిత్రభా**
**సినింగా నేరచి యాత్మభక్తజనుగాఁజిత్తాన గుర్తించి నూ**
**తనుబ్రాంచత్కవితామతల్లిని గోఅంతన్ దీర్పనంపించెన**
**ప్పనుపున్జేయుమీ పెద్దకాల మిచటన్ వంశాభి సంవర్ధనం**
**బున భోగించుమి రామసుబ్బ సుమతీ! పుణ్యక్రియా సంగతీ!”**

ఈ పద్యమాలిక చివరి పాదాలను పైవిధంగా రాసి జంధ్యాల వారు స్నేహ లతా కవితా సంఘం వారికి సమర్పించారు. రామసుబ్బరాయకవిగారి ఔదార్యాన్ని జంధ్యాల వారు వేనోళ్ళ కొనియాడేవారు. ఒక మహాపండితుణ్ణి మరో మహాపండితుడు కొనియాడినదిగా దీన్ని మనం భావించాలి. ఈ

సంప్రదాయాన్ని నేటి కవి పండితులు ఒంటబట్టించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**సీ॥ పంచాననుడు నీ ప్రాభవంబున కోడి**
**తనుకాంతి మీదు సౌధమున డాచె**
**పంచేంద్రియములు మీ వశములై తమ తమ**
**ధాక మీ పంచలో డాచి నిల్చె**
**పంచబాణుండు మీ పత్తనాఖ్యనువిని**
**పంచయోజనములు పాటినిల్చె**
**పంచాననములు త్వద్వంశ తేజముగాంచి**
**ఖండాంత రారణ్య గతములయ్యె**
**గీ॥ త్వత్ప్రపంచక ధర్మంబు పాటిసేసి**
**అక్రమాకాల పంచత్వ మంతరించె**
**పంచభాషిని నిన్నాళులుంచనగునె**
**సెలవొసంగుమ కృష్ణరాజ్క్షితి తలేంద్ర!**

బండలింగాపురం సంస్థానాధీశులు రామకృష్ణరాయ రామలక్ష్మి గారలు జంధ్యాల వారిని ఆహ్వానించి అవధాన సభను ఘనంగా నిర్వహించారు. సభను ముగించుకొని మన జంధ్యాల వారు సెలవు తీసుకుంటూ సంస్థానాధీశులను ఆశీర్వదిస్తూ పై పద్యాలు చెప్పారు. 1930వ సంవత్సరంలో జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సహస్రావధానం యాదగిరిగుట్ట దేవస్థానం ఆధ్వర్యంలో నిర్వహించారు. దేవస్థానం వారిచే ఘన సన్మానం అందుకోవడంతో పాటు "సహస్రావధానాధ్వదర్శి" అనే బిరుదును పొందారు. ఆయనకు దక్కిన గౌరవాలలో ఇదొకటి. యాదగిరి గుట్ట దేవస్థానం వారి కోరిక మేరకు దాదాపు నాలుగు దశాబ్దాల పాటు సాహిత్య సభలకు అధ్యక్షునిగా ఆయన వ్యవహరించారు. జంధ్యాల వారు యాదగిరిగుట్ట స్థల పురా

ణాన్ని, క్షేత్ర మహిమను వర్ణిస్తూ కొన్ని పద్యాలను రాసి 1969లో స్వామి వారికి సమర్పించారు. జంధ్యాల వారు శ్రీలక్ష్మీనరసింహస్వామి శతకము రాశారు.

**సీ॥ గాలిసోకిన రోగి గట్టుదర్శించెనా**
**ఒడలుమంటలటంచు నడలియేడ్చు**
**గుట్టనెక్కడమొదల్‌పెట్టించిరా "రాను**
**ఏలనాకని"వెన్క కేగజూచు**
**స్వామికి మ్రొక్కహస్తముల జూపించిరా**
**పట్టువారలబట్టి కొట్టబోవు**
**చేర్చి ప్రదక్షిణాల్ చేయించిరా పట్టు**
**వదలి నెమ్మోలనెవాలద్రూగు**
**గీ-॥ నిదురగొని స్వామి యానతిన్ స్వీకరించు**
**స్వస్థతన్ చెందిన భక్తి భావనము సేయు**
**వరదునకు మ్రొక్కి సేవోత్సవముల జరుపు**
**నృహరి మహిమను వర్ణింపనెవరి తరము**

ఇలా క్షేత్రమహిమను, స్వామి వారి మహిమను ఈ శతకంలో జంధ్యాల వారు వర్ణించారు. అలాగే మహబూబ్‌నగర్ జిల్లా బల్మూర్ మండలం జిన కుంట గ్రామంలో వెలిసిన వెంకటేశ్వరస్వామి వారిపై "శ్రీశ్రీశ్రీ జినకుంట వేంకటేశ్వరస్వామి శతకము"ను రాసి సమర్పించారు.

**సీ॥ నానామహోధధీస్థాన మందరగిరి**
**దాల్చుచోబరువుదలచలేదు**
**వ్రజరక్షణముగ గోవర్ధన భూధ్రమ్ము**
**తాల్చుట బరువుగా దలపలేదు**
**సర్వసర్వం సహాచక్రమ్ము రదనాన**

**దాల్చుట బరువుగా దలచలేదు**
**జానకీరక్షణోత్సాహమ్ము వార్ధి బం**
**ధనయొక్క బరువుగా దలచలేదు**
**గీ॥ గాని భవదీయ పదయుగధ్యాన నిరత**
**చిత్తునకు రక్షణము సేయు చింతనమ్ము**
**బరువుగా తోచెనొక్కొ బంధుర కృపాఢ్య**
**వినుత జినకుంట నగరీశ వెంకటేశ**

ఇలా జినకుంట వేంకటేశ్వరుని ప్రశ్నిస్తారీ శతకంలో జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఇందులో అంతర్లీనంగా వారి భక్తి ప్రపత్తులు కూడా మనకు కనిపిస్తాయి. మరోచోట

**కొంత సౌఖ్యంబు కష్టంబుకొంత యెసగ**
**దరుచు జగతీ ప్రవృత్తి సంతోషమునకు**
**దుఃఖమున కునునేమి హేతువులు నాకు**
**విశదపఱపవె దిద్దెద వెంకటేశ**

అంటారాయన. లోకంలో మానవులకు కొంత సౌఖ్యం మరికొంత కష్టం కలుగుట చూస్తున్నాం. ఒక రకంగా జీవితమంటేనే అంత! ఇది ఏ మనిషికైనా తప్పనిది. ఇవన్ని చూస్తూ అసలు ఇలా కష్టసుఖాలకు కారణం ఏమిటో తెలపమని వెంకటేశ్వరుని వేడుకుంటారాయన. తన సౌఖ్యంగాక లోక కళ్యాణాన్ని కోరుకోవడమూ కొన్ని పద్యాల్లో చూస్తాము.

**ఆ॥ పరుల బాధపెట్టి పదికోట్లు నార్జించి**
**ధర్మవృత్తి జూపదలచువారు**
**ధన్యులంచుదాము తలపోయుదురుగాని**
**విమలవృత్తియెట్లు వెంకటేశ**

ఇలాంటి పద్యాలలో ఆయన సామాజిక బాధ్యతతో ప్రశ్నించినట్లు మన

కవగతమవుతుంది. అక్రమంగా ధనం కూడబెట్టి ఏవో కొన్ని ధర్మాలుచేసి తాము చాలా ఉత్తములమని ప్రచారం చేసుకునేవారు, చివరకు తమ అక్రమార్జనలో భగవంతుడికి కూడా వాటాలిచ్చేవారు మనకు సమాజంలో తారసపడుతూనే ఉంటారు. ఇలాంటి వారి నైజాన్ని సున్నితంగా వెంకటేశ్వరునికి జంధ్యాలవారు తెలపటం, లేక ప్రశ్నించటంలో వారినైజాన్ని బైటపెట్టడం వంటివి చేశారీ శతకంలో.

జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సీతారామ కళ్యాణ ఘట్టాన్ని పద్యనాటకంగా రాసి ప్రశంసలందుకున్నారు.

ద్వైతాద్వైత సిద్ధాంతాలు, విశిష్టాఅద్వైత సిద్ధాంతాలు హిందూ మతోద్ధరణకు పుట్టినవి, శంకరాచార్యులు, మధ్వాచార్యులు, రామానుజాచార్యులు హిందూమతంలోని కొన్ని లోపాలను సరిదిద్ది నూతన సంస్కరణలు గావించారు.

శంకర భగవత్పాదులవారి అద్వైత సిద్ధాంతం ద్వారా "జీవన్ముక్తి" కోసం ప్రయత్నించి బ్రహ్మజ్ఞానం పొందటం ఈ లోకంలోనే అనే విషయాన్ని "వేదాంత పంచదశి" తెలుపుతుంది.

1581 శ్లోకాలతో నిండి వున్న వేదాంత పంచదశిని సామాన్యునికి చేరువ చేయాలనే ఉద్దేశ్యముతో దీన్ని సరళమైన భాషలో అనువదించి "శ్రీమదాంధ్ర వేదాంత పంచదశి"గా జంధ్యాల వారు అందించారు. దీని ద్వారా వారి ప్రతిభ ప్రస్ఫుటంగా వెలుగుతూ కనిపిస్తుంది. భగవంతుని దర్శించటాన్ని సాధనగా విద్యారణ్యులవారు వేదాంత పంచదశి పదిహేను ప్రకరణలుగా అందించారు. ఇందులోని ఆరవ ప్రకరణమైన చిత్ర దీప ప్రకరణములో 290 శ్లోకాలుంటాయి. ఈ ప్రకరణాన్నీ కూడా అన్నిటితో పాటు ఆ శ్లోకాల యొక్క భావాన్ని తేలికైన తెలుగు భాషలో జంధ్యాల వారు అందించారు.

**1) యథాచిత్రపటే దృష్టమవస్థా-నాంచతుష్టయమ్**
**పరమాత్మని విజ్ఞేయం తథా2వస్థాచతుష్టయమ్**
**2) యథాధౌతోఘటితశ్చలాంఛితోరంజితఃపటః**
**చిదంతర్యామీసూత్రాత్మా విరాట్చాత్మాతథేర్యతే**

ఈ శ్లోకాలకు జంధ్యాలవారు

**"ఎట్టులుగ రంగులు గలుగునట్టి వస్త్ర**
**మందు నాలుగవస్థలు నమరియుండు**
**నట్టులుగనె యప్పరమాత్మయందు గూడ**
**నయ్యవస్థా చతుష్టయ మమరి యుండు**
**తత్పటము ధౌతమును ఘట్టితంబు లాంఛి**
**తంబురంజితమనెడువిధంబుగానె**
**ఆత్మయందు చిత్తనియు సూత్రాత్మ యనియు**
**అలవిరాట్టు అంతర్యామి యనగ నుండు"**

ఇలా అనువదించి అందించారు. ఈ "శ్రీమదాంధ్ర వేదాంత పంచదశి"లో అనేక లోతైన తాత్త్విక విషయాలు కనిపిస్తాయి. తాత్త్విక విషయ పరిజ్ఞానం అపారంగా కలిగినవారు మాత్రమే ఇట్టి అనువాదం చేయగలరు. ఈ అనువాదం చదివితే జంధ్యాల వారి తాత్త్విక పరిజ్ఞానం ఎంతటితో అవగత మవుతుంది. విద్యారణ్యులు రచించిన "వేదాంత పంచదశి"లో తత్త్వ వివేక ప్రకరణము, పంచభూత వివేక ప్రకరణము పంచకోశ ప్రకరణము, ద్వైత వివేక ప్రకరణము, మహావాక్య వివేక ప్రకరణము, చిత్ర దీప ప్రకరణము, తృప్తి దీప ప్రకరణము, కూటదీప ప్రకరణము, ధ్యాన దీప ప్రకరణము,నాటక దీప ప్రకరణము, యోగానంద ప్రకరణము, ఆత్మానంద ప్రకరణము, అద్వైతానంద ప్రకరణము, విద్యానంద ప్రకరణము, విషయానంద ప్రకర ణము వంటి 15 ప్రకరణములు కనిపిస్తాయి. వీటిలో మానవుడు తెలుసు

కోవలసిన సత్యాలు, ధర్మాలు అనుసరించవలసిన మార్గాలు, చేరుకోవలసిన స్థితులు వంటి వాటి గురించి తెలుసుకోగలుగుతాము. నేను అనే భావాన్ని విడిచిపెట్టుటే అద్వైత సిద్ధాంతము. ఆత్మబోధకు నిరంతర సాధన మరియు దానికి సంబంధించిన కృషి అవసరం, శరీర సుఖాలను త్యజించి, దాని యందు ఆసక్తి వదిలి వేసి సహనాన్ని అలవరుచుకోవాలి. ఆత్మపరిశీలనము చేసుకొని ముందుకు సాగే సాధకుడే అంతిమ లక్ష్యాన్ని చేసుకోగలుగుతాడు. అప్పుడే ఆత్మానుభూతి అనుభవంలోకి వస్తుంది. ఆత్మానుభూతి కలిగిన వ్యక్తి నిరంతరానందాన్ని పొందుతాడు. అలాంటి స్థితే జీవన్ముక్తి. ఆత్మ శాశ్వత బంధవిముక్తి పొంది పరమాత్మలో లయమగుటయే పురుషార్థ ములలో పరమశ్రేష్టమైన మోక్షప్రాప్తి పొందవచ్చును. శతకోటి జన్మల పుణ్య ఫలంగా ప్రాణులకు ముక్తి లభించునని అద్వైతం చెపుతుంది.

శాస్త్ర పఠనము ఎంత చేసినా, స్వర్గలోక నివాసులైన దేవతల ప్రీతికోసం యజ్ఞయాగాదులు జరిపించినా, నిత్యనైమిత్తిక కర్మలు ఆచ రించినా, అనేక దేవతలను కొలిచి భజించినా పరమాత్మలో లయమవటం దుర్లభము. ఇలాంటి ఎన్ని చేసినా ప్రయోజనం లేదు. భగవంతునిలో ఐక్య మయ్యే జ్ఞానమే ముక్తికి మార్గం అని కూడా అద్వైత సిద్ధాంతం తెలుపుతుంది.

**పరులపైఁ బ్రేమ యదితనకొఱకె గాక**
**పరులపై నని పలుకంగ వలను పడదు**
**అందుచేతనే ప్రేమ సర్వాధికమ్ము**
**అందుననె జీవుఁడానందుఁడనఁగ బరగు**

**ఇట్టియుక్తుల చేతనునెంచి చూడ**
**జీవుసచ్చితానందుఁగాఁజెప్పఁదగును**
**అట్టి జీవాత్మకును బరమాత్మకైక్య**
**భావముపనిషత్తులఁతెలుపంగఁబడెడు**

ఇలా జంధ్యాల వారి అనువాదం శ్లోకార్థాలతో కనిపిస్తుంది.

**సూక్ష్మదేహమె తానుగాఁజూచుజీవు**
**లమర తిర్యఙ్నరాది భేదములచేత**
**విశ్వనామంబు చేవిఱ్ఱవీగుచుండ్రు**
**వారు వెలుపల నుండెడివానినె కని,**
**తమదు లోనున్న వానినిదలఁపఁబోరు**
**కర్మములఁజేతురు సుఖదుఃఖంబులొంద**
**కర్మములఁజేయసుఖము దుఃఖము వహింతు,**
**రేటఁబడి కొట్టుకొనిపోవు కీటకంబు**
**ఒక్క సుడి నుండి పోవు నట్లొక్క సుడికి,**
**నొక్కజన్మ ముందుండి వేఱొక్కజన్మ**
**మొందుచు నరుండు మోక్షమ్మునొందఁబోఁడు**

**ఏటఁబడి కీటకము పురాకృత సుకృతము**
**వలన నొకని చేనుద్ధరింపంగఁబడిన**
**తీరము నఁదరుచ్ఛాయను జేరిమిగుల**
**నెట్లు విశ్రాంతిఁజెందునో యట్లుగానె**

ఇటువంటి తాత్త్విక విషయాలతో ఈ అనువాదం నిండి ఉంటుంది. మరొక చోట

**శుష్కతర్క వాదము నందుశూరులైన**
**బౌద్ధులును,అసద్వాదులు బ్రహ్మమందు**
**భ్రాంతచేత స్ఖులైనట్టి వారలంచు**
**జ్ఞానధుర్యుండుశంకరాచార్యుడనియె**

అంటూ శంకరాచార్య ప్రబోధాన్ని మనకు తెలియజేస్తారాయన.

**శోచనీయులు బౌద్ధులు శ్రుతనిమౌర్ఖ్య**
**మునననాదరించియు,సర్వము ననుమాన**
**ముననె సాధింపఁగాఁదలంపూని, "శూన్య**
**మే జగద్ధేతు"నని వచించుచుంద్రు**

**ఆదియందు శూన్యమై యుండెననియు,మఱియు**
**నదియు సద్యోగమును సన్మయంబు యనిన**
**ఉభయమును విరుద్ధంబయి యుండుకతన**
**శూన్యమందున నారెంటిఁజూడబోము**

ఇలా బౌద్ధుల గురించిన ప్రస్థావన కూడా ఈ అనువాదంలో చూడవచ్చు. అన్ని విషయాలను అధ్యయనం చేయటం అత్యంత ఆవశ్యకతగా నేను భావిస్తాను. అలాగే శంకరమతమో, మరో సిద్ధాంతమో తెలిపినది నా భావంగా ఎంతమాత్రము పాఠకులు భావించరాదు. విద్యారణ్యులవారు వేదాంత పంచదశిలో చెప్పినదాన్ని జంధ్యాలవారు అనువదించి అందిం చారు. వారు అనువదించినదేమిటో తెలపటం ఒక విమర్శకునిగా బాధ్యత తీసుకున్నాను. విద్యారణ్యుల వారి అభిప్రాయాలకు జంధ్యాలవారు పూర్తిగా మద్దతు తెలిపారని నేను చెప్పబోవడం లేదు. అనువాదకునిగా, గొప్ప పండితునిగా, వారు విద్యారణ్యులవారి వేదాంత పంచదశిలో ఏం చెప్ప బడిందో దాన్ని సమర్థవంతంగా తెలిపారని నేను భావిస్తున్నాను.

ప్రపంచంలో ఏ సిద్ధాంతాన్నైనా పూర్తిగా జాతంతా సమర్థించిన సందర్భంగాని లేక పూర్తిగా వ్యతిరేకించిన సందర్భంగాని కనిపించదు. ఇది ఎవరూ కాదనలేని సత్యం. ద్వైతం, అద్వైతం, విశిష్ట అద్వైతాలు అసలు ఏం చెప్పాయో ఇక్కడ ప్రస్థావించటం అప్రస్తుతం ఎంత మాత్రం కాదనేది నా నమ్మకం.

మధ్యయుగాల్లో భారతదేశంలో ఢిల్లీసుల్తానుల యుగానికి ఒక ప్రత్యేకస్థానముంది. ఈ యుగంలో మత సంస్కరణోద్యమాలు కొనసాగాయి. ఈ ఉద్యమాలు హిందూమత సమాజాలను భక్తిమార్గం ద్వారా సంస్కరించ డానికి ప్రయత్నం జరిగింది. అందువల్ల ఈ యుగంలో హిందూమతం ప్రాబల్యం వహించింది. భక్తి అనే పదం "బజ్" అనే మూలం నుంచి వచ్చింది. "బజ్" అంటే సేవ, ఉపాసన, పూజ,ప్రేమ మొదలైన అర్థాలు న్నాయి.

'భక్తి' అనే పదానికి నిర్వచనం ఇష్టదైవంపై ఎడతెగని అకుంఠితమైన 'భక్తి'. వాస్తవానికి హిందూమతంలో భక్తి అతి ప్రాచీనకాలం నుంచి కనిపి స్తుంది. ఇంద్రుని సంబోధిస్తూ రాసిన వైదిక మంత్రాలలో ఈ భక్తి బీజాలను చూడవచ్చు. కాని భక్తి ఉద్యమం ఒక సిద్ధాంతంగా భగవద్గీతలో భాగవత పురాణాలలో మొదటిసారి ప్రబోధించబడింది. మధ్యయుగ భక్తి ఉద్యమానికి ఈ రెండు ముఖ్యమైన ఆధారగ్రంథాలు. శైవ, వైష్ణవ మతశాఖలు రెండూ భక్తిని ప్రబోధించాయి. త్రిమతాచార్యుల బోధనలలో భక్తిమార్గం ప్రముఖ స్థానం వహించింది.

ఎంతోమంది భక్తి సిద్ధాంత బోధకులు ఈ యుగంలో ప్రాముఖ్యత పొందారు. సమకాలీన జీవితంపై ప్రభావాన్ని చూపించిన ఈ భక్తిబోధకుల బోధనలలో చాలా పోలికలున్నాయి. వారు ఏ ఒక్క మతశాఖకు చెందిన వారు కాదు. ఒక ప్రత్యేక మతశాఖను స్థాపించాలనీ వారికున్నట్లు కూడా కనపడదు. శృతులు, కర్మకాండ, విగ్రహారాధనలో గుడ్డినమ్మకాన్ని వారు ప్రదర్శించలేదు. వారు బహుదేవతారాధనను ఖండించడమే గాక ఏకేశ్వరోపాసనను ప్రబోధించారు. రాముడు, కృష్ణుడు, శివుడు అల్లాలను పలునామాలచే దేవుడు వివిధ మతశాఖల వారిచే పిలువబడినను దేవుడు ఒక్కడే అని వారు నమ్మారు. మోక్షసాధనకు భక్తిమార్గమొక్కటే ముఖ్యమైనది

అని ప్రబోధించడమే కాక వీరు భక్తి సిద్ధాంతమునకు అతి విస్తరమైన నిర్వచనాన్ని ఇచ్చారు. వీరి దృష్టిలో భక్తి అనగా స్వార్థచింతనలేని ఏకదీక్షతో కూడిన ఎడతెగని అకుంఠితమైన దైవభక్తి. ఈ భక్తియే క్రమంగా గాఢమైన ప్రేమగా ప్రబలుతుంది. ఈ ప్రేమ మానవుడు తనకు ఇష్టమైన వారిపై చూపే ప్రేమ. తల్లికి తన బిడ్డపై గల వాత్సల్యం. ఇంకా చెప్పాలంటే ఒక ప్రియునకు తన ప్రియురాలిపై గల గాఢమైన ప్రేమవంటిది. పరమాత్మయైన బ్రహ్మ, రాముడు, హరి, అల్లా లేక ఇంకే పేరుతో సంబోధించినప్పటికి ఆయనే బ్రహ్మానందానికి మూలాధారము. దేవాలయంలో కాక మానవుని హృదయంలో అతడు నివసిస్తాడు. ముఖ్యంగా భక్తిమార్గంలో మోక్షసాధన అంత సులభ సాధ్యం కాదు. దీనికి మనసు, శారరీక శుద్ధి అవసరం. వీటి అన్నిటికి ఒక గురువు సహాయం ఎంతైనా అవసరం. గురువు సహాయమొక్కటే మోక్షసాధనకు సరిపోదు. ఇది చాలా వరకు దైవానుగ్రహంపై ఆధారపడి ఉంటుంది. దీనికోసం భక్తుడు తనకు తాను పూర్తిగా భగవంతునికి అర్పించుకోవడం అవసరం.

ఇవి సూక్ష్మంగా గురువులు బోధించిన ముఖ్యసూత్రాలు. వీటిని సామాన్య జనానికి అర్థమయ్యేట్లు దృష్టాంత కథలతో, దేశభాషలలో బోధించారు. నిమ్నజాతుల ఉద్ధరణకోసం వర్ణ భేదాలను సైతం ఖండించారు.

ఈ తరుణంలో అద్వైత సూత్రధారియైన శ్రీ శంకరాచార్యులు పూర్వ మీమాంసా సిద్ధాంత ప్రధానమైన హిందూమతాన్ని అభివృద్ధి కాకుండా నిరోధించాడు. అంతేకాక శంకరులు "తత్త్వసిద్ధాంతాలు"అనే జీవనాడులను హిందూమతానికి అందించాడు. మతాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకున్న యాంత్రికమైన ఆచార కర్మకాండ పద్ధతులను తీవ్రంగా నిరసించాడు. శంకరా చార్యులు మీమాంసా సిద్ధాంత వాదులందరినీ పూర్వ పక్షం చేసి తన వాదాలలో ఎదుర్కొన్నాడు.

భగవంతుని (బ్రహ్మ పదార్థం) మాయా విలాసమే ప్రపంచ రూపం లో, జీవుల రూపంలో కనిపిస్తుంది. ప్రతి జీవిలోన ఉండేది పరమాత్మ లేక బ్రహ్మ పదార్థాంశమే. జీవాత్మ, పరమాత్మలో ఐక్యం కావడమే మోక్షము. ఈ జ్ఞానము సాధించినవాడే జీవన్ముక్తుడు. జ్ఞానమే మోక్షానికి మార్గమని బోధించినప్పటికీ భక్తి కర్మ వైరాగ్య మార్గాలను శంకరుడు కాదనలేదు. అయితే యజ్ఞయాగాది కర్మలు, కామకర్మలనీ ఖండించాడు. వాటివల్ల మోక్షం లభ్యం కాదని, జ్ఞానసాధనంగా నిష్కామకర్మను ఆచరించడమే యోగ్యమని బోధించాడు. సాధకుడు తన శక్తిసామర్థ్యాలను బట్టి తనకు అనుకూలమైన మార్గాన్ని ఎన్నిక చేసుకోవాలనేది శంకరుల మతం. వివిధ ఆదర్శాల సమ న్వయం ద్వారా వేరు వేరు స్థాయిలలో భిన్న వారసత్వాలతో, భిన్న జీవిత విధానాలతో ఉన్న ప్రజలు తమ తమ మానసిక ప్రవృత్తుల ననుసరించి జీవాత్మ, పరమాత్మల సంయోగాన్ని దర్శింపజేయనున్న విధానాన్ని అనుసరించవలసినదిగా బోధించడమే శంకరుని ఘనత అని విమర్శకుల అభిప్రాయం. శంకరుని విధానాన్నే ఉత్తమ మీమాంసా పద్ధతి అని కూడా అంటారు.

శంకరాచార్యుడు దక్షిణ భారతదేశంలోని మలబార్ ప్రాంతంలోని కాలడి అను గ్రామంలో క్రీ.శ.788 ప్రాంతంలో జన్మించాడు. బ్రాహ్మణ కుమారుడు కావటం వల్ల యుక్తవయసులోనే వేదవేదాంగాలను అభ్యసిం చాడు. శంకరులు గృహస్థ జీవితాన్ని స్వీకరించడానికి బదులుగా సన్యాసాన్ని స్వీకరించి, యావద్భారత దేశం పర్యటించాడు. అచిరకాలంలోనే తాత్విక శాస్త్రవేత్తగా ప్రసిద్ధి పొందాడు. దేశంలోని వివిధ ప్రాంతాలలో అద్వైత వేదాంత సిద్ధాంతాలను ప్రతిపాదించి, వాటిని పాదుకొల్పాడు. తన సిద్ధాం తాలన్నింటిని ప్రాచీన ఉపనిషత్ సిద్ధాంతాలతో రూపొందించాడు. సమ కాలీన మతవిశ్వాసాలను తాను ప్రతిపాదించిన ఉపనిషత్ సిద్ధాంతాలతో

సమాధానపరిచి, సమన్వయించడానికి బాగా ప్రయత్నం చేశాడు. బ్రహ్మము లేక పరమాత్మ అనే విషయం తప్ప ఏ విషయము ఉనికీ ఉండటానికి వీలు లేదని శంకరుని అద్వైత సిద్ధాంతం. పరమాత్మ అనే పదార్థము చుట్టూ మాయ లేదా అజ్ఞానం అనేది ఆవరించుకొని ఉంటుంది. ప్రతి జీవి కూడా ఆ మాయ లేక అజ్ఞానాన్ని వదిలి వేసి జీవాత్మకు పరమాత్మకు ఉన్న అభేదాన్ని గ్రహించాలంటాడు. జీవాత్మ పరమాత్మకు ఉన్న అభేదాన్ని గ్రహించే కార్యభారానికి, విధిగా జ్ఞానమార్గాన్ని లేక సన్యాసాన్ని స్వీకరిం చాలని నిర్దేశించాడు. మోక్షపదాన్ని చేరుకోవడానికి భక్తిమార్గాన్ని శంకరులు తిరస్కరించాడు. ఆయన ప్రబోధాలను దిగువ విధంగా సంక్షేంపించ వచ్చునని తాత్త్విక వేత్తలంటారు.

**బ్రహ్మసత్యమ్‌జగన్మిథ్య**

**జీవో్బ్రహ్మైవనరః**

బ్రహ్మము లేదా పరమాత్మ యదార్థమైనది. జగత్తు అంతా మిథ్య (శూన్యము) పరమాత్మ వలెనె జీవాత్మ కూడా భాషిస్తుంది. శంకరులు చాలా గ్రంథాలకు భాష్యం రాశాడు. భగవద్గీత భాష్యము, దశోపనిషత్తులకు వ్యాఖ్యానాలు, బ్రహ్మసూత్రాలు మొదలగునవి ముఖ్యమైనవి.

శంకరుడు పవిత్రమైన హిందూమత యుద్ధాన్ని లేవదీసి బౌద్ధమత సిద్ధాంతాలను నిరసించి, అన్యమతాల వారందరిని నిర్దాక్షిణ్యంగా అణచి వేశాడని కొందరు పండితులంటారు. శంకరుడు భారతదేశమంతా పర్యటించి తాత్వికమైన వాదోపవాదాలను లేవదీసి, బౌద్ధమత పండితులను జయించాడు. కాని ఈ పండితాభిప్రాయం నిస్సారమైనదని యమ్.యన్. ఘోష్ అనే చరిత్రకారుడు రాసిన ప్రాచీన భారతదేశం అనే గ్రంథంలో (64పేజి) ఒక క్రమమైన పద్ధతిలో తర్కించి, ఈ వాదాన్ని త్రోసిపుచ్చాడు.

ఏది ఏమైనా శంకరులు హిందూమత వ్యాప్తికోసం వ్యవస్థా పూర్వ

కమైన ప్రధాన కార్యకలాపాలు నిర్వహించాడు. ప్రాచీన భారతదేశంలో బదరీనారాయణ్‌లోను, పూరీజగన్నాథంలోను, ద్వారకానగరంలోను, శృంగేరీలోను నాలుగు మఠాలను స్థాపించాడు. శంకరుని అద్వైత సిద్ధాం తాలు సామాన్య ప్రజాహృదయాలలో బాగా హత్తుకొనిపోయి, శాశ్వతంగా నిలిచేటట్లు ఈ మఠాలు సహాయపడ్డాయి.

తరువాత కాలంలో దేవాలయాలలో స్థాపించిన విద్యాలయాలన్నీ శంకరుని మత సిద్ధాంతాలను విస్తృతంగా ప్రచారం చేశాయి. ఈ విద్యాల యాలు హిందూమత సిద్ధాంతాలను తప్ప బౌద్ధమత సిద్ధాంతాలను గాని, బౌద్ధమత తత్వశాస్త్రాలనుగాని బోధించేవి కావు. హిందూమత పునర్వ్యవస్థీకరణలో ఈ విద్యాలయాలు ప్రముఖ పాత్ర వహించాయి. శ్రీ శంకరుని సిద్ధాంతాలను అనుసరించేవారు స్మార్తులుగా పిలువబడతారు. అంటే స్మృతులు పీఠిక వీరికి ప్రమాణ గ్రంథాలు. వీరికి శంకరులు జగద్గురువు, భగవత్పాదులు.

ఇక రామానుజుల విషయానికొస్తే శంకరులకు పూర్వం అద్వైత సిద్ధాంత ప్రబోధకులు ఉన్నప్పటికీ శంకరునకే అద్వైత మతస్థాపన కీర్తి దక్కింది. ఆవిధంగానే రామానుజుడికి పూర్వం విశిష్టాద్వైత మత ప్రచారకులు కొందరు ఉన్నప్పటికీ రామానుజుడే ఈ మతానికి మొదటి చారిత్రక ప్రవర్తకుడుగా ప్రఖ్యాతి పొందాడు. విశిష్టాద్వైత మతానికి అనుగుణంగా రామానుజుడు రచించిన ముఖ్య గ్రంథం శ్రీ భాష్యం. ఇది బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం. ఈయన ఇతర గ్రంథాలు చూస్తే భగవద్గీత మీద వ్యాఖ్యానం. వేదాంతదీపం, వేదాంతసారం, వేదార్థసారం మొదలగునవి కనిపిస్తాయి.

విశిష్టాద్వైతానికి ఆధారమైన గ్రంథాలు సంస్కృతంలో ఉన్న ప్రస్థాన త్రయం (ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు) వైష్ణవ ఆగమాలు, భాగవతాది పురాణాలు తమిళంలో ఉన్న ప్రబంధాలు (ఆళ్వారుల స్తోత్రాలు)

మొదలైనవి ఈ దర్శనానికి పునాదులైనందున విశిష్టాద్వైతం, ఉభయ వేదాంతమని ప్రసిద్ధి చెందింది. మత విషయంగా దీనినే వైష్ణవమతమం టారు. నిర్మలానందస్వరూపుడు, సాగరుడు,శ్రీయుతుడు, పరిజనులు, దివ్య స్త్రాదులు కలవాడు, బ్రహ్మవిశేష లక్షణాలతో కూడిన విశిష్ట పదార్థం. అద్వైత మైన పరసత్యము విశేషణ విశిష్టం. కనుక ఈ తత్వాన్ని విశిష్టాద్వైతమని పేర్కొన్నారు.

విశిష్టాద్వైతంలో సగుణ బ్రహ్మ (ఈశ్వరుడు) నిత్యజీవులు(చిత్), అచేతన ప్రకృతి(అచిత్) మూడు కూడా సత్యం. ఈ సత్యత్రయంలో బ్రహ్మ మాత్రమే సర్వస్వతంత్రమైన పరమ సత్యం. తక్కిన రెండు పరతంత్ర సత్య పదార్థాలు. చిత్ అయిన జీవులు 'అచిత్' అయిన ప్రకృతి బ్రహ్మ కంటే భిన్నం కాక ఆయనకు విశేష లక్షణాలుగా, అవయవరూపంగా ఉంటాయి కనుక చిదచిద్విశిష్టుడు బ్రహ్మ. రామానుజుడు కులతత్వాన్ని ఖండించాడు. ఈయన గురువైన కంచిపూర్ణుడు బ్రాహ్మణుడు కాదు. ఈయనకు అమర్యాద జరిగినందున రామానుజుడు తన భార్యపైనే ఆగ్రహించాడు. అస్పృ శ్యులను ఆయన తిరుకుత్తార్ అని సంబోధించాడు.

మోక్షానికి విష్ణుభక్తే సాధనమని జీవాత్మ పరమాత్మ సామీప్యం పొందడమే మోక్షమని రామానుజుడు బోధించాడు. అచంచలమైన భక్తిద్వారానే భగవంతుని సాక్షాత్కారం లభిస్తుందని ప్రకటించాడు. గీతా చార్యుడు ప్రకటించినట్లుగా యజ్ఞయాగాదుల ద్వారా భగవంతుని పొందలేరు. కర్మల ద్వారా హృదయశుద్ధి, తద్వారా జ్ఞానం, దానివల్ల దృఢ మైన యదార్థభక్తి, భక్తి ద్వారా ఈశ్వర సాయుజ్యం సిద్ధిస్తుంది. అయితే ఈ క్రమవిధానం కొంతమందికి మాత్రమే విధించినందువల్ల, జ్ఞానపూర్వక భక్తి లభించటం సాధారణ విషయం కానందువల్ల ఈ విధానం అందరికి వర్తించదు. అందువల్ల రామానుజుడు వర్ణలింగాది వ్యవస్థకు మరొక

సులభమార్గం నిర్దేశించాడు. దీన్ని ప్రపత్తి అంటారు. ఇది ఈశ్వరప్రాప్తికి సులభోపాయం. అందరికి అనుకూలం. ప్రపత్తి అంటే సంపూర్ణంగా మానవుడు భగవంతునికి తనను అర్పణం చేసుకోవడం. ఆయన తప్ప తనకు వేరే శరణ్యం లేదని, సర్వవిధాల ఆయననే నమ్ముకొని, ఆయననే ధ్యానించి, పూజించి, ఆయన ఇచ్ఛకు తన ఇచ్ఛను ఆధీనం చేయటం.

రామానుజాచార్యుల మరణానంతరం, ఆయన స్థాపించిన శ్రీవైష్ణవ మతంలో రెండు శాఖలు పరస్పర విరుద్ధమైనవి ఉత్పన్నమైనాయి. తెంగాలైశాఖ (దక్షిణాది)కు పిళ్లైలోకాచార్యుడు. వడకలైశాఖ (ఉత్తరాది)కు వేదాంత దేశికులు ముఖ్యులు. తెంగలులు ఎక్కువగా ద్రావిడ వేదం మీద ఆధారపడ్డారు. 'ప్రపత్తి' ఆశ్రయించారు. భగవత్కృప అహేతుకమన్నారు. వర్ణాశ్రమాలకు ప్రాముఖ్యతనీయలేదు. వడగలు దీని విరుద్ధంగా శృతి, స్మృతులకు వర్ణాశ్రమాదులకు అత్యధిక ప్రాముఖ్యతనిచ్చారు.

ఇక వైష్ణవ భక్తిమార్గ ప్రచారకులలో రామానుజాచార్యుల తర్వాత చెప్పుకోదగినవాడు మధ్వాచార్యుడు. కర్ణాటక రాష్ట్రంలోని ఉడిపి పట్టణ సమీపంలోని వేలి గ్రామంలో 1199లో వేదవతి, మధ్యగేహభట్టు దంపతులకు జన్మించాడు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు వాసుదేవుడు. బాల్యంలోనే వేదాధ్యయనం చేసి గొప్ప పాండిత్యాన్ని సంపాదించాడు. తన 11యేట అచ్యుత దీక్షితుల వద్ద సన్యాసం స్వీకరించాడు. పూర్ణ ప్రజ్ఞుడిగా పేరు మార్చుకున్నాడు. దీక్షాగురువు దగ్గర అధ్యయనం చేసిన అద్వైత వ్యాఖ్యానాలు ఆయనకు సంతుష్టినీయలేదు. వేదాంత పారంగతుడైన ఆనంద తీర్థనామంతో (ఈయనే మధ్వాచార్యుడు) మఠాదీశుడైనాడు. ఆసేతుహిమాచల పర్యంతం పలుమార్లు పర్యటించాడు. శాస్త్రార్థాలు రాస్తూ గ్రంథాలు రాస్తూ జీవితం గడిపాడు. ఉడిపి దగ్గర కృష్ణుని ఆలయాన్ని నిర్మించి దానిని తన అనుయాయులకు కేంద్రస్థానంగా ఏర్పాటు చేశాడు. యజ్ఞశాలలో

పశుబలిని నిషేధించిన ఘనత ఈయనకే దక్కింది. వేదాలు, పాంచరాత్ర వైష్ణవ ఆగమాలు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఇతిహాస గ్రంథాలైన రామాయణ, మహాభారత, భాగవతాది పురాణాలు ద్వైతమతానికి మూల గ్రంథాలు మధ్వాచార్యుడు ప్రమాణంగా గ్రహించాడు.

కొన్ని విషయాలలో విశిష్టాద్వైతానికి సామ్యమున్నది. రామానుజాచార్యుని లాగా మధ్వాచార్యుడు బ్రహ్మను సాకారం సగుణ రూపంగానే గ్రహించాడు. పరమ సత్య స్వరూపుడైన బ్రహ్మ సమస్త సద్గుణాలకు ఆశ్రయుడైన శోభనమూర్తి. ఆయన విష్ణునారాయణ. మధ్వాచార్యుని సిద్ధాంతంలో ద్వైతం పరమార్థం భేదం మీదే ఆధారపడి వుంది. భగవంతునికి జీవునికి మధ్య, భగవంతునికి జడ ప్రకృతికి మధ్య,జీవునికి జీవునికి మధ్య, జీవునికి ప్రపంచానికి మధ్య, ప్రపంచంలోని జడపదార్థానికి జడపదార్థానికి మధ్య భేదముందని ఐదువిధాలుగా భేదాన్ని నిరూపించారు.

ద్వైతమతంలో సత్యపదార్థాలు మూడుగా చెప్పబడతాయి. ఆది బ్రహ్మ, జీవుడు, ప్రపంచం. ఇవి మూలంలోనే భేదమున్న శాశ్వత ద్రవ్యాలు. ఇందులో బ్రహ్మమాత్రమే స్వతంత్ర సత్తా కలిగిన పదార్థం. తక్కిన రెండు బ్రహ్మసత్తుమీద ఆధారపడతాయి. కాబట్టి అవి పరతంత్ర సత్తాలు. మధ్వాచార్యుని గురుపరంపరలో జయతీర్థుడు, వ్యాసరాజస్వామి, రాఘవేంద్ర స్వామి ముఖ్యమైనవారు.

నింబార్కుడు, రామానందుడు, వల్లభాచార్యులు, చైతన్యుడు, కబీర్ నానక్, వామదేవుడు వంటి ఎందరో మతోద్ధారకులు తమ తమ బోధనలతో ముందుకు సాగారు.

ఆధునిక కాలంలో శంకరాచార్య ప్రబోధించిన అద్వైత తత్వానికి అనుభవసిద్ధికీ కూడా ప్రాముఖ్యం పెరిగి విజ్ఞాన శాస్త్రము, తత్వ శాస్త్రము పరస్పరసహకారులై భారతదేశంలో వర్థిల్లుతున్నాయి. విజయనగర స్థాపనకు

మూలకారకుడైన విద్యారణ్యయతీంద్రులు వారు మూడువందలకు పైగా గ్రంథాలను రచించినట్లు చెపుతారు. ఆయన అద్వైత తత్వాన్ని బోధించే వేదాంత గ్రంథాలలో శ్రీమద్విద్యారణ్యులు రచించిన వేదాంత పంచదశి ఒకటిగా వెలుగొందింది.

ఒక్కొక్కరు ఒక్కోమార్గాన్ని అనుసరిస్తూ, తాము నమ్మిన సిద్ధాం తాలను తత్వాలను వివరించటం కనిపిస్తూనే ఉంటుంది. ఇట్టి 'వేదాంత పంచదశి'ని అనువదించటంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వంద శాతం సఫలత చెందారని చెప్పవచ్చు.

**శ్లో- "ఉత్తమాధమ భావశ్చేత్తేషాంసాదస్తుతే నకిమ్**
**స్వప్నస్థరాజ్య భిక్షాభ్యాం నబుద్ధం స్పృశతేఖలు"**

ఈ శ్లోకాన్ని జంధ్యాలవారు ఇలా అనువదించారు.

**"వసుధ గొప్పవారని కొద్దివారటంచు**
**అనుకొనెదు గాక దానితో నైనయాప్ర**
**యో జనంబేమి? స్వప్న మందుండురాజ్య**
**మైనను భైక్ష్యమునకు ప్రయోజనమనదె?"**

అలాగే

**శ్లో॥ "స్వతః పూర్ణః పరాత్మా త్రబ్రహ్మశబ్దేన వర్ణితః**
**అస్మీత్యైక్య పరామర్శస్తేన బ్రహ్మభావామ్యహం"**అన్న శ్లోకాన్ని

**"అఖిలమును నైజముగ నింపు నాపరాత్మ**
**బ్రాహ్మ శబ్దము చేతను వర్ణితంబు**
**అస్మియని జీవ బ్రహ్మైక్యమగుట చేత**
**నేనె బ్రహ్మంబటంచును నెంచ బడెదు"**

అంటూ అనువదించారు జంధ్యాలవారు.

"బ్రహ్మమునకు జీవునకు నావరణరములగు
మాయను అవిద్యను విదల్చివేయు నెడల
సచ్చిదానంద రూపమై సర్వగతుల
నా పరబ్రహ్మమే నిలు నఖిలమగుచు

............

"అనుభవమును బ్రహ్మమ్ము లేదందువేని
స్వప్రకాశుండు లేదన్నcజనునుగాక,
మౌనమందుండి మౌనము మానినపుడు
ఇంతకుముందు మౌనమును నెఱుంగు
సాక్షియొకడుండవలదె, యాసాక్షి యొకcడె
తత్పరబ్రహ్మ మంచు డెందమున నెంచు
తనదు సంకల్ప హీనత తనకుc తెలియు"

............

"సత్తునకు సత్పదార్థంబు శక్తి గాదు
అగ్ని తనకుcదానే శక్తియగుట కలదె?
సత్పదార్థము కంటె నా శక్తిభిన్న
మైనచో నదిశూన్యమే యగును గాదె?
(రూపమును లేని వస్తువిందే పగిదిగ
నుండు ననcగ నాశ్చరమైయుండు నిజమె
మాయంగూర్చి విచారణcదలcప రాదు)

ఇలా ఈ అనువాదమంతా అద్వైత సిద్ధాంత తత్వాన్ని విడమర్చి చెప్పుట చూడవచ్చు. సరళమైన భాషనుపయోగించడం వల్ల సామాన్యులు సైతం ఈ సిద్ధాంత తత్వాన్ని అవగతం చేసుకోవడానికి వీలవుతుంది.

ఇక జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అందించిన మరోగొప్ప

గ్రంథం "శ్రీసాలంకార కృష్ణదేవరాయలు" ఈగ్రంథంలో 878పద్యాలను పొందుపరిచారు. ఈ గ్రంథంలోని పద్యాలు వివిధ అలంకారాలతో రాసినవి. ఏ పద్యం ఏ అలంకారంతో ఉన్నదో ఒక పట్టికను కూడా పొందుపరిచారు జంధ్యాలవారు. మొత్తం 170 అలంకారాలతో అలరారుతూ 6 అశ్వాసాలతో ఉన్నదీ గ్రంథం. శ్రీకృష్ణదేవరాయల జీవితం, విజయాలను చరిత్ర పరంగా వివరిస్తూ వివిధ అలంకారాలను చేరుస్తూ తన పాండిత్య ప్రకర్షను అద్భుతంగా ప్రదర్శించిన గ్రంథమిది. సాహిత్య ప్రపంచంలో అరుదైన కావ్యాలలో చేర్చదగినదీ గ్రంథం. వివిధ అలంకారాలతో నిండి ఉండటం, శ్రీకృష్ణదేవ రాయల గురించినది కావడం వలన ఈ గ్రంథానికి "సాలంకార కృష్ణదేవ రాయలు"అని సముచితమైన పేరును వారు పెట్టారు. పాణినీయము, ధ్వన్యాలోకము, రసగంగాధరము, అప్పకవీయము, సర్వలక్షణ సారసంగ్రహము, చంద్రలోకము వంటి అనేక గ్రంథాలను కంఠస్థం చేసిన మహాపండితులు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. కావుననే ఈగ్రంథాన్ని అనితరసాధ్యంగా, అలంకార ప్రియత్వంతో అందించగలిగారని చెప్పవచ్చు. ఇటువంటి గ్రంథాన్ని రాయగలవారు నేడు అతి స్వల్పంగా కనిపిస్తారేమో చెప్పలేం.

ఈ గ్రంథంలో ప్రథమాశ్వాసములో రాయలవారి బాల్యము, విద్యాభ్యాసము, ప్రజాదరణ, రాయల సవతి తల్లి నాగాంబ కారణంగా మృత్యువు వరకు చేరుకోవడం, అదృష్టవశాత్తు బయటపడటం వంటివి కనిపిస్తాయి.

రెండవ అశ్వాసములో రాయలు తిమ్మరుసును రక్షించిన వైనం, రాయల యుద్ధములు, వ్యూహరచన, ఉమ్మత్తూరు, గండికోట, శివ సముద్రాలపై దండయాత్రలు, విజయాలు, రాయల కీర్తి ప్రతిష్టలు ఆంధ్ర, కర్ణాటక దేశముల వ్యాప్తిని ప్రస్తావించడం మొదలగునవి కనిపిస్తాయి. తృతీయాశ్వాసములో 1509 నాటి రాయపట్టాభిషేకం, ప్రజానురంజక పాలన, విరూపాక్షాలయ నిర్మాణం, రాజనీతి శాస్త్ర అధ్యయనం, శ్రీరంగ

పట్నం, మళయాల, చోళ, రాజ్య వంశాల వంటివి ప్రస్తావించబడ్డాయి.

చతుర్థాశ్వాసములో ఓఢ్రవిజయము, గజపతులతో యుద్ధము, కొండవీటి దుర్గాక్రమణ, రాయల తిరుమల దర్శనము, విజయస్థంభ స్థాపన, అహోబిల నరసింహ దర్శనము, కటక విజయం, గజపతుల కుమార్తె తుక్కాంబతో వివాహం జరగటం వంటి అంశాలుంటాయి.

పంచమాశ్వాసములో గోదావరిస్నానము, ముగ్గురు భార్యలతో ప్రయాణము, తిరుపతి గోపురమునకు బంగారుపూత, స్వామి వారికి నవరత్నాభరణములు కానుకివ్వడం, అక్కడ నుండి రామేశ్వరం యాత్ర తర్వాత విజయనగరం చేరుట, విజయనగరమున సుభిక్షమైన సుఖ శాంతులతో పాలన సాగించుట వంటి వాటిని ప్రస్తావించారు జంధ్యాల వారు.

షష్టమాశ్వాసములో సాహిత్యగోష్టులు, లలిత కళల పోషణ, భువన విజయము, ఆముక్తమాల్యద రచన, శిల్ప సంపద వంటివి వర్ణించబడ్డాయి. చివరన కాలగర్భములో కలిసిన వాటిని స్మరిస్తూ వాటి ఒకనాటి వైభవాన్ని చూపిస్తూ ప్రశంసిస్తూ ఈ కావ్యాన్ని ముగించారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఈ కావ్యంలోని ప్రతి పద్యమూ జంధ్యాల వారి పాండిత్య ప్రతిభకు అద్దంపడుతూ ప్రకాశిస్తూ కనిపిస్తుంది.

హిందూధర్మ సముద్ధరణ, వైదిక ధర్మ పరిరక్షణ ప్రధానధ్యేయాలుగా, శృంగేరి శంకర మఠ పీఠాధిపతులైన విద్యారణ్యస్వామి వారి ప్రోత్సాహంతో, ఆశీర్వాదంతో సంగమవంశరాజులైన హరహరబుక్కరాయల సోదరులు 1336లో విజయనగర సామ్రాజ్య స్థాపన చేయడం భారతదేశ చరిత్రలో, ముఖ్యంగా దక్షిణ భారతదేశ చరిత్రలో అతి విశిష్టమైన, అపూర్వమైన ఘట్టం. 1323లో ఉలుఘ్‌ఖాన్ తర్వాత మహమ్మద్ బిన్ తుగ్లక్ కాకతీయ సామ్రాజ్యంపై దండెత్తి, ఓరుగల్లు దుర్గాన్ని ముట్టడించి, అక్కడ జరిగిన

యుద్ధంలో కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రున్ని బంధించడంతో కాకతీయ సామ్రాజ్యం పతనమయింది. తర్వాత 1323లోనే ఉలుఘ్ఖాన్ మిగిలిన దక్షిణ భారత దేశాన్ని జయించి, దానిని ఢిల్లీ తుగ్లక్ సుల్తాన్‌ల ఏలుబడిలోకి తెచ్చాడు. 1324, 1335 సంవత్సరాల మధ్య దక్కన్ (నేటి ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక, తమిళనాడు ఢిల్లీ సామ్రాజ్యంలో భాగాలయ్యాయని వీటిని దేవగిరి, తిల్లింగ్(త్రిలింగ్, తెలంగాణ) కంపిలి, ద్వార సముద్రం, మధుర అనే ఐదు రాష్ట్రాలుగా విభజించి ఢిల్లీ సుల్తానులు పరిపాలించారని ముస్లిం చరిత్ర కారులు రాశారు.

పై విధంగా ఏర్పడిన ముస్లిం సైనికపాలనలో భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో రాజకీయ, సాంఘిక వ్యవస్థలు అస్తవ్యస్తమై అరాచక పరిస్థితి ఏర్పడింది. సమకాలీన వాఙ్మయం, శాసనాలు ఈ అరాచక పరిస్థితి కొంత విపులంగా వర్ణించాయి. ప్రతాపరుద్రుడు పరాజితుడైన తర్వాత తురుష్కుల అరాచకం ప్రారంభమైంది. దేశం అన్యాక్రాంతమైన పిదప ధనవంతులు అనేకమంది పీడింపబడ్డారు. పారశీకులను చూడగానే ప్రాణాలు వదిలినారు. ద్విజులు తమ యజ్ఞకర్మలను వదులుకోవాల్సి వచ్చింది. దైవ విగ్రహాలు అనేకం ధ్వంసమైనాయి. మహాపండితులు భోక్తలుగా ఉన్న అగ్రహారాలు గుంజివేయబడ్డాయి. యవనులు రైతులు పండించిన పంటనంతటిని బలాత్కారంగా లాక్కోవటం చేత దరిద్రులు, ధనికులు అనే భేదము లేక రైతుల కుటుంబాలన్నీ నాశనమై పోయాయి. కల్లుతాగ వలెను, ఆవు మాంసము తినవలెను. స్వచ్ఛంద విహారం చేయవలెను. బ్రాహ్మణులను చంపవలెను. ఇది యవనాదుల వృత్తి, వారివల్ల బ్రతుకుల్లో తీవ్రమైన అలజడి బయలుదేరింది. ఆంధ్ర దేశ పరిస్థితి ఇలా ఉండగా తమిళ దేశ పరిస్థితి ఇంతకన్నా శోచనీయంగా ఉంది.

దక్షిణ భారతదేశంలో ఏర్పడిన ఈ అరాచక పరిస్థితి ఎక్కువ కాలం

కొనసాగలేదు. ముస్లింలు దేశాన్ని ఆక్రమించిన వెంటనే ఆంధ్రదేశంలో ముసునూరి ప్రోలయనాయకుడు, కాపయనాయకుడు, ప్రోలయ వేమారెడ్డి, అరివీటి సోమదేవరాజు, దక్షిణదేశంలో కర్ణాటక చక్రవర్తి, హోయసల మూడో బల్లాలుడు మొదలగు నాయకుల సారథ్యంలో విమోచనోద్యమం బయలు దేరింది. ఒక దశాబ్దంలోనే అన్ని ప్రాంతాలు ముస్లిం పాలకుల నుండి విముక్తి పొందాయి. ఈ దాస్య విమోచనోద్యమ పరాకాష్టగా జరిగినదే విజయనగర సామ్రాజ్య స్థాపన.

విజయనగర సామ్రాజ్యం దాని స్థాపనాధ్యేయమైన హిందూ ధర్మ, సంస్కృతుల రక్షణ విఫలం కాలేదని చెప్పటానికి, నేడు కృష్ణానదికి దక్షిణంగా శత్రుమూకల చేత ఛిన్నాభిన్నం కాకుండా నిలిచి ఉన్న అద్భుత శిల్ప సంపదతో విలసిల్లుతున్న దేవాలయాలు, సంస్కృత, ద్రావిడ భాషలలో అది మనకు వారసత్వంగా మిగిల్చిపోయిన మత, కావ్య వారసత్వం మూడోమత (ఇస్లాం మత) సంస్కృతీ ప్రభావంతో భాషలో కాని, కళలో కాని, ఆచార వ్యవహారాలలో కాని మౌళికంగా లోనుకాకుండా ఉన్న దక్షిణ భారతదేశ హిందూ సమాజం ప్రత్యేక నిదర్శనాలు.

విజయనగర సామ్రాజ్యం 1336 నుండి 1646 వరకు నాలుగు వంశాలకు చెందిన రాజులు అవిచ్ఛిన్నంగా పరిపాలించారు. విజయనగర రాజవంశాలలో మూడవ రాజవంశం తుళువ వంశంవారు. ఈ తుళువ వంశం రాజులలో మొదటివాడు వీరనరసింహరాయలు (1506– 1509) కాగా, రెండవవాడు శ్రీకృష్ణదేవరాయలు (1509–1530) శ్రీకృష్ణదేవ రాయల కాలం సాహిత్యానికి, కళలకు స్వర్ణయుగంగా చెప్పవచ్చు. సాహితీ సమరాంగణ సార్వభౌముడుగా, ఆంధ్రభోజుడుగా ప్రసిద్ధి పొందాడు. శ్రీకృష్ణదేవరాయలు "దేశభాషలందు తెలుగు లెస్స" అని భావించి తెలుగులో అనితర సాధ్యంగా 'ఆముక్తమాల్యద' మహాప్రబంధాన్ని రాశారు. శ్రీకృష్ణ

దేవరాయలకు మనుచరిత్రను అంకితం ఇచ్చిన ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దన ఆంధ్రసాహిత్యం ప్రబంధరీతికి ఒరవడి దిద్దినవాడు. తర్వాత వచ్చిన కవులకు ప్రబంధరీతిలో మార్గదర్శకుడయ్యాడు. కృష్ణదేవరాయలు పెద్దనకు గండపెండేరం తొడిగి, పల్లకి మోసి, కోకట గ్రామం వంటి అనేక అగ్రహారాలిచ్చి విశేషరీతిలో సత్కరించాడు.

కృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలనే కవులు ఉండేవారు. వీరిలో నందితిమ్మన, ధూర్జటి, మాదయగారి మల్లన, అల్లసాని పెద్దన మాత్రమే తెలుగు కవులంటారు. నందితిమ్మన పారిజాతాపహరణాన్ని రాయల కవితమిచ్చాడు. ధూర్జటి శ్రీకాళహస్తి మహత్మ్యం, కాళహస్తీశ్వర శతకం రాశాడు. మాదయగారి మల్లన రాజశేఖర చరిత్ర రాసి తిమ్మరుసు మేనల్లుడైన నాదెండ్ల అప్పనామాత్యునికి అంకితమిచ్చాడు కృష్ణరాయల కాలంలో సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనం రాశాడు. శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన ప్రభువులలో ఉత్తమోత్తముడిగా పేరుపొందాడు. అంతేకాక భారతదేశాన్ని పాలించిన గొప్పరాజులలో రాయలవారొకరు. మహాసూరుడై, అపజయమనేది ఎరుగని వీరునిగా పేరు గాంచాడు. కృష్ణరాయలు స్వయంగా గొప్ప విద్వాంసుడు, రాజనీతిజ్ఞుడు, కృష్ణరాయలు పిన్నవయసులోనే రాజ్యాధిపతి అయ్యాడు. ఇతని సవతి తల్లి ఇతన్ని చంపించటానికి ప్రయత్నించగా తిమ్మరుసు ఇతన్ని రక్షించాడని కొన్ని గాథలు ప్రచారంలో ఉన్నాయి. శ్రీకృష్ణదేవరాయలు సింహాసన మదిష్టించు నాటికి రాజ్యపు పరిస్థితులేమంత తృప్తికరంగా లేవు. విజయ నగరమునకు ఉత్తరమున గజపతులు బలవంతులై కొన్ని ప్రాంతాలను స్వాధీన పరుచుకున్నారు. దక్షిణమును ఉమ్మత్తూరు నాయకులు రాయని అధికారాన్ని ధిక్కరించి స్వతంత్రులై ఉన్నారు. బహమని సుల్తాన్ విజయనగర సామ్రాజ్యంపై జిహాద్ (మతయుద్ధము) ప్రకటించాడు. ఇలాంటి పరిస్థితు

లలో పట్టాభిషిక్తుడైన కృష్ణరాయలు శత్రువులను ఎదుర్కోవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. తొలుత రాయలు బహమనీ సుల్తాన్ మహమ్మద్ శాహు విజయ నగరం పైకి పంపిన దండయాత్రను ప్రతిఘటించి, శత్రుసేనలను ఓడించి కోవెలకొండ సమీపం వరకు తరిమివేసి, అచట బీజాపూర్ పాలకుడైన యూసఫ్ ఆదిల్‌ఖాన్‌ను వధించి, ఆ దుర్గాన్ని వశపరుచుకున్నాడు.

తదుపరి 1512లో కృష్ణరాయలు దక్షిణ దేశ విజయానికై బయలు దేరాడు. రాయలు మొదటి ఉమ్మత్తూరు రాజుపై తన సేనను నడిపి అక్కడి దుర్గాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఈ సందర్భంగా కోటగోడలను ధ్వంసం చేశాడు. అటుపై శివసముద్రం కోటపైకి సేనలను పంపెను. ఈ కోట కావేరి నది యొక్క రెండు పాయల నడుమ నెలకొని పర్వతావృతమై ఉండి శత్రు దుర్భేద్యంగా ఉంటుంది. ఉమ్మత్తూరు రాజగు గంగరాజు ఇక్కడ దాక్కొని, ఒక సంవత్సరం వరకు రాయలను ప్రతిఘటించి, చివరకు ఓడిపోయాడు. అక్కడి నుండి పారిపోవటానికి ప్రయత్నించి గంగశుచి అనే మడుగులో పడి మరణించాడు. ఈ రెండు దుర్గాలు పట్టుపడటంతో కర్ణాటక ప్రాంతమంతయు రాయల వశమయింది. అయినను కొందరు పాలెగాళ్ళు ఇంకను రాయలను ధిక్కరించి స్వతంత్రులై ఉండటం వల్ల కృష్ణదేవరాయలు శ్రీరంగపట్నం కోటపై తన సేనలను నడిపి దానిని కూడా వశపరుచుకున్నాడు. ఇంతటితో దక్షిణదేశంలో రాయల అధికారం స్థిర పడింది. ఈ సందర్భంగా శ్రీకృష్ణదేవరాయలు శ్రీరంగపట్నాన్ని కర్ణాటక రాజ్యమునకు రాజధానిగా చేశాడు. తాను జయించిన కర్ణాటక ప్రాంత మునకు కెంపగౌడడు, వీరప్ప గౌడడు అను పాళెగాండ్రను తనకు సామంతు లుగా నియమించాడు. అంతేగాకుండా ఆయా ప్రదేశాలందు చిన్న పాళె గాళ్ళను స్థానిక పాలకులుగా ఏర్పాటు చేశాడు. అటుపిమ్మట శ్రీకృష్ణదేవ రాయలు తన సేనలను ఉత్తరదిశగా నడిపాడు. కటకాధీశులగు గజపతులు

బలవంతులై ఉన్నారు. ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి మున్నగు దుర్గాలను వారు స్వాధీనం పరుచుకుని ఉన్నారు. ఇది విజయనగరం వారికి చిరకాలం నుండి అవమానంగా ఉన్నది. క్రీ.శ. 1513వ సంవత్సరంలో కృష్ణదేవరాయలు పూర్వదేశ విజయానికై గొప్ప సన్నాహంతో బయలుదేరాడు.

ఇతడు మొదట ఉదయగిరి దుర్గాన్ని స్వాధీనపరుచుకొని ఇక్కడి పాలకుడయిన తిరుమల రాహుత్తరాయుడిని పారదోలాడు. ఆపైన రాయలు శత్రుదుర్భేద్యమైన కొండవీడు దుర్గాన్ని ముట్టడించాడు. రాయల దండయాత్ర గురించి తెలుసున్నా కటకాధీశ్వరుడు గజపతి మహా సైన్య సన్నాహంతో వచ్చి కృష్ణానది ఒడ్డున విడిది చేశాడు. రాయలతనిపై తన సేనలను నడిపి ఘోరయుద్ధము చేసి గజపతిని ఓడించి పారద్రోలాడు. ఆపైన బలిష్టమైన కొండవీడు దుర్గం రాయల వశమయింది(1515). ఇదే సందర్భంగా రాయలు బెల్లంకొండ, నాగార్జునకొండ, అద్దంకి మొదలైన దుర్గాలను స్వాధీనపరుచుకున్నాడు.

ఈ దండయాత్రల సందర్భంలో కృష్ణదేవరాయలు అమరావతి పట్టణంలో అమరేశ్వరుణ్ణి దర్శించి అటు తర్వాత విజయవాడను సందర్శించాడు. అమరావతి, విజయవాడ దేవాలయాలకు దానాలు చేసి, అక్కడ దాన శాసనాలను వేయించాడు. శ్రీకాకుళ క్షేత్రమందలి ఆంధ్రవిష్ణువు సందర్శించాడు. ఈ సందర్భంలోనే రాయలు ఆముక్త మాల్యద కావ్యసృష్టికి శ్రీకారం చుట్టాలనే సంకల్పం కలిగింది. విజయవాడ నుండి ముందుకు సాగి కొండపల్లి దుర్గమును ముట్టడించాడు. అటు నుంచి తెలంగాణలో ప్రవేశించాడు. తెలంగాణ గజపతుల ఆధీనంలో ఉన్న దుర్గాలను స్వాధీనం చేసుకొని రాష్ట్రమును తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. మహావీరుడైన షితాబుఖాన్ అనబడే సీతాపతితో యుద్ధంచేసి అతన్ని ఓడించాడు. తరువాత తీరాంధ్ర ప్రదేశాన్ని అంతటిని స్వాధీనం చేసుకున్నాడు. ఈ సందర్భంగా

విశాఖపట్నం జిల్లాలోని పొట్నూరు వద్ద విజయస్తంభమును నాటి సింహాచలం చేరి అక్కడి స్వామి వారిని దర్శించుకున్నాడు. అక్కడి నుండి కటకం వరకు ప్రయాణం సాగించి విజయదుందుభి మ్రోగించాడు. 1516 విజయ నగరానికి తిరుగు ప్రయాణమయ్యాడు. కొద్దిరోజులకే రాయలకు గజపతులకు సంధి జరిగింది. రాయలు గజపతి కుమార్తెను వివాహమాడి కృష్ణానదికి ఉత్తరమున ఉన్న భాగాన్నంతటిని తిరిగి ఇచ్చివేశాడు.

కృష్ణదేవరాయలు సాధించిన మరియొక విజయము యవనరాజుల వద్ద నుండి రాయచూరు దుర్గమును వశపరుచుకోవటం. ఈ దుర్గమును జయించాలనేది రాయల చిరకాలవాంఛ. ఇది కృష్ణా తుంగభద్రానదుల నడుమ నెలకొని ఉన్న బలిష్టమైన కోట. ఈ కాలమున దానిని బీజాపూర్ సుల్తాన్ పాలిస్తున్నాడు. క్రీ.శ.1520వ సంవత్సరంలో రాయలు గొప్ప సైన్యంతో రాయచూరును ముట్టడించి అదిల్‌షాతో యుద్ధం చేసి అతన్ని ఓడించి కోటను స్వాధీనపరుచుకున్నాడు. యవనులు పరాజితులై పారిపోయారు. ఈ సందర్భంగా రాయలు బీజాపూర్ పట్టణాన్ని ధ్వంసం చేశాడు. అన్ని దశల్లోను రాయలకు అండగా తిమ్మరుసు ఉన్నాడు.

కృష్ణదేవరాయలు విజయనగరాన్ని పాలించిన కాలంలో దక్షిణాపథ మందలి ఏకైక మహమ్మదీయ ప్రభుత్వం బహమనీ రాజ్యం. ఈ రాజ్యం కూడా చీలికలతో సతమతమయింది. క్రీ.శ. 1482 నుండి 1518వరకు సుల్తాన్‌గా ఉన్న మహమ్మద్‌షా అనంతరము బహమనీ రాజ్యం ఐదు చిన్నరాజ్యాలుగా చీలిపోయింది. ఇందులో బీజాపూరును రాజధానిగా చేసుకొని ఆదిల్‌షా, బీదర్ నందు ఇమాద్‌షాహిలు పాలన చేశారు. బహమనీ రాజ్యం అవిభక్తంగా ఉన్నప్పుడే విజయనగర సామ్రాజ్యానికి సరితూగగల స్థితిలో లేదు. ఇక చిన్న సంస్థాన పాలకులు తమలో తాము తరచు కలహించుకొనుట ప్రారంభమయింది. ఏదిఏమైనా శ్రీకృష్ణదేవరాయల పాలన చేసిన

ఇరువది సంవత్సరాల కాలాన్ని అన్నిరకాలుగా ఉన్నత స్థితికి చేర్చాడు. ఆయన కాలం స్వర్ణయుగంగా చెప్పవచ్చును. గొప్ప పాలన గావించి శాశ్వత కీర్తిపొందాడు. ఇట్టి సార్వభౌముని గురించి అనేక అంశాలను, ఆయన జీవితగమనంలో సాధించిన అనితర సాధ్యమైన విజయాలను మనకందిస్తూ "సాలంకార కృష్ణదేవరాయలు"పద్యకావ్యాన్ని గొప్పగా అందించారు పంచసహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఇక జంధ్యాల వారికి కృష్ణదేవరాయలపై గొప్ప గౌరవముంది.

**"తెలుగుదేలయన్న దేశంబు తెలుగేను**
**తెలుగు వల్లభుండ తెలుగొకండ**
**యెల్లనృపులుగొలువనెఱుగదే బాసాడి**
**దేశభాషలందు తెలుగులెస్స"** అంటూ తెలుగు గొప్పదనాన్ని జగద్విదితం చేసిన కృష్ణదేవరాయల పట్ల ప్రతి తెలుగువాడికి మహాగౌరవముంది. ఉంటుంది. ఆయన కవులకు, పండితులకు ఆరాధ్యుడు. అందుకే అవకాశం దొరికినప్పుడల్లా సాహిత్యలోకం ఆయనకు అంజలి ఘటిస్తూ అభిమానాన్ని చాటుకుంటూనే ఉంది. ఆయనపై లెక్కలేనన్ని గ్రంథాలు వెలువడ్డాయి. అయితే ఈ "సాలంకార కృష్ణదేవరాయలు" మాత్రం ప్రత్యేకమైనదని చెప్పక తప్పదు. అలంకార శాస్త్రాన్ని ఔపోసన పట్టిన జంధ్యాలవారు అత్యంత శ్రద్ధతో రాసి వెలువరించిన గ్రంథమిది. "ప్రతిభ, వ్యుత్పత్తి,అభ్యాసము ఈ మూడును పుష్కలంగా ఉన్న కవులే కవులనీ, ఇవి లేని కవిబుత్రులు "కపు"లనీ లాక్షిణిల అభిప్రాయము. సాలంకార కృష్ణదేవరాయలు వంటి చక్కని రస వత్ప్రౌఢ ప్రబంధమును వ్రాయటంలోనే వారి ప్రతిభ ప్రసిద్ధమవుతున్నది. ఇక ఆయనలోని వ్యుత్పత్తి ఇందులో ప్రతి పద్యంలోనూ కనిపిస్తుంది. ఆశు కవితా ధురీణులైన శాస్త్రిగారు ఆంధ్ర సాహిత్యంలోని ప్రసిద్ధ కవుల రచనల లోని చక్కని ఎత్తుగడలని పోకడలను సంపూర్ణంగా గ్రహించారు. అందువలనే

జంధ్యాల వారి "సాలంకార కృష్ణదేవరాయలు" గొప్పగా అలంకారానికి అలంకారంగా భాసిల్లుతుందనే విషయాన్ని డా॥హరి శివకుమార్, (విశ్రాంత ఆచార్యులు, కాకతీయ విశ్వవిద్యాలయం వరంగల్)గారు ఈ గ్రంథానికి తాను రాసిన "సాలంకార కృష్ణదేవరాయలు కైమోడ్పు" పేరుతో రాసిన ముందుమాటలో కొనియాడతారు. ఇది అక్షరసత్యమని. ఈ "సాలంకార కృష్ణదేవరాయలు"లోని ప్రతి పద్యమూ నిరూపిస్తుంది.

**ఉ. "శ్రీయలరారనానుడులం**
**జిన్నతనంబున నుండి నేర్చియాం**
**ధ్రాయత వాఙ్మయంబునకు**
**నాదరమిచ్చుచు రాయకీర్తన**
**ఛాయలదేలు శిష్యనకొసంగుదుఁ**
**బ్రేముడినడ్పుమల్లి నా**
**రాయణరాయధీమణికి**
**రాయచరిత్రము నంకితంబుగన్"**

అంటూ ఈ "సాలంకార కృష్ణదేవరాయలు"గ్రంథాన్ని తనశిష్యుడు అడుసుమిల్లి నారాయణరావుగారికి ప్రేమతో అంకితమిచ్చి శిష్యునిపైగల అపార ప్రేమను చూపించారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**శా॥ బ్రాహ్మీదత్త వరప్రసాదమున విభ్రాజిల్లు జంధ్యాల సు**
**బ్రహ్మణాఖ్యుడు దేశికుండగుటయే భాగ్యమ్ముగానెంచన**
**బ్రాహ్మణ్యంబుతలంప కీసరసకావ్యంబంకితంబిచ్చె నన్**
**బ్రహ్మానందమునందుఁదేల్చె భవసార్థక్యమ్ము నాదెగదా!**

.............

**ఉ॥తిక్కన కంకితంబిడి మలింగనెఁగేతన,వానిమార్గమే**
**త్రొక్కిరి నీసుహృన్మణులు తొల్లిట సౌందరనంద కావ్యమున్**

**మక్కువ దేశికాంకిత మొనర్చినాడు, విచిత్రమేమి లే**

**దక్కడ; నీవొ; శిష్యునకు, నంకితిమిచ్చితి వెంతధన్యుడన్.**

మహానుభావులకు కావ్యాలను అంకితమిచ్చుట విచిత్రమేమికాదు. కానీ మీరు శిష్యునకు అంకితం చేయడం గొప్ప విషయం. ఇలా అంకితం పొందిన నేను ధన్యుడనయ్యానని తన అదృష్టానికి పొంగిపోతూ కృతిని స్వీకరించారు అడుసుమిల్లి నారాయణరావుగారు. గురుశిష్యుల సంబంధాలనేగాక మనుషుల మధ్య గల గొప్ప ప్రేమానురాగాలకు ఇది సాక్ష్యంగా నిలుస్తుంది. అటువంటి మానవతా విలువలు, ప్రేమానురాగాలు తరిగిపోతున్న కాలంలో మనం మనుగడ సాగించటం కొంత బాధ కలిగించే అంశం.

**ఉ॥ రాయలగాను నేను గవిరాజువు నీకొక యగ్రహారమే**

**నీయఁగలేను లక్షలసలే కనిపింపు, పండితాగ్రణిన్**

**జేయఁగళాలయమ్ముయినఁజెంగంటలే దెటుతీర్తు మీ ఋణ**

**మ్మీయిడు సత్కృతిన్ దనియమీ, కొనుమీ, కనకాభిషేకతన్**

అంటారు అడుసుమిల్లి నారాయణరావు జంధ్యాల వారి పాండిత్యం విమర్శకులనెందరినో ఆకట్టుకుంది. ఎందరో పండితులు, ఆస్థానాధీశులు, జమిందారులు, కవులు ప్రశంసలతో ముంచివేశారు. ఒక సాహితీవేత్తకు ఇంత కన్నా కావాల్సిందేముంటుంది.

**సీ॥ శ్రీమానినీ జన్మధామమై దైవాఋ**

**తమ్మికొమ్మకు సిగ్గు దార్చు బావ**

**మృదుసుమాస్త్రములతో నెడబాపు విడిపించు**

**మీనకేతనునకు మేనమేమ**

**గగనేందిరాంబకు గైసేతలందించు**

**చుక్కకన్నెలనేలుసొబగురేడు**

బలవన్నిశాటదర్పము బాపువెన్నుని
యంగనామణికి ననుంగునన్న
గీ॥ వరువమోడని జేజేల పాలబువ్వ
కందువారని జలరాశి కడుపుపంట
ధర్మరాణ్ముఖ్య భూవరోత్తముల తాత
చను జనానందరససీమ;చందమామ

అంటూ కృష్ణదేవరాయల వంశాతరణ తెలుపుతూ ఈ పద్యంతో సాలంకార కృష్ణదేవరాయల గ్రంథాన్ని ప్రారంభించారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

సీ॥ విమల గీతికల విన్పించు నిజాంగనా
వళిఁదన్పుదల నూపి పాఁపరాజు
కెలఁకున నున్న లక్ష్మీదేవి నురముగ
న్గానజేసి తనియించు గూర్మరాజు
ఆటాడగని పెద్ద యదనింట దుఱపిల్లు
కరిణులందన్పు దిగ్గజచయంబు
బరువు మోయుచు నిజ ప్రాభవంబోడిన
కులగిరుల్ క్రొంగ్రొత్త చెలువమూను
గీ॥ విమలతరవారిధారావిభిన్నదేహ
వైరి వీరాంగ రక్తప్రవాహ మజ్జ
నారుణ తను ప్రభామండనార్క నిభుడు
తిమ్మభూపతి ధాత్రీధరమ్ము దాల్ప
గీ॥ తిమ్మదేవరాయ పశుధీశ్వరునకు
న ధిపు డీశ్వరదేవరాయలు జనించె
పితృ సమర్థ పరాక్రమాన్వితుడితండు

**అజకి శోరంబుపుట్టునే వ్యాఘ్రమునకు?**

**క॥ అతఁడఖిలరాజ్య ధర్మా**
**న్వితుఁడై శ్రీబుక్కమాంబఁబెండిలి యాడెన్**
**నుతగుణశీల సమంచిత**
**రతిసుందరి సర్వసుజన రాజీవినుతన్**

ఇలా కృష్ణదేవరాయల పుట్టుకకు ముందు వారి వంశము యొక్క చరిత్రను వారికి ముందు తరం గురించి వివరిస్తారు జంధ్యాలవారు.

**సీ॥ ఆమని సోకునంతనె క్రొమ్మావి**
**కొమ్మకు నొదువు ఫలమ్ము వోలె**
**సుప్రభాతమ్మంటిస్రూకిఁ బ్రాచీదేవి**
**ప్రసవించు భాను బింబము వోలె**
**కలశాంబునిధి వీచికామంగళాంగన**
**ప్రసవించు చంద్రబింబము వోలె**
**శుద్ధాంబుకణకమొంది శుక్తికాంతలలా**
**మం బీను ముక్తాఫలంబు వోలె**
**గీ॥దండనాథ నృసింహ భూథవుని సాధ్వి**
**నాగమాంబిక పూర్వపుణ్య ప్రభూత**
**ఫలమనన్ గృష్ణదేవరాయలు జనించె**
**ఆంధ్రకర్ణాట భూజనాహ్లాదమొసగె**

కృష్ణదేవరాయలు జన్మించిన సందర్భంలో మామిడి పండులాగా, సూర్య బింబంలాగా, చంద్రబింబంలాగా ఇలా ఆయన్ను అనేక రకాలుగా వర్ణిస్తారు జంధ్యాలవారు. దండనాథ నృసింహరాయల, నాగమాంబల పుణ్యఫలంగా కృష్ణరాయలు జన్మించాడని తెలుపుతారు. అతని పుట్టుక ఆంధ్ర కర్ణాటక ప్రాంతాల జనులకు ఆహ్లాదం కలిగించిందంటారు.

**గీ॥కృష్ణరాయలు భువి జనించి నట్టి**
**సమయమది భద్రకరమయి చనుటఁజేసి**
**కవులు జ్యోతిష్కులానంద కలితులైరి**
**సరసకవి యొక్కఁడిటుసెప్పెఁ జాటుధార**

కృష్ణదేవరాయలు జన్మించిన సమయం చాలా మంచిదని కవులు, జ్యోతిష్కులు ఆనందం పొందారంటారు జంధ్యాలవారు.

**మ॥ మతి కౌశల్యము కృష్ణరాయల కసామాన్యంబుగా నౌటఁద**
**త్పిత,శ్రీమన్నరసింహ భూమివిభు డాతిమ్మర్సు మంత్రగ్రణిన్**
**హితమున్ విద్యయు నేర్ప నేర్పఱంచె శ్రీకృష్ణుండు మంత్రీంద్ర బో**
**ధిత విద్యాచయమెల్ల నేర్చుకొనె నిర్దిష్టాల్ప కాలంబున్**

**క॥ తిమ్మరుసెగాక యాతని**
**తమ్ముడు గోవిందరాయ తజ్ఞుండునురాట్**
**సమ్మతమవశ్యమగుశా**
**స్త్రమ్మున్ జదించె గృకృష్ణరాయల చేతను**

శ్రీకృష్ణదేవరాయలు తగిన సమయంలో అన్ని విద్యలను తిమ్మరుసు పర్యవేక్షణలో పూర్తిగావించాడు. తిమ్మరుసు గాక అతని తమ్ముడు కూడా అవసరమైన శాస్త్రాలను చదివించాడు.

**మ॥"తెలవార్జామున నిద్రలేచి హయమున్ దెప్పించి పైనెక్కి యు**
**జ్జ్వల తేజమున దవ్వుగాఁబఱచుట భ్యాసంబు గావించె ని**
**శ్చలతన్ ఖడ్గము ద్రిప్పనేర్చుకొని యిచ్చున్ దండమున్బూని శ**
**త్రులు డాయన్ దెరువీని భాతి దెసలందున్ ద్రిప్పె వేగోద్ధతిన్"**

తెల్లవారుజామునే లేచి ఖడ్గయుద్ధానికి సంబంధించిన విద్యలను నేర్చుకోవటం చేసేవాడు కృష్ణదేవరాయలు. కత్తియుద్ధంలో ఆరితేరేలా ఆయన తయారయ్యాడు. ఊహించని వేగంతో కత్తిని త్రిప్పేవాడు. అలా నేర్చుకున్న

విద్య తదుపరి కాలంలో అనేక యుద్ధాలలో విజయం సాధించటానికి తోడ్ప డింది. ఒక వీరుడు అభ్యసించవలసిన విద్యలన్నింటిని క్షుణ్ణంగా తిమ్మరుసు నేత్రుత్వంలో నేర్చుకున్నాడు.

**గీ॥"ప్రాజ్ఞు తిమ్మర్సు గోవిందరాయవిబుధ**
**యుగ్మమున జేసి కృష్ణరాయోర్విజాని**
**సాహితీ ముఖ్య కళలకు సదృశ్యములగు**
**రాజకీయ కళల్నేర్చి ప్రథిమగాంచె"**

సాహిత్యం వంటి కళలతో పాటు రాజకీయ చతురతకు సంబంధించిన విషయాలు, రాజనీతి వంటి అంశాలు కూడా తిమ్మరుసు గోవిందరాయల వద్ద అభ్యసించాడు శ్రీకృష్ణదేవరాయలు.

**చ॥"అమిత గభీరభావమున నాసచివాగ్రణి మారువల్కక**
**క్రమమమని తిప్పమాంబికయె కారణమింతకనన్ గ్రహించి శీ**
**ర్షముదగనూపి,చిత్తమని సత్వరమేగి కుమార కృష్ణ సం**
**భ్రమమునఁబిల్వనంపి,ప్రభువర్యుని యానతిఁదెల్పి"**

కృష్ణదేవరాయలపై హత్యాయత్నం జరగటం తిమ్మరుసు తెలివిగా రక్షించటం వంటి సన్నివేశాలకు సంబంధించిన పద్యాలను గొప్పగారాసి ఆకట్టుకున్నారు జంధ్యాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు. అటువంటి సన్నివేశాలలోని ఒక దృశ్యాన్ని మనం పై పద్యంలో చూడవచ్చు. ఒక క్రమపద్ధతిలో ఈ కావ్యాన్ని అద్భు తంగా నడపారాయన. ఇది వారి సమర్థ నిర్వహణకు చక్కని ఉదాహరణగా పేర్కొనవచ్చును.

**సీ॥ కత్తిసాముల తావు కర్రత్రిప్పులతావు**
**కృష్ణరాయల జాడ కెదురుచూచె**
**అహరహంబును విహారార్థమేతెంచెడి**
**హయము ఘాసముమేయ కట్టెపిలిచె**

**మనరాచకొమరుని కనుచూపు చనెనని**
**నిఖిలప్రియాళి కన్నీరు విడిదె**
**గుణశాలి కిక్కట్టు గూర్పవచ్చునె యంచు**
**నగరీప్రజావళి నలువఁదెగడె**
**గీ॥సకలజనములునిటుపలుచందములుగ**
**గృష్ణరాయల శిక్షా నికృష్టగతికి**
**వగచిరే కాని కనరైరి వాస్తవంబు**
**సచివకృత కార్యమతి రహస్యముగ నుండె**

తిమ్మరుసు రాజకీయ మంత్రాంగంతో కృష్ణదేవరాయలు యుద్ధవిద్యలలో ఆరితేరడమేగాక రాజకీయనీతి శాస్త్ర కోవిదుడిగా తయారయ్యాడు. ఇక తిమ్మరుసు కృష్ణదేవరాయలను అడుగడుగునా కాపాడుతూ రావటం చూస్తాము. కృష్ణదేవరాయల పుట్టుక, బాల్యం, విద్య మొదలైన విషయాలతో పాటు ఆయన హత్యకు కుట్ర జరగటం, తిమ్మరుసు వలన రక్షించబడటం వంటి సన్నివేశాలను మనం ప్రథమాశ్వాసములో చూస్తాము. దీన్ని పై పద్యాలతో ముగించారు జంధ్యాలవారు.

శ్రీమదుభయభాషాకవితాప్రవీణ, సహస్రావధాని చతురానన, సహస్రావధానని, పంచసహస్రావధానీత్యాద్యనేకబిరుదాంకిత, జంధ్యాల వంశ పయఃపారావార రాకాసుధాకర సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రణీతంబైన సాలంకార కృష్ణదేవరాయ ప్రబంధంబున ప్రథమాశ్వాసము సంపూర్ణము.

ఇలా రాసి ముగించటం వంటి ప్రబంధ కావ్య లక్షణాల్ని కచ్చితంగా పాటించేవారు నాటి కవులు. అదే చేశారు జంధ్యాలవారు.

**గీ॥ దిగ్విజయయాత్రకై కృష్ణదేవరాయు**
**ననుపుమీతడు వైరుల నడఁచివచ్చు**
**దీర్ఘయాత్రార్థి పేరున దిశలఁదిరుగ**

**ననుపుమీ వీరనరసింహజనవరేణ్య**

**.............**

**గీ॥నరసభూపతి మదికినానందమయ్యె**
**తిమ్మరుసు తనస్వామిభక్తి ప్రభావ**
**మిట్టిదని తెల్పి తారాజుఁదృప్తిపఱచె**
**నాగాంబిక యనుపమానందమందె**

శ్రీకృష్ణదేవరాయలు సింహాసనమధిష్టించునాటికి శత్రువులు ఎక్కువై రాజ్య పరిస్థితి మంచిగా లేదు. ఆయన శత్రురాజులపై దండయాత్రలు చేస్తూ సుదీర్ఘ ప్రయాణం సాగించి రాజ్యానికి శత్రుభయం లేకుండా చేశారు. ప్రతి సందర్భంలోనూ ఆయన్ను విజయలక్ష్మి వరించింది.

**సీ॥తుంగాతరంగిణీ రంగత్తరంగ భం**
**గ ప్రభాంగ మృదంగ కలనఁదేలి**
**జయజయధ్వానానుసారి సభాజన**
**కరతాళమయ తాళసరణి నెగడి**
**పవనాంకురోచ్చల ధ్బహుళపతాకి కా**
**చలనైకనాట్యప్రసక్తి నలరి**
**ఆనంద నిస్సరదార్య రాణ్మందహా**
**సముచిత ధవళాంశుకమును మీఱ**

**గీ॥ ప్రముదిత విజయనగర సామ్రాజ్యలక్ష్మి**
**ప్రథిత తుళువాన్వవాయ వీరప్రకాండ**
**బంధురాశ్లేష సౌఖ్యవైభవము గాంచి**
**యుత్సవాంచిత నాట్యాల నూగులాడె**

కృష్ణదేవరాయలు సభలో కొలువుతీరిన సందర్భంలో ఒక కోలాహల వాతావరణం నెలకొని వుండటం, జనం ఆనందాన్ని వ్యక్తం చేయటం వంటివి

జరుగుతుండేవి. ఆయన విజయయాత్ర చేయటానికి ముందు జరిగిన కొన్ని సన్నివేశాలను జంధ్యాలవారు దృశ్యమానం చేస్తారీ కావ్యంలో.

**క॥తిమ్మరుసు నవ్యసచివౌ**
**ఘమ్మును సైనాధి, నాయక ప్రకరమ్మున్**
**నెమ్మిది నాలోచన నిల**
**యమ్మున సభచేసి, చేసిరాలోచనముల్**

తిమ్మరుసు మంత్రిగా అయ్యింతర్వాత ఆలోచనామందిరంలో సైన్యాధినాయకులతో పరిస్థితులన్నింటిపైనా సమాలోచనలు జరిపాడు.

**గీ॥దిగ్జయమ్మునకున్ గృష్ణదేవ విభుండు**
**తీర్థయాత్రకు వీరపృథ్వీ వరుండు**
**నరుగ నొడిలిన తిమ్మర్సు నాశయములె**
**సమ్మతింగాంచెంద త్సభాసదుల మ్రోల**

కృష్ణదేవరాయలు దిగ్విజయయాత్రకు బయలుదేరే ముందు తిమ్మరుసుతో సహా అందరి సమ్మతిని తీసుకుంటాడు.

అందరి ఆశీస్సులతో శ్రీకృష్ణదేవరాయలు సర్వసైన్యసన్నద్ధుడై విజయయాత్రకు బయలుదేరతాడు. ఇటువంటి ఘట్టాలన్నీ మన కళ్లకు కట్టినట్టు చూపిస్తారీ కావ్యంలో జంధ్యాలవారు.

**గీ॥కృష్ణరాయలతో రణకేళి కరుగ**
**సైన్యమున బెద్దభాగ్యమ్ము సమ్మతించె**
**తక్కువగల దండు తీర్థయాత్ర ప్రసక్తు**
**వీరనరసింహ విభుగొల్వ వేడ్కపడిరి**

శ్రీకృష్ణదేవరాయలతో కలిసి యుద్ధానికి వెళ్లటానికి సైన్యం ఉత్సాహం చూపించారు. ఇది తమ భాగ్యంగా సైన్యం భావించారు. శ్రీకృష్ణదేవరాయల యెడల సైనికోద్యులేకాదు కొలువులోని ప్రతి ఉద్యోగికి అత్యంత గౌరవాభి

మానములున్నాయి. అలాగే ప్రజలు ఆయన ఎడల భక్తి గౌరవాలు చూపించే వారు.

**సీ॥అతిశాతశస్త్ర హస్తరూఢ హయరాజి**
**ఆవలీవల హేల నడుగులిడగ**
**వైరిదుర్గాద్వాః కవాటపాటనదక్ష**
**గంధసింధురము లగ్రమున నడువ**
**సాహాయ్యకార సామంత కలితమ్ము**
**లరదముల్ తనమ్రోల నవఘళింప**
**నాయకపాద విన్యాసాన పథగామి**
**సైనికుల్ సోత్సాహసరణి నడువ**
**గీ॥సమర సమయాభిమండన స్ఫారదేహి**
**భద్రసామజరాజంబుపైవహించి**
**శూరసేనా పరివృతోమ్మతూరు కోట**
**డాయజనువాడు శ్రీకృష్ణరాయవిభుడు**

శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రలో అనేక కోటలను స్వాధీనపరుచుకొని అక్కడి రాజులను ఓడించి తన శౌర్య పరాక్రమాలను చూపించాడు. ఉమ్మత్తూరు కోటపై జరిపిన దాడికి సంబంధించినవి పై పద్యాలు. పాండితీ ప్రకర్షకు నిదర్శనంగా పై పద్యాలు మనకు కనిపిస్తాయి. వాడిన పదజాలమంతా విశేషంగా ఆకట్టుకునే విధంగా ఉన్నదనేది ఎవరూ కాదనలేని సత్యం.

**మ. తెలుగుదేశము సర్వరీతులఁబ్రశస్తిన్‌గాంచె విద్వద్వతం**
**సులకెందేని కొఱంతలేదు సుకవి స్తోమంబనల్పంబు నీ**
**వలె నెందైన సహస్రపత్ర కవితా వ్యాపార పారంగతుల్**
**కలరే యంచని యాంధ్రమాత మదిలో గర్వించు విద్వన్మణీ!**

అంటూ శతావధానులు శేషాద్రిరమణ కవులు కొనియాడతారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని. నిజంగా ఆయన ప్రతిభ వేనోళ్ల కొనియాడదగినదే.

**సీ॥ ఉత్తుంగ భూమీధరోపమానంబురు**

**వేదండకాండమెప్పిదము గూర్ప**

**ఘోరప్రరావసంకుల తరంగాభముల్**

**భయద హేషాభ్రమద్ధయములలర**

**చంద్ర సూర్య ప్రభాసంభాస మానంబు**

**గర్భస్థ రత్నసంఘంబు మెఱయ**

**నవశస్త్ర కరఝర నౌకావిలాసముల్**

**సమర సతాంగముల్ చౌకలింప.**

**గీ॥జీవనాధార వైభవ భావుకంబు**

**అఖిల భువనోప జీవుల కాలయంబు**

**నవుచు లక్ష్మీనివాసమౌ శివసముద్ర**

**మరసి చూడ సముద్ర శోభాలయంబు**

ఉమ్మత్తూరు విజయం తర్వాత శ్రీకృష్ణదేవరాయలు తన సైన్యంతో శివసముద్ర విజయయాత్ర సాగించాడు.

**సీ॥తనవశమొనరించుకొనె నెవాడ గణిత**

**ప్రాభవోపేతారి పత్తనముల**

**పాదుకొల్పె నెవాడు భవనీయ కర్ణాట**

**రంగ మధ్యమ్మున రాజ్యలక్ష్మి**

**నియమించె నెవ్వాడు నిజరాజధానిగా**
**ప్రచిత వైభవము శ్రీరంగపురము**
**స్థాపించే నెవ్వాడు సత్యసంగతి జేసి**
**యఖిల కర్ణాట జయధ్వజమ్ము**
**గీ॥కైవసముసేసికొనియె నేక్షాత్రకులుడు**
**కప్పమొక కోటిరూప్యముల్ గట్టువిభుల**
**నాతడలఘు ప్రతాప సాహసధురీణు**
**డనగయశమొందెఁ గృష్ణరాయాంధ్ర విభుఁడు**

శివసముద్రంపై విజయం సాధించాడు శ్రీకృష్ణరాయలు. దీంతో కర్ణాటక ప్రాంతం శ్రీకృష్ణరాయల వశమైంది. ఈ విజయానికి గుర్తుగా శ్రీరంగపురం లో ఒక విజయస్తంభాన్ని నాటించాడు. ఇక్కడితో ఈసాలంకార శ్రీకృష్ణదేవరా యలు కావ్యంలోని ద్వితీయాశ్వాసమును పూర్తిగావించారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఈ కావ్యంలోని ప్రతి పద్యంలోనూ శ్రీకృష్ణదేవ రాయల యెడల తనకు గల భక్తి గౌరవాలను అంతర్లీనంగా జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చూపించారని చెప్పవచ్చు.

"సారస్వతపోషకాగ్రణియైనరాయలు,కవిపండితలోకారాధ్యుడు. ఆయన పరిపాలించిన కాలం సాహిత్య చరిత్రలో స్వర్ణయుగమై భాసిల్లింది. ఆయన తెలుగు భాషామతల్లికి అందలమెక్కించిన తీరు లోకవిదితం. శ్రీకృష్ణదేవరాయలపై గల గౌరవాభిమానాలతో మా పితృపాదులు పంచ సహస్రావధాని కీ॥శే॥జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు "సాలంకార కృష్ణదేవ రాయలు"అనే ప్రబంధ రచన 1962లో చేశారు. ఆరు ఆశ్వాసాలలో 878 పద్యాలతో రాయల చరిత్ర కావ్యబద్ధం చేశారు" అంటూ జంధ్యాల వారికి కృష్ణదేవరాయల యెడల గల గౌరవాభిమానాలను తెలుపుతారు వారి కుమార్తె శ్రీమతి జంధ్యాల కుసుమకుమారి. ఆమెకు తన తండ్రిగారిపై, వారి

సాహిత్యంపై ఎనలేని గౌరవం, ప్రేమ, భక్తి, అభిమానముంది. అందుకే అవకాశమున్నప్పుడల్లా ఆమె తన తండ్రిగారి సాహిత్యకృషి గురించి తెలుపు తారు. ఇందులో ఏమాత్రం అతిశయోక్తి కనిపించదు. నిజంగా జంధ్యాల వారు సాహిత్య ప్రపంచానికి ఎనలేని సేవచేశారు. వారికి అదృష్టం కొద్ది గొప్ప అవధానిగా కీర్తి గడించిన చెళ్ళపిళ్ళవారి సాంగత్యం లభించింది. ఆయన ద్వారా అవధానంలోనే గాక అనేక సాహిత్య సంబంధ రహస్యాలను తెలుసుకోగలిగారు.

**చ॥ "పరనృపయత్నముల్ తిరుగుబాటులు బీదరునుండియా బిజా**
**పురివఱకున్ గనంబడియె భూరి బిజాపురసీమవాసులే**
**నరుల కశాంతియౌట శరణంబిడఁ దౌళువ దేవరాయ భూ**
**వరులగోర వారు శ్రితపాలన సేయఁగ నొప్పిరాదృతిన్"**

బీదరు నుండి బీజాపూర్ వరకు తిరుగుబాటులు చోటుచేసుకున్నాయి. ప్రజలు ముస్లింపాలకులతో విసిగిపోయారు. పాలకుల అరాచకాలు రోజు రోజుకు పెరుగుతూ వచ్చాయి. ప్రజలు పడుతున్న బాధలన్నీ కృష్ణరాయలకు తెలుసు. రాయలు తన సైన్యాన్ని బీదరు నుండి బీజాపూర్ వరకు నడిపి అక్కడి కోటపై విజయపతాకలెగరేశాడు. ఇట్టి విషయాన్ని మనమీ గ్రంథంలో చూడవచ్చు.

**సీ॥ స్థాపించే నేశక్తి శత్రుగూలిచిజయ**
**ధ్వజము నాశ్రీరంగపత్తనమున**
**మ్రోయించె నేశక్తి పొరి పొరి జయభేరి**
**చెలువంపు మళయాళ సీమలోన**
**వినిపించె నేశక్తి భీకరార్యంత ఢక్కా**
**మహాధ్వని కూర్గు సీమలోన**
**వినిపించె నేశక్తి విజయప్ప నంపించి**
**శితవిపక్షజనాళిఁ జేరసీమ**

**గీ॥ ఏభయదశక్తి యాంతక యెడము సేసి**
**చోళ సామ్రాజ్యలక్ష్మిని జూరగొనియె**
**అట్టి శ్రీకృష్ణదేవరాయలు చండాసిశక్తి**
**వేలురింగప్పములనిగ్గి విలువఁబెంచె**

రాయలు ఏ శక్తితో శ్రీరంగపట్నం కోటపై విజయం సాధించాడో అలాగే అన్ని విజయాలను అదేశక్తితో సాధించాడు. ఇదో గొప్పవిషయంగా చెప్ప వచ్చు. చరిత్రకారులు భారతదేశంలోని గొప్ప రాజులలో శ్రీకృష్ణదేవరాయలు ఒకరని, వారి పాలనలో ప్రజలు సుఖసంతోషాలతో విలసిల్లారని తెలుపు తారు. ఇట్టి విషయాలను కూడా మనం ఈ కావ్యం ద్వారా తెలుసుకోగలం.

**మ॥ "ఘనవైశాల్య తంజావూర్మొదలుగా ఁగన్యాకుమార్యగ్రగా**
**వని పర్యంత మహామహీతలమాన్ బాలింప వెంకప్పగా**
**యనినేనియమించె సమస్త దక్షిణదిశావ్యాప్తావనీ మండలం**
**బనుశాసించెడు భాగ్యమిచ్చె నిజశౌర్య శ్రీమహాలక్ష్మికిన్"**

దక్షిణ భారతదేశమంతా శ్రీకృష్ణదేవరాయల పాలన కిందకు చేరి. ఆయన శౌర్య పటిమకు ఎదురు నిలువగలవారు లేకుండా చేసుకోగలిగారు. ఈ మూడవ అశ్వాసమును విజయయాత్రలతో ముగించారు జంధ్యాల సుబ్ర హ్మణ్యశాస్త్రిగారు. కొండపల్లి వంటి దుర్గాలను జయించిన కృష్ణరాయలు అమరావతి, విజయవాడ, కృష్ణాజిల్లా శ్రీకాకుళం వంటి ప్రాంతాలను సందర్శించి అక్కడి దేవాలయాలందు పూజాదికాలు జరిపించి భారీగా కానుకలు సమర్పించాడు.

**మ॥అదియోఢ్రావని,భాసిలున్ గజపతీంద్రాధీనమైన దాని సం**
**పద విద్యానగరోరుసంపదకు సామ్యంబూను; రాజ్యాంధ తా**
**మదమత్త ప్రభుదోర్బలంబు నిజ సామ్రాజ్యాంచి తౌన్నత్యమె**
**ట్లదుమన్ జాలెడినంచు రాయలు సమర్థాలోచనల్ సేసెడిన్**

గజపతుల ఆధీనంలో ఉన్న కోటలను తన శౌర్యపరాక్రమాలతో జయించి ముందుకు సాగుతూ, కటకం వైపు ప్రయాణం సాగించటానికి సిద్ధమవుతాడు కృష్ణదేవరాయలు.

**మ॥ "కటకంబాభు విరాజధాని తదనీకంబర్ణవ ప్రాయము**
**త్కట వంగాంగకళింగ రాష్ట్రబలయూధంబెల్ల జృంభించియొ**
**క్కటియై తద్బలవారణాశి నిలువంగన్ గోణభాగంబున్**
**దిటవేపారఁగ నింపజాలదు సముత్కీర్ణాహవప్రోద్ధతిన్"**

**గీ॥ దివ్యతర కృష్ణవేణికా తీరమందు**
**తుళువరాయ ప్రతాపరుద్రులకు నైన**
**సంగరంబున రాయలు జయముగాంచె**
**కొండవీడు చమూధాటి గుండెలదిరె**

గజపతుల ఆధీనంలో ఉన్న కొండవీడును జయించి వశపరుచుకున్నాడు శ్రీకృష్ణదేవరాయలు.

**సీ॥ వాసవాశావధి భాస్వరాభ్రంకష**
**ప్రోత్తుంగ భూమిభృద్భూషితంబు**
**దక్షిణ దిక్తటీస్థగిత సేతువిరాజ**
**మానశైవాలినీ మానితంబు**
**ప్రాగుదగ్దిక్పరివ్యాప్త రత్నవితర్థి**
**కాంచిత భర్మహర్మ్యాంగణమ్ము**
**ఉభయ పార్శ్వస్థ భుజాత్కరచ్ఛయాభి**
**శోభిత శీతాధ్వ సుఖపదమ్ము.**

**గీ॥ దూరగమన సమాగమోద్యోగ జనిత**
**ఘర్మ జలకణ హారసుమ కాయమాన**
**బంధు రారామము విజయవాడ పురము**

**నరసె భూజాని యాంధ్రదేశాభిమాని**

విజయవాడ నగరం సందర్శించి కొన్నాళ్ళు అక్కడ ఉన్నాడు కృష్ణ దేవరాయలు.

**సీ॥ పావనకృష్ణా స్రవంతికోపాంతస్థ**
**పర్వతపుర దుర్గపదము నంటి**
**ధరణకోటాభిఖ్య పురశూరులన్ దాకి**
**భయజన్య శైత్యంబు పాఱదోలి**
**అమరావతీ పురాధ్యావాసిజనుల సం**
**తాపంబురేపి యుద్ధతి వహించి**
**తిరుపతి వెంకటేశ్వర పదాబ్జములకు**
**భక్తితత్పరత నివాళినెత్తి**
**గీ॥గిరిపురీ దుర్గ తల్లజోత్తర విభాసి**
**గజపతీశ్వర నామాక్రాంతములగు**
**ప్రోగ్రదుర్గోపవనముల బూదిచేసి**
**అలముకొనెడంబు రాయ శౌర్యానలంబు**

కొండపల్లి కోటను జయించిన రాయలు తిరుపతి వేంకటేశ్వరుని దర్శించుకొని స్వామికి కానుకలు సమర్పించి శాసనమును అక్కడ ఏర్పాటు గావించాడు. రాయలు విజయవాడను సందర్శించిన సందర్భాన్ని జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వర్ణించిన తీరు అద్భుతంగా ఉంటుంది. పై పద్యంలో దాన్ని చూపించటం జరిగింది. తదుపరి ఖమ్మం కోటను జయించాడు. షితాబ్ ఖాన్(సీతాపతి)ని ఓడించాడు. గజపతులనోడించి తదుపరి వారి రాజ కుమార్తెను వివాహమాడి బంధుత్వమేర్పరుచుకున్నాడు. గెలిచిన వారి రాజ్య భూభాగాన్ని వారికే తిరిగి ఇచ్చివేశాడు శ్రీకృష్ణదేవరాయలు.

**మ॥ చెలి చక్కదనమెల్లఁబ్రేమరసమున్ జిందింపఁగాఁజేసె నీ**
**లలి ధర్మానుమతంబుగాదు హృదయోల్లాసం బవశ్యంబుగాఁ**
**దలఁపన్ రాదని రాయలెంచె తద్భావానుకూలంబుగా**
**వలపున్ నిల్పెను ధర్మ నిర్ణయ రీతుల్ వర్తిల్లె స్వాంతంబులన్**

ఇలా అన్ని విజయాలనంతరం రాయలు విజయనగరానికి పయనమవుతాడు. నవరసాలను మేళవించి, అలంకార భూయిష్టంగా తనకిష్టంగా ఈ సాలంకార కృష్ణరాయల కావ్యాన్ని తీర్చిదిద్దారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. చతుర్థ అశ్వాసమును చివర నిల్పి పై పద్యంతో ముగించారాయన.

**సీ॥సహజ సౌందర్య భూషా సంస్కృతులగొన్న**
**ధీరు లీ నృపుడు రాధేయుడనిరి**
**వర్షాశనముగా బహుమతుల్ వడసిన**
**వారెల్ల శిబిచక్రవర్తి యనిరి**
**అభ్యర్థులై యగ్రహారమ్ములన్ గొన్న**
**ప్రాజ్ఞులు బలిచక్రవర్తి యనిరి**
**ఉద్యోగము లఁ దదభ్యున్నతత్వముగొన్న**
**పురుషులెల్లరు ధర్మమూర్తి యనిరి.**
**గీ॥ అదియిది యటంచుగోరక యన్నిగొన్న**
**బుధజనము లీతడే కల్ప భూజ మనిరి**
**సముచిత బహూకృతులు సేయు సమయమందు**
**విపుల ధర్మాభిమాని?యా పృథ్వీజాని**

ఇలా అన్ని వర్గాలవారు పురాణపురుషులతో పోల్చి శ్రీకృష్ణదేవరాయలను వేనోళ్ళ కొనియాడతారు. అడిగిన వారిని, అడగనివారిని ఆదరించి తన ఔదార్యాన్ని చాటుకున్న చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు. ఆయన్ను మహా

ఉన్నతుడిగా చూపించటంలో జంధ్యాలవారు తన పాండిత్య ప్రకర్షను చక్కగా ఉపయోగించుకున్నారు. జంధ్యాలవారు అతిశయోక్తిగా పలికినది ఎక్కడా కనిపించదు. శ్రీకృష్ణదేవరాయల పరిపాలన గడిచిపోయి 500 సంవత్సరాలు దాటిపోయినా కవులు, పండితులు, భాషాభిమానులు కొనియాడుతున్నా రంటే ఆయన గొప్పతనమే తప్ప మరొకటి కాదని ఘంటాపథంగా చెప్ప వచ్చు.

**మ|| మన కృష్ణక్షితిపాల శీలమది సామాన్యంబె?కావ్యాంగనా**
**భ్యనురాగంబున మార్దవ ప్రచితమై భాసిల్లు దీనార్థులం**
**దను కంపాయమై తనర్చు రిపుతర్కాప సంరంభమం**
**దునగార్కశ్య మయంబటంచు జగమందున్‌బొందెc బెన్గీరితిన్**

శ్రీకృష్ణదేవరాయల గొప్పతనాన్ని జంధ్యాలవారు మన ముందుంచుతారు ఐదవ ఆశ్వాసంలో. పైన పద్యాలు ఐదవ ఆశ్వాసంలోనివే.

**సీ||తత్తత్పురాంతర స్థానంబులందున**
**పటుకళాశాల లేర్పఱుపcబడియె**
**స్థాపిత సత్కకళాశాలాంతరంబుల**
**వలన షడ్దర్శనీ ప్రజ్ఞపర్వె**
**షడ్దర్శినీ పరిజ్ఞాన సంవ్యాప్తిచే**
**సాహితీ ప్రతిభాప్రసక్తిమించె**
**సాహితీ ప్రతిభా ప్రసరాభివృద్ధిచే**
**కావ్యవిలేఖన గరిమదనరె.**

**గీ|| పటు కవీశ్వర లిఖిత కావ్యముల వలన**
**శౌర్య సాహసలీలా ప్రచారమయ్యె**
**శౌర్య సాధిత సత్కార్య సరణివలన**
**ఆంధ్రవైభవ మద్వితీయముగcబెఱిగె**

శ్రీకృష్ణదేవరాయలు తన పాలనలో చేసిన గొప్ప కార్యాలను ఈ పద్యంలో చక్కగా వర్ణించారు జంధ్యాలవారు. ఇటువంటి పద్యాలతో నిండిన ఈకావ్యం చరిత్రకు దర్పణంగా నిలుస్తుంది.

**మ॥"బహుసంఖ్యాక కవిప్రకాండులును సత్ ప్రజ్ఞానిధుల్ శేముషీ**
**మహితానల్ప సుధారసోపమనచో మాధుర్యవత్కావ్యముల్**
**మహిపాలాగ్రణి పేరిటన్ బొసఁగి తత్ క్ష్మానాథ దత్తంబులౌ**
**బహుమానంబులు మాన్యముల్‌గొనిరి శశ్వత్కీర్తిసంధాతలై"**

శ్రీకృష్ణదేవరాయల కాలంలో విజయనగర సామ్రాజ్యంలో మహాప్రజ్ఞ గలిగిన కవి పండితులు అనేకమంది గొప్ప కావ్య సృష్టిగావించారు. స్వయంగా కవిగావడంతో ఆయన కవి పండితులనేకమందిని బహుమానాలతో, మాన్యాలతో వారిని సత్కరించారు. కవులు తమ కావ్యాలను శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చి ఆయనపట్ల గౌరవాభిమానాలను చాటుకున్నారు.

విజయనగర రాజులలో, వారి మంత్రులలో, ఉద్యోగులలో అనేకులు స్వయంగా కావ్యనాటకాలంకారాలను, శాస్త్రాలను అధ్యయనం చేసిన, రాసినవారు. అలాగే విద్వత్ప్రభువులు, కావ్యరసాస్వాదన చేయగలిగిన సహృదయులు. శాస్త్ర చర్చలో, పాల్గొనగలిగిన పండితులు అయినందు వలన వారు సహజంగా కవి, పండి తులనాదరించి వారిని ఉత్తమోత్తమైన కావ్య, శాస్త్ర గ్రంథాలు రాయడానికి ప్రోత్సహించారు.

సాళువ నరసింహరాయలు స్వయంగా సంస్కృతంలో విద్వాంసుడు. సాళువాభ్యుదయమనే చారిత్రక కావ్యాన్ని రాసిన రాజనాథడిండిముడు అతని ఆస్థానకవిగా ఉన్నాడు. రాజనాథుని పుత్రుడు డిండిమ సార్వభౌముడు రామాభ్యుదయం పేరుతో రాశాడు. సాళువ నరసింహుడే ఈ కావ్యాన్ని రాసినట్లు కొందరు పేర్కొన్నారు. అదేకాలంలో అరుణగిరినాధుడు అనే కవి సోమవల్లీయోగానంద ప్రహసనము, సౌందర్యలహరిమీద వాఖ్యానం

వంటివి రాశాడు. విజయనగర ప్రభువులందరు కళలను, సాహిత్యాన్ని ప్రోత్సహించినవారే.

శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా కవి అని అందరికి తెలిసిన విషయమే. సాహితీ సమరాంగణ సార్వభౌముడిగా ఆయన కీర్తిగడించాడు. నందితిమ్మన రాయలను కవితా ప్రావీణ్యుడంటాడు. శ్రీకృష్ణదేవరాయలు జాంబవతి పరిణయము, (సంస్కృతం) మదాలసపరిణయం, రసమంజరి, సత్యవధూప్రీణనం, ఆముక్తమాల్యద, సకల కథాసారసంగ్రహం, ఉషాపరిణయం, జ్ఞానచింతామణి వంటి కావ్యా లను రాసి పండిత ప్రశంసలందుకున్నాడు. ఆయనకాలంలో అనేకులు విరివిగా కావ్యాలను రచించారు.

సంగీత,సాహిత్య,కళారంగాలలో విజయనగరానికి నాడు సాటిరాగల మరో సామ్రాజ్యం నాడు కనిపించదు.

**గీ॥ ఆంధ్ర కర్ణాటరాజ్య సింహాసనమున**
**వైనతేయ పరాక్రమ ప్రతిభతోడ**
**మించిరాయలు ధరణి బాలించువేళ**
**శత్రు సర్పాళి తలయెత్తఁ జాలకుండె**

సంగీత సాహిత్య, కళారంగాలే కాదు విజయనగర సామ్రాజ్యం వైపు ఎవరూ కన్నెత్తి చూడలేని విధంగా కృష్ణదేవరాయల కాలం విలసిల్లింది. ఇట్టి విషయాలన్ని “సాలంకార కృష్ణదేవరాయల” గ్రంథంలో కనిపిస్తాయి.

**సీ॥ స్తవ్యాంధ్ర కవితా పితామహాబిరుదాంకు**
**డలసాని వంశ పెద్దన మనీషి**
**మంజుల శయ్యా సమంచిత కవితాభి**
**వినుతుండు నంది తిమ్మన విభుండు**
**అతులిత మధురవాగ్వ్యాపార ధీరతా**
**కలితుండు ధూర్జటి కవివరుండు**

**నవభావకల్పన స్తవనీయపింగళి**

**సూరనాభిఖ్య యశోధురుండు**

**గీ॥అంత మాదయగారి మల్లనయు రామ**

**రాజభూషణు దయ్యలరాజు రామ**

**భద్రుడున్ రామకృష్ణ ధీవరుడునైరి**

**రాయలకు నష్టదిగ్గజ ప్రథితకవులు**

ఇలా అష్టదిగ్గజ కవులు గురించిన ప్రస్థావమొకటి షష్టాశ్వాసములో పొందు పరిచారు జంధ్యాలవారు.

**సీ॥ మనుచరిత్రము వ్రాసి మాన్యతను నెలకొల్పె**

**నలసాని పెద్దనాహ్వాయబుధుండు**

**వరపారిజాతాపహరణంబు లిఖియించె**

**నంది తిమ్మన రసజ్ఞ ప్రవరుడు**

**అలపాండురంగ మాహాత్మ్యంబు లిఖియించి**

**రామకృష్ణుడు కృతార్థతగడించె**

**బహుళార్థ రాఘవ పాండవీయము వ్రాసి**

**పింగళి సూరన్న వినుతికెక్కె.**

**గీ॥ కవినుతాముక్తమాల్యద కావ్యరాజ**

**మాంధ్ర భోజాంకితుండు వ్రాయంగనయ్యె**

**సుమతిరాయలుబహుకావ్యసుమములాంధ్ర**

**వాక్సుమంగలికై సమర్పణము సేసె**

ఇలా నాడు కవులు రాసిన మహాకావ్యాలను ప్రస్తావిస్తారాయన. ఇలా విలసిల్లిన విజయనగర సామ్రాజ్యం నేడు ఎలా ఉన్నదో కూడా వివరించి ఈ 'సాలంకార కృష్ణదేవరాయలు'కావ్యాన్ని ముగిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**సీ॥శిల్ప విస్ఫూర్తి వైచిత్ర్యంబుఁ జూపించు**

**ద్వారబంధముల వైభవముఁజూచి**

**ప్రస్తరఖండశిల్పన్యస్త సప్రాణ**

**సదృశుడౌ గురు గణేశ్వరునిఁజూచి**

**కంబకంబంబునన్ గణ్యశిల్పంబుతో**

**నమరు శిలామంటపములఁజూచి**

**సత్కవీశాశీర్వచస్సుచే మాయని**

**రాట్సభాలయముల జూలజూచి**

**గీ॥ పాడుబడియును నేడు జీవములగల్గి**

**నట్లు గనవచ్చు బలువిగ్రహములఁజూచి**

**పెద్దపెట్టునఁ గన్నీరు నిడనిదేశ**

**భక్తుడగునెందు?నాంధ్ర ప్రపంచమందు**

నాటి వైభవచిహ్నాలుగా ఇంకా జీవముట్టిపడే శిథిలాలు నేడు దర్శనమిస్తున్నా యని వేదనతో తెలుపుతారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**"ఏవితల్లినిరుడు కురిసిన హిమసమూహములు**

**కాళిదాస కవన వాహినిలో కరగిన ఉజ్జయిని నేడే తల్లీ చూపించు"**

అంటాడు శ్రీశ్రీ. అలాగే విజయనగర వైభవం కూడా కాలగర్భంలో కరిగి పోయింది. శిథిలాలు ఇంకా జీవకళని కోల్పోకనే కనిపిస్తాయి. ఏదైనా కాలం ముందు ఏ శక్తులు నిలువజాలవు. ఎంతటివారైన కాల మర్మ లోయల్లోకి జారిపోవలసినదే. పల్లకిలో ఎక్కిన ప్రభువైనా, అది మోసిన బోయి అయినా చివరకు చేరవలసిన చోటుకు చేరవలసినదే. ఈ సత్యాన్ని జంధ్యాలవారు చివరి పద్యాల్లో అంతర్లీనంగా ఇమిడ్చి అందించారీ కావ్యంలో.

**మ॥ అకటా దివ్యతపః ప్రభావనిధి విద్యారణ్యు దేమయ్యెనో**
**సకల ప్రాభవసార కారణ మహాసౌవర్ణ సంవృష్టి ధా**
**టికిని, మ్మేపదమయ్యెనో ద్విరదధాటీఘోటకోచ్చాలి తా**
**శ్వీక సేనాసముపార్జితార్థ్వ విజయ శ్రీధామ మెందేగెనో?**

**మ॥ చకితంబయ్యెడిc జిత్తమశ్రువులు పెల్చన గారు నానాటి రా**
**జ్యకలావైభవ శిష్టచిహ్నముల పజ్జన్నిల్చి వీక్షించినన్**
**వికలంబైనటు లెల్లcద్రోచునది దోర్వీర్యప్రదీప్తారివా**
**రక సామ్రాజ్యవిధాయి రాయల భుజారంభంబెటదాగెనో?**

**గీ॥సకల భాషానిలయముల సభలయందు**
**నూల్ల చారిత్రకారుల నోళ్ళయందు**
**సత్కవీశ్వర వదనాంబుజములనేcడు**
**నర్తనముసేయు రాయల కీర్తిలక్ష్మి.**

ఇలా నేటి పరిస్థితి కళ్లకు కట్టినట్లు చూపించారు జంధ్యాలవారు. చరిత్ర కారుల కీర్తి వెలుగొందుతూనే ఉంటుందంటారాయన. మరి జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని సాహిత్య చరిత్రకారులు ఎందుకు మరిచిపోయారో తెలియదు.

పంచసహస్రావధాని జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు రాసిన మరో మహాగ్రంథం ఆంధ్రసామ్రాజ్యము. ఈ గ్రంథం ఆయన 1960 ప్రాంతంలో రాశారు. ఈ గ్రంథం మొదటిసారి 1962లో ప్రచురించబడింది. ఈ గ్రంథం శాస్త్రిగారి పరిశోధనా పటిమకు గీటురాయిగా నిలుస్తుంది. శాతవాహన యుగము నుండి మొదలుకొని ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర అవతరణ వరకు గల చరిత్రను గ్రంథస్థం చేశారు జంధ్యాలవారు. ఇందులో నాలుగువేల నాలుగు వందల పద్యాలున్నాయి. ఒక వ్యక్తి పూనుకొని, పరిశోధనగావించి, ఇంతటి గ్రంథాన్ని అందించడం సామాన్య విషయం కాదు. చరిత్రకు అద్దంపడుతూ,

తన ప్రతిభ అంతటిని ఈ గ్రంథంలో చూపించారు జంధ్యాలవారు.

**మ॥"ఇది సామ్రాజ్యము"విస్మృతాంధ్ర ధరణీ భృద్రాజ్య సంస్థాపనా**
**భ్యుదయ ప్రేరణ సంధితోగ్రతర బాహు స్తంభ సంరంభమై**
**యద నెంతోచనె,మద్విలేఖన మపర్యాప్తంబో పర్యాప్తమో**
**మది నూహావిధిమేళవించుదని సంప్రార్థింతు ధీమంతులన్"**

ఈ ఆంధ్ర సామ్రాజ్య గ్రంథ ప్రారంభంలో తెలుపుతారు జంధ్యాలవారు.

**మ॥ తొలిఁకృష్ణాతటి నీ తరంగనట నోద్ధూతాంబు సంవ్యాప్తి భా**
**సిలు శ్రీకాకుళనాపత్తనము నక్షీణిక్షితీశార్వమున్**
**నెలవున్ జేయుచు నాంధ్రవిష్ణువను సంధించెన్ జుఁడీరాజ్యమున్**
**బ్రళయ ధ్వాంత నితాంతదండక మహారణ్య ప్రదేశమునన్**

ఆంధ్ర సామ్రాజ్య స్థాపనను మహా అరణ్య ప్రాంతమున శ్రీకాకుళం (కృష్ణా జిల్లా) విష్ణువనునతను ప్రారంభించినట్లు తెలుపుతారాయన.

**మ॥"అటుపై శ్రీముఖశాతవాహనుఁడు ఘోరాయోధన ప్రోద్యమో**
**ద్భట శౌర్యాతిశయ ప్రకారమునఁదత్సామ్రాజ్య సర్వస్వమొ**
**క్కట స్వాధీనత నొంది సింహపదవిన్ గైసేసి సామ్రాజ్య వి**
**స్ఫుట చిహ్నంబులతోడ శాంతిసుఖముల్ భోగించెవర్షంబుగన్"**

శాతవాహనుల రాజ్యస్థాపనతో ఈ గ్రంథం ప్రారంభమవుతుంది. శ్రీముఖుడు ఆంధ్ర సామ్రాజ్యమును ఒక్కటి చేసి మహా సామ్రాజ్యానికి పునాదులు వేసిన విషయం మనమిక్కడ గమనించవచ్చును. శ్రీముఖ శాతవాహనుడు క్రీ.పూ. 221-198 మధ్యకాలంలో రాజ్యపాలన చేశాడు. ఈ విషయాలను జంధ్యాలవారు తెలుపుతారు.

ఆంధ్ర సామ్రాజ్యమును ఎవరు నెలకొల్పారనే దానికి చరిత్రకారులు సరి అయిన సమాధానము చెప్ప వీలుకాదంటారు. కొన్ని ఆధారాలనను సరించి ఊహించిన దానిని బట్టి చరిత్రకారులు కొన్ని విషయాలను తెలుపు

తారు. బ్రహ్మాండపురాణము నందు ఆంధ్ర రాజ్యము గూర్చి ఒక కథ కన బడుతుంది. సుచంద్రుని కొడుకు ఆంధ్రవిష్ణువు మహేంద్ర పర్వతము, భీమేశ్వరము,కాళేశ్వరము, శ్రీశైలము గలిపి యాంధ్రవిష్ణువు తన రాజ్య మునకు ప్రాకారము నిర్మించాడు. దాని చతుర్ద్వారములందును శివుడు త్రిశూలం ధరించి రక్షిస్తాడని నమ్మేవారు. భీమేశ్వరం, కాళేశ్వరం, శ్రీశైలం లను కలిపి త్రిలింగ దేశమనేది వచ్చిందని తెలుపుతారు చరిత్రకారులు.

మరొక కథనం ఆంధ్ర కౌముది అను గ్రంథంలో కనిపిస్తుంది. ఆంధ్రవిష్ణువు శ్రీకాకుళంను పాలించిన చంద్రుని కుమారుడు. ఆర్య మంజుశ్రీమాల కల్పము అనే బౌద్ధ గ్రంథం కూడా సుచంద్రుని పేర్కొన్నది. శ్రీకాకుళం సుచంద్రుని రాజధాని. ఇది ప్రాచీన కాలంలో కృష్ణానది ఒడ్డున ఉన్నది. అది వరదల వల్ల కొట్టుకుపోయి, దాని సమీపంలోనే ప్రస్తుత శ్రీకాకుళం గ్రామం ఉందంటారు. శ్రీకాకుళంలో నేటికీ ఆంధ్రవిష్ణువు దేవా లయం నెలకొని ఉంది. శ్రీకృష్ణదేవరాయలు కళింగ దండయాత్ర సాగించడానికి ముందు ఆంధ్రవిష్ణువు దేవాలయాన్ని దర్శించాడు. ఈ శ్రీకాకుళం విజయవాడకు 20మైళ్ల దూరంలో ఉంది. ఈ ఆంధ్ర విష్ణువును ఆంధ్ర నాయక స్వామి అనడం కూడా ఉంది. ఆ కథనట్లుంచితే ఆంధ్ర దేశాన్ని నాలుగు శతాబ్దాలకు పైగా సుదీర్ఘంగా, అవిచ్ఛిన్నంగా పాలించి నవారు శాతవాహనులు. శాతవాహనులు ఆంధ్రులని చరిత్రకారులు ఘంటాపథంగా తేల్చి చెప్పారు. శాలివాహనులని, శాతవాహనులనియు, శాతకర్ణులని వేర్వేరుగా పిలవడం కూడా ఉన్నది.

శాతవాహన చరిత్ర–సంస్కృతి గురించి తెలుసుకోవడానికి సాహిత్య గ్రంథాలు, నాటి నిర్మాణాలు, నాణేలు వంటివే ఆధారం. మౌర్య చక్రవర్తి అశోకుడు మరణించిన తర్వాత క్రీ.పూ.మూడవ శతాబ్దంలో దక్కన్ పీఠ భూమిలో శాతవాహనుడు స్వతంత్ర ఆంధ్రరాజ్య స్థాపనకు నాంది పలికాడు.

ఇతని వంశీయులనే శాతవాహనులంటారు. శాతవాహనుని తర్వాత శ్రీముఖుడు రాజ్యానికి వచ్చాడు. అతను దక్కనులో సార్వభౌమాధికారంతో కూడిన స్వతంత్ర ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించాడు. అతని రాజధాని అమరావతి, (ధాన్యకటకం)మహారాష్ట్ర రథికులతో వైవాహిక సంబంధాలు నెరిపి వారి సహాయంతో దక్కన్ రాజవంశాలైన పిత్నికులు, భోజకులను ఓడించి రాజ్యాన్ని సుస్థిరం చేశాడు. అతని తర్వాత అతని సోదరుడు కృష్ణ రాజ్యానికొచ్చాడు. కృష్ణనే కన్య అని అంటారు. కన్హేరి గుహలు అతని పేరిటనే ఏర్పడ్డాయి. ఇతని సోదరులలో ఒకరు బౌద్ధ సన్యాసులకు గుహలు నిర్మించి ఇచ్చినట్లు పరిశోధకులు తెలుపుతారు.

మహారాష్ట్రలోని నానేఘాటు (నానాఘట్టము)వద్ద ఒక గుహలో శాతవాహనరాజుల విగ్రహాలు కొన్ని చెక్కబడి యున్నాయి. వాటిలో మొట్ట మొదటిది శ్రీముఖ శాతవాహనునిది. తరువాత దేవినాగనిక, రాయసరి సాతకర్ణి మొదలైనవారివి ఉన్నాయి. సాతకర్ణి దేవేరియైన నాగనిక "నానెఘట్టము" వద్ద ఒక శాసనము వేయించి, తన భర్త పుణ్యకార్యములను ప్రశంసించింది.

**ఉ॥ "ఏసుకు మున్ శతద్వయము నిర్వదియొక్కటి యేండ్లుదన్కనున్**
**భాసిలనైన కాలమునఁ బాలనసేసిన శ్రీముఖాంధ్రుడు**
**గ్రాసి విహారచండ విమతాహవభూ విజయ స్వరూప ల**
**క్ష్మీసదన స్వరూపుఁడను కీర్తి గడించిన మూర్తిగన్**

శ్రీముఖుడు క్రీ.పూ. 221వరకు పాలన చేసి అపారకీర్తి గడించాడని జంధ్యాల వారు ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో తెలుపుతారు.

**సీ॥ కనులెత్తిచూచెనా। తనభావములెఱింగి ప్రజలెల్ల శీర్షము వంపనైరి,**
**గళమెత్తి పల్కెనా। కలఁగి సామంత భూజానులు జోహారుసల్పనైరి,**
**పిడికిలి చూపెనా। వివిధాహవాగత క్షితపాలకులు కాందిశీకులైరి**

**కత్తి పేరెత్తినా। గాంభీర్యవారాశికల్పభూపులు నరిగాపులైరి.**

**గీ॥అప్రతిహతాంధ్రరాజ్య సింహాసనమున శ్రీముఖోర్వీశ్వరుండు భాసిల్లువేళ**

**నార్యలోకమ్ము గుర్తించె నాంధ్రజాతి జాతరక్త ప్రవాహ సంచలనశక్తి**

**గీ॥చంటిబిడ్డకుఁ చనుబాల జంకులేదు, సతికిఁ బయ్యెద యిసుమంత జారలేదు,**

**ధర్మకామిని యెద సిగ్గుఁ దాల్ప లేదు శ్రీముఖుదు సింహపీఠిఁగైసేయునాడు**

ఇలా శ్రీముఖుడి రాజ్యపాలన విషయాలను వివరిస్తారు జంధ్యాలవారు.

**మ॥మన పూర్వాంధ్రులు శాతవాహనుల నామంబుల్ పురాణాదులన్**

**గనవచ్చున్ బలుతీర్ల నట్లగుట నే గ్రంథంబునన్ శాలివాఁ**

**హనులన్నన్ మఱియాంధ్రభృత్యులన గాంథార్వంబుగా శాతవాఁ**

**హనులన్నన్ మఱిశాతకర్ణులనగా నాంధ్ర క్షమానాథులే.**

మన పూర్వాంధ్రులపేర్లలో శాతవాహనుల పేర్లు మనకు పురాణ గ్రంథాల్లో కనిపిస్తాయంటారు. శాతవాహనులన్న, శాలివాహనులన్న, శాతకర్ణులన్నా ఒకటేనని జంధ్యాల తెలుపుతారు.

పుష్యమిత్రుడు మగధను తన ఆధీనంలోకి తీసుకొనక పూర్వమే ఆంధ్ర రాష్ట్రపాలకుడైన శాతవాహనుడు శాలివాహనుడిగా ప్రసిద్ధి చెందాడని అంటారాయన.

**చ॥వరమతి శాతవాహననృపాల శుభప్రద పాలనంబునన్**

**స్థిరతర సౌఖ్యసంపదలఁ జెంది కులోచిత ధర్మకర్మలన్**

**జరుపుచుంటినింక నరజన్మ మభోగ్యము తద్ బృహత్కథా**

**సరణి వినంగఁజెప్పి నరజన్మ ము మాన్పవె భూతవల్లభా!**

అంటూ బృహత్కథను ప్రారంభించే ముందు ఈశ్వరుణ్ణి వేడుకుంటాడు గుణాఢ్యుడు. ఇలాంటి వివరాలు మనమీ గ్రంథంలో చూడవచ్చు.

కుంతల శాతకర్ణియను ఆంధ్ర చక్రవర్తి క్రీ॥పూ॥38-30ల మధ్య రాజ్యభారమును వహించాడు. ఇతడు కాణ్వాయన వంశీయుడైన సుశర్మను

ఓడించి, మగధరాజ్యమును స్వాధీనపరుచుకున్నాడని చరిత్రకారులంటారు. మగధ రాజ్యాక్రమణ కుంతలుని తర్వాత వాడైన మొదటిపులోమావి కాలంలో క్రీ॥పూ28లో జరిగెనని కొందరు చరిత్రకారులంటారు. అప్పటి నుండి క్రీ॥శ. 28వరకు అంటే ఒక శతాబ్దకాలము పాటలీపుత్రము పై ఆంధ్రుల ఆధిపత్యము కొనసాగింది. గుణాఢ్యుడు, శర్వవర్మలు కుంతల శాతకర్ణి కాలము వారని, బృహత్కథ ఇతని ఆస్థానమున రాయబడినదని కొందరి అభిప్రాయం.

వాత్స్యాయన కామసూత్రాలలో కుంతల శాతకర్ణి, అతని రాణి మలయవతి పేర్లు పేర్కొనబడ్డాయి. ఈ గ్రంథము క్రీ.శ.మూడవ శతాబ్దిదని పరిశోధకులు తెలుపుతారు.

శాతవాహనుల కాలంలో విద్యాలయాలుండేవి. వీటిలో ఉన్నత వర్గాల వారు మాత్రమే విద్య అభ్యసించేవారు. పురుషులతో పాటు స్త్రీలు కూడా విద్యనభ్యసించేవారు. గాథాసప్తశతి రచనకు తోడ్పడిన అణు లక్ష్మి, అనవలబ్ధి. మాధవి మొదలగు వారు వ్యాకరణము, రాజకీయశాస్త్రం, అర్థ శాస్త్రం, తర్కం, గణితం ప్రజాపాలన,న్యాయశాస్త్రం, సంగీతాలలో విద్యా భ్యాసం చేశారని పరిశోధకులు తెలుపుతారు. శాతవాహన చక్రవర్తులు విద్యాభివృద్ధికి కృషిచేయడమే కాకుండా పండితులుగా పేరుప్రతిష్టలు గడించారు. గురుకులాలు (ఆశ్రమాలు)రాజ్యంలో ఉండేవి.

బౌద్ధవిహారాలు విద్యాసంస్థలుగా ఉండేవి. ధాన్యకటకం, శ్రీపర్వత, నాగార్జునకొండ పట్టణాలలో బౌద్ధ విశ్వవిద్యాలయాలు స్థాపించబడ్డాయి. ఈ విశ్వవిద్యాలయాలలో పుస్తక భాండాగారాలుండేవి. ఖగోళం, జ్యోతిషం,తర్కం, న్యాయవ్యవహారాలను గూర్చి బోధన జరిగేది. వల్లెవేయించి కంఠస్థం చేయించే విధానముండేది.

శాతవాహనుల కాలంలో ప్రాకృతం రాజభాషగా ఉండేది. బౌద్ధులు

కూడా ప్రాకృతభాషను వాడారు. వీరు ప్రజ్ఞాపారమిత సాహిత్యాన్ని ప్రాకృతం లో రాశారు. హాల చక్రవర్తి ప్రాకృత భాషలో గొప్ప పండితుడు. కవి వత్సలుడు అనే బిరుదు కూడా పొందాడు. ఆయన ప్రాకృత పండితులను ఆదరించాడు. కుతూహాలుడు "లీలావతి" అనే కావ్యాన్ని ప్రాకృతభాషలో రాశాడు. గుణాఢ్యుడు పైశాచి ప్రాకృత భాషలో బృహత్కథను రాశాడు. బృహత్కథ సంస్కృతంలో రాసిన గ్రంథాలకు మార్గదర్శి. గుణాఢ్యుడు ప్రాకృతంలో వ్యాస, వాల్మీకి మహర్షులతో పోల్చదగిన వాడంటారు. ఈ కాలంలో సంస్కృత భాష కూడా అభివృద్ధి చెందింది. సంస్కృతం క్రమేపి ప్రాకృత భాష స్థానాన్ని సంపాదించింది. శర్వవర్మ గుణాఢ్యుడుని సంస్కృత వాగ్వివాదంలో ఓడించాడు. శకరార్యుడు సంస్కృతంలో శాసనాలు వేయించాడు. ఉషదత్తుడు శాసనాలను ప్రాకృత సంస్కృత భాషలలో వేయించాడు. బ్రాహ్మణ పండితులు సంస్కృత అభివృద్ధికి కృషి చేశారు. వైదిక సాహిత్యం సంస్కృతంలో ఉండేది. క్రీ.శ.2వ శతాబ్దంలో బౌద్ధులు కూడా సంస్కృత వాఙ్మయానికి ప్రాధాన్యతనిచ్చారు. ఆచార్య నాగార్జునుడు సంస్కృతంలో అనేక గ్రంథాలు రాశాడు. అతని సుహృల్లేఖ సంస్కృతంలో రచించినదే.

ప్రాకృత భాషలేకాక, దేశభాష కూడా ఆ కాలంలో వ్యాప్తిలో ఉండేది. గాథాసప్తశతి గ్రంథంలోను, శాతవాహనుల నాణేలపైన దేశీపదాలు కనిపిస్తాయి. దేశీభాష నేటి తెలుగు, కన్నడల భాషలకు మూలమని చెప్పబడుతున్నది. దేశీభాష తెలుగుకు సన్నిహితంగా ఉన్నదని ఆచార్య డి.సి.సర్కార్ తెలిపారు.

**మ॥ధరనీ దివ్య బృహత్కథాంశముఁ జిరస్థాయి రచింపన్ సమా**
**దరమున్ బూని గుణాఢ్య పండితుడు తద్గాథావన ప్రక్రియా**
**సరసుండెవ్వఁడు కాగలండని మదిన్ జర్చించి యే ధారుణీ**

**శ్వరు నీక్షింపక శాతవాహనునిపై బర్వించె విశ్వాసమున్.**

ఇలా ఈ గ్రంథం శాతవాహన ప్రభువే తగినవాడని గుణాఢ్యుడు అతన్ని ఎంచుకున్నాడు.

**మ॥గుణదేవుండన నందిదేవుడఁన దద్గుర్వర్హశిష్యవ్రజా**

**గ్రణులన్ ప్రాజ్ఞుఁడు శాలివాహనుని యిక్కన్ గ్రంథసంధాన కా**

**రణమున్ దెల్పఁగనంపె: వారరిగి తద్ గ్రంథస్వభావంబు ధీ**

**మణియౌ తేనికిఁ జెప్పదానిఁ గనియెన్ క్ష్మానాథుఁడుత్సాహియై.**

**గీ॥గ్రంథము న నన్నిపుటలను గలియుజూచి తత్కథానైజమునకు భూదవుడు మెచ్చె!**

**నవ్యకృతిఁదెచ్చినట్టి మానవులఁజూచి తద్విలేఖనరీతి స్వాంతమున నెఱింగె.**

శాతవాహన ప్రభువు వద్దకు తన శిష్యులను పంపి బృహత్కథను గురించిన విషయాన్ని తెలిపాడు గుణాఢ్యుడు. దాన్ని చూసిన ప్రభువు గుణాఢ్యుణ్ణి మెచ్చుకున్నాడు. గుణాఢ్యుడు రచించిన జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ ఆంధ్ర సామ్రాజ్య గ్రంథంలో బృహత్కథకు సంబంధించిన పూర్వాపరాలను చక్కగా వివరించారు.

ఈ గ్రంథంలో శ్రీముఖుని రాజ్య తంత్రజ్ఞత గురించిన ఒక అధ్యాయాన్ని కూడా పొందుపరిచారు జంధ్యాలవారు.

**ఉ॥ఏసుభవంబు పూర్వముననే ద్విశతాబ్దము లిర్వదొండు నేం**

**డ్లా సమయాన నాంధ్ర వసుధావన సేసిన శ్రీముఖుండు మే**

**ధాసము దీర్ణుఁడౌట; వసుధాతల శాంతికి మాగధావనీ**

**శాసనమే యవశ్యమని స్వాంతమునన్ దలపోసె నయ్యెడన్**

క్రీ.పూ॥222లోనే ఆంధ్రభూమిలో శ్రీముఖుడు తన రాజ్యతంత్రజ్ఞతను ప్రదర్శించి ఆంధ్రులకీర్తిని ద్విగుణీకృతంగా వెలిగేలా చేశాడు.

శ్రీముఖుని తర్వాత రాజ్యానికొచ్చిన శ్రీకృష్ణశాతవాహనుని గురించి కూడా మనమీ గ్రంథంలో తెలుసుకోవచ్చును. ఆంధ్రరాజ్యము గ్రంథ రచన

లో సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రత్యేక శ్రద్ధతో చరిత్రను మనకు చూపించారు. శ్రీముఖుని సోదరుడే ఈ శ్రీకృష్ణశాతవాహనుడు. ఇతడు క్రీ.పూ. 198–180మధ్యకాలంలో ఆంధ్ర సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. తదుపరి ప్రథమ శాతకర్ణి అధికారంలోకి వచ్చాడు. ఇతను క్రీ.పూ. 180–170మధ్యకాలంలో పాలన చేసినట్లు శాస్త్రిగారు ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో వివరించారు.

**చ॥జనకుని కాలమందె పెలుచన్ స మరాంగణ మాననీయ తం**
**త్ర నియతియందుఁ బేరుగొని, ధర్మవిదుండయి కృష్ణశాతవా**
**హను పయి శ్రీముఖాంధ్ర వసుదాధిప సూనుడు శాతకర్ణి భూ**
**జనములు సర్వసమ్మతి నొసంగఁగఁ బైకొనె రాజ్యభారమున్.**

**ఉ॥భీకర సంగరస్థలుల శత్రుల పీచమడంప శౌర్యలీ**
**లాకుల సాహసంబున నిజావని శాంతిసుఖంబుగూర్చి పె**
**న్దేఁకువ దక్షిణాపథపతి ప్రథితాంకము నేకవీర సం**
**జ్ఞాకలితాంకమంది,యిరుసారులు సేసె జయాశ్వమేధముల్**

మొదటి శాతకర్ణి తండ్రి కాలము నుండి రాజ్యతంత్రంలోనూ, శౌర్య ప్రతాపాలను ప్రదర్శించడంలో గొప్ప ప్రతిభ కనపరిచాడు. ఇతనిపాలనలో ప్రజలు శాంతిసౌఖ్యాలతో జీవించగలిగారు. మొదటి శాతకర్ణి రెండుసార్లు అశ్వమేథ యాగాన్ని నిర్వహించి ద్విగ్విజయంగా ముగించాడు. ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో ఇతన్ని గూర్చి చాలా విషయాలను మనం తెలుసుకోవచ్చు.

**మ॥అసమాన ప్రథిమాన శౌర్యనిధి యీ యాంధ్ర క్షమాజానిరా**
**జసము బూనిసుషుప్తినుండ నవరాష్ట్ర స్థాపనోద్వేల భా**
**వసమర్థత్వ మదెట్లు వెల్గగను; మద్వంశ్యాది భూభృత్తనూ**
**ప్రసరద్రక్త ఝరీశితోష్ణిమ యెటుల్వ్యక్తంబగు భూమికిన్**

అంటూ ప్రథమశాతకర్ణి ధైర్యశౌర్యాలను వర్ణిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**సీ॥ఆంధ్రప్రతాప రమాధీశ్వరుండు కన్దెరువ మాగధ సీమ దిగులుపడియె**
**శాతవాహన వంశ సంజాతవీరుని యడుగులోఁ బ్రాంతంబు వడఁకసాగె**
**ఆసేతుశీతల వ్యాప్త తేజోరీతి కద్రిమధ్యోర్వి వెన్కడుగువైచె**
**స్థగితాంధ్రజాతిపతాక సంభ్రాంతికి నరివీరధైర్యముయ్యాలలూఁగె**
**గీ॥ఆంధ్రయోధాంఘ్రి దూళిచే నరి జనాస్య కందరమ్ముల తేజమ్ము కసటువాఱె**
**ఆంధ్ర వీర్యమ్మదేడ! మౌర్యావనీంద్ర గణితభోగేచ్ఛయేడ సంగ్రామమేడ?**

క్రీ.పూ180-170మధ్యరాజ్యము చేసిన మొదటి శాతకర్ణి యుద్ధవిద్యలందు, రాజ్యతంత్రమందు మహాసమర్థుడు. ఇతడు దక్షిణాపథపతి అని, పృథివికి ఏకవీరుడని పిలువబడ్డాడు. ఇతడు క్రీ॥పూ॥185ప్రాంతంలో మగధ సామ్రాజ్యంపై దండెత్తాడు. ఈ సందర్భంలో శుంగులకు, ఆంధ్రులకు విదర్భపై ఆధిపత్యాన్ని సాధించడానికి పోరాటం సాగింది. ఈరాజ్యం రెండుగా చేయబడింది. ఈవిషయాలు కాళిదాసు రచించిన మాళవికాగ్ని మిత్ర నాటక మందు కనిపిస్తాయి. ఏది ఏమైన ఆసేతు హిమాచల పర్యంతం మొదటి శాతకర్ణి కీర్తి ప్రసరించినదని చెప్పవచ్చు. ఇతని గూర్చిన చరిత్రను జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో నిక్షిప్తం చేశారు. కనిష్కుని గురించి, యవనులు, శకనుల గురించి చరిత్ర కొంత మనకీ గ్రంథంలో లభిస్తుంది.

**సీ॥మహనీయ బౌద్ధధర్మ ప్రచారకుఁడేగి యవకాశమిడెగదా యవనతతికి**
**పావన మతధర్మ భరితభారతమాత కంటు తెచ్చెనుగదా యవనసేన**
**సింధుపాంచాలకాశ్మీర హృత్పీఠికి వ్యాధిగూర్చెనుగదా యవనరాజి**
**మాండలికాది భూమండలేశ్వర సౌఖ్యమపహరించెనుగదా యవనధాటి**
**గీ॥ఆర్యజాతులో లేక యవనార్యతతులో ధార్మికమతమ్మొ లేక అధర్మమతమొ**

**వ్యాపనముసేయcబరిశద్ధ ఫణితి గనక పరులపాలాయెగద కొంతభరతమాత**
శకులు మిడతల దండువలె శాతవాహన సామ్రాజ్యంపై పడిరి. పశ్చిమ భాగంలోని ఘూర్జరము ఆక్రమించాడు శకుల వీరుడనిపించుకున్న "క్షహరాటా నహపాణుడు". ఇలా ఆక్రమించిన భూభాగాన్ని అతడు తన పాలన క్రిందకు తెచ్చుకున్నాడు. ఆంధ్రసామ్రాజ్యంలో భాగమైన మహారాష్ట్ర ప్రాంతాన్ని కూడా జయించి, తన అల్లుడగు ఋషభదత్తుడిని తనకు ప్రతినిధిగా సహపాణుడు నియమించుకున్నాడు. విదేశీయులయిన శకయవన పహ్లావాదులు హిందూ బౌద్ధధర్మమతములనవలంబించి భారతీయులలో కలిసి పోవడం మొదలుపెట్టారు. ఈవిధంగా దేశంలో సాంఘిక విప్లవం సాగుతూ వచ్చింది. ఋషభదత్తుడు అనేక ధర్మకార్యాలను చేపట్టి ప్రజలనాకర్షించాడు. ఈవిధంగా కొంత భారత భూభాగం పరుల ఆధీనంలోకి వెళ్లిపోయింది. ఇట్టి విషయాలను చారిత్రకంగా పరిశీలించి అందించారు జంధ్యాలవారు.

**గీ॥శ్రీశివస్వాతి పెనునిద్రcజెందినంతc క్రీస్తుశకమున నూఱును రెండు సమలు**
**చనినదన్క గౌతమిపుత్ర శాతకర్ణి శాతవాహనుడాంధ్రరాజ్యమ్మునేలె**

క్రీ.శ. 78–102మధ్యకాలంలో ఆంధ్ర సామ్రాజ్యాన్ని గౌతమీపుత్ర శాతకర్ణి పాలన క్రిందకు వచ్చింది.

**సీ॥ శకపల్లవాదుల శక్తిcదూల్చిననాcడె వర్ణసంకరపీడ వదిలిపోయె**
**అన్యమతస్థుల నవలcదోలిననాcడె ఆచార్య శూన్యత యడుగుముట్టె**
**శైవమతావన సరణిc జూపిననాcడె బ్రాహ్మణద్వేషమ్ము పాఱిపోయె**
**బౌద్ధభిక్షువుల కాహ్వానమిచ్చిననాcడె యార్యదూషణము వెన్కంజవైచె**
**గీ॥శాలివాహన వంశ ప్రశస్తినాశ హేతుభూత స్వరూపారి హేతిగణము**
**లాంధ్ర రాజ్యాంతరాయుధాయతనమందె, నృపతి మాత్రుండె? శాతకర్ణి ప్రభుండు.**

క్రీ.శ॥78 ప్రాంతము వచ్చేసరికి పాటలీపుత్రముపై ఆంధ్రుల యాజమాన్యమంతయు అంతమయింది. ఉత్తర హిందూదేశంలో కుషాణుల విజృంభిం

చటమే దీనికి కారణం. ఆంధ్ర,కళింగ దేశాలు మాత్రమే శాతవాహనుల పాలనలో ఉన్నాయి. ఇలా శాతవాహనుల కీర్తి ప్రతిష్టలు అడుగంటి ఉన్న సమయంలో క్రీ॥శ॥78లో గౌతమీపుత్ర శాతకర్ణి ఆంధ్ర సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. నాడు ధాన్యకటకం రాజధానిగా ఉన్నది. ఇతడు మహావీరుడిగా చరిత్రలో నిలిచిపోయాడు. మిక్కిలి హీనస్థితిలో ఉన్న శాతవాహన సామ్రాజ్యాన్ని తన శౌర్యప్రతాపాలతో తిరిగి మహాకీర్తివంతం చేయ సంకల్పించాడు గౌతమీపుత్రశాతకర్ణి. ఇతని తల్లి గౌతమీ బాలశ్రీ. తల్లిపేరును తమ పేరు ముందు చేర్చుకోవడం నాడు శాతవాహనులలో ఒక సంప్రదాయంగా వచ్చింది. గౌతమీపుత్రుడు అసిక, అసక, ముళక, సరఠ, కుకుర, అపరాంత అను వివిధ వర్ణాల వారికి ప్రభువు. ఇతడు తిరిగి రాజ్యకీర్తిని నిలబెట్టాడు.

గౌతమీపుత్రుడు శకయవన పహ్లవులను ఓడించి తన శౌర్యాన్ని చూపాడు. క్షహరాటవంశమును తలెత్తకుండా నిర్మూలించాడు. చాతుర్వర్ణ సంకరాన్ని నిర్మూలించాడు. గౌతమీపుత్రుడు శకులనోడించి వారి ఆధీనంలోనున్న మాళవము, మహారాష్ట్ర, సౌరాష్ట్ర, నర్మదాతీర ప్రాంతాలను తన సామ్రాజ్యం క్రిందకు తెచ్చి విశాల సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు.

క్షహరాట సహపాణుడు స్థాపించిన రాజ్యమును స్వాధీనం చేసుకొని శత్రునిర్మూలనగావించాడు.

**సీ॥దివ్యగోదావరీతీర ప్రతిష్టాన నగరమేధాటితోఁ దగవుమానెఁ**
**పూర్వనష్టప్రాంత పునరార్జనముననే శాత్రవు లోయివడిరి**
**సింధుపాంచాలకాశ్మీర పాలకులైన యవనులేధాటి జోహారులనిరి**
**శకపల్లవాద్యన్యజనములే ధాటికి మనలేక బౌద్ధసమ్మతుల మనిరి**
**గీ॥వితత సౌరాష్ట్ర దేశప్రతిష్ట శౌర్య పరుషనహసాన వంశమే ప్రబలధాటి**

**సైఁపకయడంగె నయ్యది యాంధ్రశోణితాభ్యుదిత శాతకర్ణి ఘోరాసి ధాటి**

ఆంధ్రజాతి గర్వపడేవిధంగా వివిధ రాజ్యాలను జయించి తన శౌర్య ప్రతాపములను ప్రదర్శించాడు గౌతమీపుత్ర శాతకర్ణి. గతంలో కోల్పోయిన భూభాగాలన్నిటిని తిరిగి స్వాధీనపరుచుకొని, ఆంధ్ర సామ్రాజ్యపు కీర్తి ప్రతిష్టలను దేశమంతటా చాటాడు గౌతమీపుత్ర శాతకర్ణి.

**మ॥ ఇలకు సంగ్రహణ ప్రకారమున సంతృప్తుల్ విడంబింపవీ**
**యిలఁబాలించిన తెల్గుదాతలకు నీయీవిం బొసంగించు రీ**
**తులలోఁదృప్తియెలేదు ఱేఁడు మును సాధుశ్రేణి కీనైనయ**
**వ్వాలమిన్నూఱు నివర్తనాల్ సలుపఁ జెప్పున్ బట్టపుందేవియున్**

**గీ॥శాతకర్ణి బట్టపు సాధ్వియైన యువిద వాసిష్టియందున నుద్భవించె**
**నార్య పులమాయి శాతకర్ణ్యాహ్వయుండు అతడు యువరాజుగా బశ్చిమాంధ్రమేలె**

గౌతమీపుత్రశాతకర్ణికి పుత్రుడు జన్మించిన ఘట్టాన్ని, అలాగే అతడు వాసిష్ఠి పుత్రపులోమావి ఆంధ్రసామ్రాజ్యపు పశ్చిమభాగాన్ని యువరాజుగానేపాలన జేసిన విషయాలను గ్రంథస్థంచేశారు జంధ్యాలవారు.

పులోమావి గోదావరి ఒడ్డు నుండి ప్రతిష్టానమును ఉపరాజధానిగా చేసుకొని సామ్రాజ్యపు పశ్చిమభాగాన్ని పాలించాడు. 'ప్రతిష్టానము'నుపైఠను అంటారు. ఇది ప్రస్తుతము ఔరంగాబాద్ జిల్లాలో ఉంది.

ఆంధ్రపులోమావి క్రీ॥శ॥102–130 మధ్యకాలంలో పాలన సాగించాడు. ప్రతిష్ఠానము నుండి తన రాజధానిని ధాన్యకటకమునకు మార్చుకొని తండ్రి గౌతమీపుత్ర శాతకర్ణి అనంతరం వాసిష్టి పుత్రపులోమావి పూర్తిస్థాయి చక్రవర్తిగా అధికారానికి వచ్చాడు.

**గీ॥ఆంధ్రపులమావి శాతకర్ణ్యంతమందుఁ దనదు పూర్వులకు రాజధామమైన**
**తత్ప్రతిష్ఠానమున్విడి, ధాన్యకట క ధన్యపురమును ఱనరాజధానిఁజేసె**
**గీ॥తత్ప్రతిష్టానపుర రాజధామమందు నాంధ్రపులమావి పాలించు నదనునందు**

**చస్తనుండను పేరిటి క్షాత్రపకులుదుజ్జయిని ప్రతినిధిగ నుద్యోగియయ్యె**
**శా॥సౌరాష్ట్రమ్ముగొట్టి మాళవభువిన్ శాసించియాంధ్రక్షమా**
**ధీరుల్ దర్పితులై నవారలని తత్తేజంబు భజించియే**
**పారన్‌మేలని మాళవేశ జయదామాఖ్యుండు సంరంభము**
**బ్రారంభించెను వర్ధమాన పులమావ్యాంధ్రాధిపున్ మార్కొనెన్**
**గీ॥మానితోదంతుఁడగు పులమావి నృపుడ్రె శాలివాహనుఁడ నఁగ బ్రశస్తిఁ గాంచె**
**క్షాత్రపాన్వయ జయదామ జనవరుండె విక్రమార్క సమాఖ్యచే వెలసెననిరి**

వాసిష్టిపుత్రపులోమావి తండ్రి వలె గొప్ప శౌర్యవంతుడిగా కీర్తి గడించాడు. అతనే శాలివాహనుడని వేనోళ్లకొనియాడబడ్డాడు. ఇట్టి విషయాలను శాస్త్రిగారు చక్కగా ఈ "ఆంధ్రసామ్రాజ్యము"గ్రంథంలో వివరించి నాటి చరిత్రను మనకు చూపించారు జంధ్యాలవారు.

గౌతమీపుత్ర శాతకర్ణి అనంతరం క్రీ॥శ.102లో పులోమావి చక్రవర్తి అధికారంలోకి వచ్చాడు. ఇతడు మహాపరాక్రమశాలి. దిలీప మహారాజుకు రఘువువలె తండ్రి విజయాలకు చేదోడు వాదోడై ఉన్నాడు. జనకుడు ఇచ్చిన సువిశాల సామ్రాజ్యము నీతడు చెక్కుచెదరకుండ ఉంచడంలో తన ప్రతిభా శౌర్యాలని చూపాడు. ఇతని శాసనములు, నాణేలు ఆంధ్రరాష్ట్ర, విదర్భలలో లభించాయి.

శాతవాహనయుగమందు రెండు ముఖ్యశకములు ప్రచారములోనికి వచ్చాయి. ఇవి విక్రమాదిత్యశకము. శాలివాహన శకము అనేవి. విక్రమ శకము క్రీ.పూ. 58 సంవత్సరముల నుండి, శాలివాహనశకము క్రీ.శ.78సంవత్సరం నుండి లెక్కింపబడ్డాయి. ఒక చారిత్రక ఘట్టమునకు జ్ఞాపకార్థముగా శకములు ఆరంభింపబడేవి. అట్లయినచో విక్రమ, శాలి వాహన శకముల స్థాపనకు మూలములైన చారిత్రక సన్నివేశాలేంటి? అనే

ప్రశ్న ఉత్పన్నమవుతుంది. విక్రమాదిత్యుని గూర్చి, శాలివాహనుడను వీరుని గురించి అనేక గాథలు ప్రజానీకంలో వ్యాపించి ఉన్నాయి. విక్రమార్కుడు శకుల నోడించినదానికి స్మృతి చిహ్నముగా మొదలయిందని, శాలి వాహనుడు విక్రమాదిత్యుని జయించుటకు స్మారకముగ శాలివాహన శకము స్థాపితమయ్యెనని చెపుతారు. శాలివాహనుని గురించిన గాధలు, ఆంధ్ర శాతవాహన చక్రవర్తులలో ఒకరికి సంబంధినవని అనుకోవచ్చును. గౌతమీపుత్ర శాతకర్ణి క్రీ.శ. 78లో పాలన కొచ్చాడు. ఇతడు శకులను ఓడించాడు. శాలివాహనుని ప్రతిష్టానమును ఏలుచున్నట్టు కొన్ని కథలు న్నాయి. విక్రమాదిత్యుడు ఉజ్జయిని పాలకుడు. ఈ అంశములను బట్టి చూస్తే గౌతమిపుత్రుడో లేక అతని కుమారుడు పులోమావో ఉజ్జయిని పాలకుడైన ఒక శకరాజును జయించి ఉంటాడని, ఈ విజయ చిహ్నముగా చెప్పాలి. గౌతమిపుత్రుడు క్రీ.శ. 78లో రాజ్యానికొచ్చాడు. కాబట్టి శాలివాహన శకము ప్రారంభమైనదని చెప్పాలి. ఉజ్జయిని పాలకునొకనిని ఓడించినవాడు వాసిష్ట పుత్ర పులోమావి అయి వుంటాడని ప్రఖ్యాత చరిత్రకారుడు డా॥బండార్కరు అభిప్రాయపడ్డాడు. శాలివాహన విక్రమాదిత్య శకాల మధ్య అనేక భేదాభిప్రాయాలున్నాయి. ఒక నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించటానికి కుదరని పరిస్థితి నెలకొన్నదంటారు. ఇట్టి విషయాల గురించి "శాలివాహన విక్రమాదిత్య సంగ్రామ గాథ"ను తెలిపారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంధంలో.

**గీ॥ నూటడెబ్బది నాల్గవయేటి నుండి వరుస నిన్నూటమూడేండ్లు వరకునిలిచి**
**ధాన్యకటకమె తన రాజధానిఁజేసి క్ష్మాతలమునేలె శ్రీయజ్ఞ శాతకర్ణి**
**ఉ – ఈతడు బౌద్ధ శైవ సమభీష్టమతంబుల రెంటిలో సమ**
**ఖ్యాతి వహించి యాదరముగన్పడఁజూపుచుఁభూజనంబుల**

**భూతదయా విశిష్టుఁడయి పుణ్య సమంచిత కార్యలోలుఁడై**

**యేతటినైన భావ పరితృప్తిఁ జరించె ధరావనక్రియన్.**

ఇలా ఈ గ్రంథంలో శాతవాహన రాజు యజ్ఞశ్రీ శాతకర్ణి గురించి వివరించా రాయన

పులోమావి అనంతరం మరో గొప్ప చక్రవర్తిగా పేరు పొందినవాడు గౌతమీపుత్ర యజ్ఞశ్రీశాతకర్ణి. ఇతను క్రీ॥శ॥ 174 నుండి 203 వరకు రాజ్యపాలన చేశాడు. యజ్ఞశ్రీ ప్రతిభాశాలిగా, మహాపరాక్రమవంతునిగా కీర్తి గడించాడు. గతంలో తనకు పూర్వపు చక్రవర్తులు కోల్పోయిన భూభా గాలను తిరిగి జయించి వారిని పాలించినట్లు చరిత్రకారులు తెలుపుతారు. ఇతని శాసనాలు, నాణేలు గుజరాత్, కథియవాడ, బరోడా, మాల్వా, అప రాంతము, మహారాష్ట్ర వంటి ప్రాంతాలలోను, అలాగే మధ్య భారతమందు దొరికాయి. వీటిని బట్టి గౌతమీపుత్ర శాతకర్ణివలె యజ్ఞశ్రీ శాతకర్ణి త్రిసముద్రాధిపతియై విశాల సామ్రాజ్యమును పాలించెనని అవగతమవు తుంది. యజ్ఞశ్రీ నాణేములపై ఓడబొమ్మ మరియు లంగరు చిత్రంచబడి ఉన్నాయి. ఇతని కాలమందు అంతకు ముందు కూడా శాతవాహన రాజ్య మందు సముద్ర వ్యాపారము విస్తారంగా జరుగుతున్నదని చెప్పవచ్చును. యజ్ఞశ్రీ శాతకర్ణి రాజ్యకాలము ప్రాముఖ్యము వహించుటకు మరొక కారణం కూడా కలదు. ఇతని కాలంలోనే ఆచార్య నాగార్జునుడు జీవించి ఆంధ్ర బౌద్ధమతమును విశ్వవ్యాప్తం చేశాడు. నాగార్జునుడు ఒక శాతవాహన చక్రవర్తికి మిత్రుడని, రాజుకు ఇతడు "సుహృల్లేఖ"యను బౌద్ధ ధర్మ లేఖ రాసినట్లు చైనా యాత్రికుడు ఇర్సింగన్ రాశాడు. ఆ రాజు యజ్ఞశ్రీ శాతకర్ణి యేనని పరిశోధకులంటారు. ఆచార్య నాగార్జునుని జీవితకాలంలో బౌద్ధధర్మం కోసం విశేషంగా పాటుపడ్డాడు. ఇలాంటి విషయాలన్నీ మనం

"ఆంధ్ర సామ్రాజ్యము" గ్రంథంలో చూడవచ్చు.

**సీ॥ ఏ దివ్యపీఠంబ నాది కాలమునాఁడు బుద్ధ దేవుండు సముద్ధరించె**
**ఏ దివ్యపదవి కయ్యాది దేవుని వెన్కఁ బార్శ్వకాచార్యుండుప్రథిమఁగూర్చె**
**ఏనవ్య పీఠంబుపైన మూడవమూర్తి యశ్వఘోషాచార్యుఁడధివసించె**
**ఏ నిత్యమతపీఠిధీనేత నాగార్జునాచార్యమౌళి సమాదరించె**
**గీ॥ ఏ మహాపీఠిఁబోషించి వృద్ధిఁగనిరి చంద్రగుప్తాది నృపతు లాస్తవ్యపీఠి**
**భాగ్యమీనాడు శైవ సంబంధమందె శ్రీనగారామమదిశైవ సేవ్యమయ్యె**

యజ్ఞశ్రీశాతకర్ణి మతద్వేషములు లేని పాలన చేయడం, నాగార్జునుని వంటి బౌద్ధచార్యులను గౌరవించటం వంటివి చేసినట్లు చరిత్రకారులు తెలుపుతారు. ఇలాంటి విషయాలు మనమీ గ్రంథం ద్వారా తెలుసుకోగలుగుతాము. అడుగడుగునా జంధ్యాల వారి ప్రజ్ఞ ఈ గ్రంధమంతా విస్తరించి కనిపిస్తుంది.

**గీ॥ రెండునూరులయాడాది;రెండునూర్లయెనిమిది యబ్దమగు దన్క నితనివెన్క**
**క్ష్మాతలమునేలెను విజయశాతకర్ణి వెలసె నీతని పేరిటన్ విజయవాడ**
**గీ॥ వాని వెన్కను నిన్నూటపదకండు సమలదన్కను శ్రీచంద్ర శాతకర్ణి**
**పృథ్విఁబాలించె నీతని పేరనున్న సీసపున్నాణెములు సమీక్షింపఁబడియె**
**గీ॥ ఆపయిన నబ్ద సప్తకమయినదన్క మాన్యకీర్త్యంచితుఁడు పులమావి యొప్పె**
**వాయుమత్స్యాది విశ్రుతవాక్పురాణ సముదయమ్ములు వీరినామము లెసంగు**
**చ॥ అమల పరాక్రమాఢ్యులకు నాలయమైచను నాంధ్రభృత్య వం**
**శము గతియింప నా తెలుఁగుశాఖ జనించిరి బాహువీర్య స**
**త్తములయి పార్వతీయులన స్తవ్యసమాహ్వాయ సుప్రసిద్ధులా**
**సుమహితకీర్తు లేద్వురు వసుంధర నేలిరి సత్వసంగతి**
**గీ॥ వారిలో శుకసేన మాధారిపుత్ర భూమిపాలుండొకండు కాఁబోలుననిరి**
**ఆ సమయమునఁ బార్వతీయాంధ్రనృపుల యాదృతినినాయె సుఖభూమి యాంధ్రసీమ**

శాతవాహన రాజుల పరిపాలన అంతమొందింది. ఆంధ్రదేశమున సాతవా

హనాంధ్ర సామ్రాజ్యము నుండి తూర్పు చాళుక్యుల రాజ్యము నెలకొల్పబడు వరకు రమారమి నాలుగు శతాబ్దములు గడిచి పోయినవి. సాతవాహను లతోపాటు ఉత్తర భారతదేశంలో కుషాణుల పరిపాలన కూడా అంతమొం దింది. విదేశీలయిన శకరాజుల విజృంభణ కారణంగా ఇది జరిగిందని చరిత్రకారులు అంటారు.

సాతవాహన సామ్రాజ్యపు భాగాలు సామంతరాజులు ఆధీనంలో వెళ్ళిపోయాయి. వారిలో ఇక్ష్వాకులను వారు తీరదేశమున కొంతభాగం ఆక్రమించుకొని అర్థ శతాబ్దం వరకు పాలించారు. నాగార్జునకొండలో శాసనాలు దొరకు వరకు ఇలాంటి వంశమొకటి ఉన్నట్లు లోకానికి తెలియదు. శ్రీరాముడు ఇక్ష్వాకు వంశం వాడనే విషయం తెలిసిందే. గౌతమ బుద్ధుడు, వర్ధమాన మహావీరుడు కూడా ఇక్ష్వాకు వంశీయులేనని కొందరంటారు. మాధారి శకసేనుడు గురించి కూడా ఈ గ్రంథము ద్వారా తెలుసుకోవచ్చును. శాతవాహనులలో చివరి చక్రవర్తులయిన విజయశాతకర్ణి శ్రీచంద్ర శాతకర్ణి వంటి వారి గురించి వివరించారీ గ్రంథకర్త. విజయ శ్రీశాతకర్ణి పేరు మీదనే విజయవాడ ఏర్పడినట్లు తెలుపుతారు జంధ్యాల వారీ గ్రంథంలో.

**సీ॥ ఏ నాడు నిర్మితంబైనదో నిఖిల పాపాంతక కృష్ణా స్రవంతి చెంత**
**ఏ పార్థివేంద్రునిచే స్థాపితంబయ్యెనో మునియేరు కృష్ణ పొందెనయుచోట**
**ఏ బుద్ధిశాలి ధీహృద్యతనందెనో కాలాభివాచి విగ్రహగణంబు**
**ఏ నాడు భూభూషగానమయ్యెనో రత్న సంతానయుతగర్భసరుణిచేత**
**గీ॥ ప్రాంచదమరావతి దివ్యపత్తనంబు తద్గత స్తూపరాజమ్ము దర్శనార్థి**
**పటలికీనాటికిన్ బాప్పవారిజోపు చైత్యములకెంత చైతన్యశక్తి యదిర**

అంటూ అమరావతి గురించి అద్భుతంగా రాసి పాఠకుల హృదయాలలో చెరిగిపోని ముద్ర వేస్తారీ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఒక

నాటి కళావైభవములు చూపుసందర్భాలలో తమ మదిలోని భావాలను భాష్ప కణాలతో నింపి మనతో తనవెంటే నడిపించుకుపోతారీ గ్రంధకర్త.

**సీ॥అసమానహృద్యచైత్య శ్రీవినిర్మాణభూరివిభూతికి బుట్టినిల్లు**
**అకల్ప చింతనీయానల్ప విషయ సంస్మారకస్తూపాళి మాతృగృహము**
**నందనోద్యానసౌందర్య భాషక విహారా రామలక్ష్మికి నాటపట్టు**
**విధుమండల ప్రభా విభావాపహాసక సౌధి నిర్మాతల జన్మభూమి**
**గీ॥మందిరమ్ములో,విగ్రహమండలములో చిత్రపటములో, చిత్రించుచిత్రకారి**
**రాజిననురక్తిఁబెంచుగారాపుఁదల్లి మహిత జయరశ్మి;యాంధ్రసామ్రాజ్యలక్ష్మి**

ఇలా అసమానమైన ప్రతిభతో తన హృదయాన్ని అక్షరాలుగా పరిచి ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మిని మన హృదయాలకు హత్తుకునేలా తెలుపుతారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

**మ॥ వరుసన్‌బల్లవ వంశ సంజనితుఁడై ప్రఖ్యాతిమైనాంధ్ర రా**
**జ్యరమన్, బాలనసేయ నయ్యెను శివస్కంద క్షమాజాన్ని, త**
**త్తరుణంబు గణియింప మూడవ శతాబ్దంబందు మధ్యస్థమై**
**వరలన్ బోలు నటంచు శాసనముల ాావ్రాలొందె స్థానద్వయిన్**

సాతవాహనుల తరువాత దక్షిణాపథమునందు గొప్ప సామ్రాజ్యమును నిర్మించినవారు పల్లవులు. క్రీ.శ. మూడవ శతాబ్ది మధ్య నుండి తొమ్మిదవ శతాబ్దాంతము వరకు కాంచిపురం రాజధానిగా చేసుకొని పరిపాలన సాగించారు. దక్షిణాపథ చరిత్రయందు పల్లవులకు మహోన్నత స్థానముంది. ఉత్తరాదిన వాకాటులు, గుప్తవంశీయులు వలె దక్షిణమున పల్లవులు ప్రాముఖ్యత వహించారు.

శివస్కందవర్మ బహు పరాక్రమశాలి. వైదిక ధర్మపరాయణుడై అనేక క్రతువులు చేశాడు. ఇతడు తండ్రి కాలం నుంచి కాంచీపురం నుండి ఆంధ్రపథమున ధాన్యకటకములో తన తండ్రి వీరకూర్చుని ప్రతినిధియైన

ఉద్యోగికి ఆజ్ఞఇచ్చుచు ఒక దాన శాసనాన్ని వేయించాడు. ఈ శాసనమును మైదవోలు శాసనమని ప్రసిద్ధి చెందింది. శివస్కందవర్మధర్మ మహారాజా ధిరాజ అనే బిరుదు పొందెను.

**ఉ॥పల్లవరాజు మున్నుపరిపాలనసేసిన కాలమందు వై**
**ర్యుల్లసనాంతయోగ్యమయియొప్పెడిదుర్గముఁగట్టిశత్రురా**
**ద్వల్లభు వ్యాఘ్రమట్లు భయభగ్నునిఁ జేయఁగ నట'వేగి'నాఁ**
**జెల్లు నటంచుఁబేరిడి,రచించెను దానిని రాజధామమున్**

**ఉ॥వేఁగిపురంబు నాంధ్ర నృపవేశమ్ముగా రచియించుకొన్న భూ**
**భాగము వేఁగిదేశమని వాకొనఁజొచ్చిరి పల్లవోద్ధతుల్**
**సాగినయంతకాలమది సంపదలొంది రహించె,నేటిక**
**వ్వేంగిపురంబుజెల్లుఁ జినవేగి యన  బెదవేగియంచన**

నేటికి కూడా ఆంధ్రరాష్ట్రంలో చినవేగి, పెదవేగి అనే ఊళ్లు కనిపిస్తాయి. ఇవి ఒకనాడు రాజుల పాలనలో, సంపదలతో తులతూగేవి. ఇలా అనేక విషయాలు మనం ఈ గ్రంథం ద్వారా గ్రహించవచ్చు. పల్లవులు సంస్కృత భాషాభిమానులుగా ఉన్నారు. పల్లవులకు ఆంధ్ర దేశముతో సంబంధా లున్నాయి. కృష్ణానదికి దక్షిణమునున్న తెలుగుప్రాంతం వీరి ఆధీనంలో ఉండేది. గుప్తులలాగా వీరు తాము పరమ వైష్ణవభక్తులమని ప్రకటించు కున్నారు.

పల్లవులలో పరమమహేశ్వరులు కూడా లేకపోలేదు. మొత్తం మీద వీరు దక్షిణ భారతదేశంలో వైష్ణవమునకు గొప్పస్థానం కల్పించి వైదిక బ్రాహ్మణ మతము పోషించారు. వీరి శాసనాలు ఎక్కువగా ప్రాకృత, సంస్కృత భాషలలో కనిపిస్తాయి.

పల్లవులు మొదట ఆంధ్రులేనని చరిత్రకారులు అభిప్రాయపడతారు. దీనిలో భిన్నాభిప్రాయాలు లేకపోలేదు. గుంటూరుజిల్లాలో పల్నాడు ప్రసిద్ధి

చెందిన ప్రాంతం. ఈ పల్నాడే పల్లవులనాడు అనగా పల్లవులు నివసించిన మండలమని పరిశోధకులు ఊహించారు. బౌద్ధవాఙ్మయంలో దీనికి పల్లవ భొగ్గము అనే వ్యవహారముంది. పల్లవులు శకయవన పహ్లవులని చెప్పబడే విదేశీయులలో నొక జాతివారని, పహ్లవులే పల్లవులయిరని విమర్శకులు చెపుతారు.

ఆయుధాలు ధరించి వుండే పహ్లవ జాతివారు కొందరు శాతవాహన రాజుల వద్ద ఉద్యోగాలకు కుదిరి, వారి సామ్రాజ్యంలోని దక్షిణ దేశము రక్షణ కొరకు నియమించబడ్డారు. క్రమంగా వీరిచ్చట స్థిరపడి బలవంతులై శాతవాహనుల అనంతర కాలమున స్వతంత్ర రాజ్యం నిర్మించుకొని ఉంటారని కొందరంటారు. వేగవతీనది ఒడ్డున కాంచీపురం వీరు రాజధానిగా చేసుకున్నారు.

పల్లవులు భారద్వాజసగోత్రోద్భవులైన బ్రాహ్మణులను కారణమున మహారాజ కుటుంబాలలో అనేక బ్రాహ్మణ వంశములు ఆనాడు కనిపించేవని భావించవచ్చు. శాతవాహనులు, మానవ్య గోత్రీకులైన చాటు శాతకర్ణులు, శుంగులు, కాణ్వాయనులు, కదంబులు వంటివారని క్షాత్రవృత్తి నవలంబించిన బ్రాహ్మణులని పరిశోధకులు నిర్ధారించారు. వాకాటులు పల్లవులవలె భారద్వాజ గణమునకు చెందిన బ్రాహ్మణులని అంటారు. దీనిని బట్టి, ఇతర సామ్యములనుబట్టి పల్లవులు వాకాటుల సామంతులై ఉండవచ్చునని డాక్టర్ జయస్వాలు అనే పరిశోధకుడు అభిప్రాయపడ్డాడు. ఈ వంశస్థాపకుడు వీరుడైన వీరకుర్చ వర్మ. ఇది ఇతని నిజమైన పేరుగాక బిరుదై ఉండవచ్చునంటారు. వీరకూర్చ వర్మ కుమారుడు శివస్కందవర్మ.

**సీ॥ స్కందవర్మ కుమార సదృశ పరాక్రమ శోభి కుమారవిష్ణువును గాంచె**
**అతనికిన్ బుద్ధవర్మాఖ్యుఁడయ్యెఁ గుమారవిష్ణువు పుట్టి శోభిల్లనాయె**
**ఇతడు కర్మక రాష్ట్రగత చెందలూరు, నెన్మిదినూర్లు పట్టికల్ మేరనేసి**

**"అభిరూప"వాసి సమంచిత కౌండిన్యగోత్ర "భావస్కంద"కువలయామ**
**గీ॥రాగ్రణికి భవ్యదానంబు నాచరించె నశ్వమేధాది యాగములాచరించె**
**భుజపరాక్రమావిష్కృతి ముఖ్యుఁడయ్యె మాన్యకీర్తి విభాసిసామ్రాజ్యశాసి,**

శివస్కందవర్మతండ్రిమీదగల భక్తితో బప్పస్వామి అని గౌరవంగా పిలిచే వాడు. శాతకర్ణులు, ఇక్ష్వాకులు తమ మాతృనామములను స్వీకరించేవారు. పల్లవుల సాంప్రదాయాన్ని విడిచిపెట్టి, తండ్రి పేరుకు ప్రాధాన్యతనిచ్చారు. శివస్కందవర్మ ప్రకటించిన 'హిరహడగల్లి' శాసనం వల్ల ఆ కాలపు పరిపాలనా విశేషాలెన్నో తెలిశాయి. ఈ శాసనం బళ్ళారి మండలంలో దొరికింది. పిట్టి గ్రామ బ్రాహ్మణులకు తన తండ్రి (బప్పస్వామి)దానము చేసిన దానిని స్థిరపరుస్తూ మరికొంత భూమిని తాను సమర్పిస్తూ చేయించిన శాసనమది.

**మ॥మునుబప్పా నరపాలుఁడిచ్చినవనమ్ము ౯ సత్ఫలోదీర్ణము ౯**
**బునరాలేఖ్యముసేసె,మందిర పదమ్ముల్ నూరుపుం గళ్ళముల్**
**మునుగా బ్రాహ్మణ ధీరవంశజులకు ౯ బుణ్యార్థియై యిచ్చెశా**
**సన దృశ్యంబుగఁ జేసెఁ దచ్చరిత మశ్రాంతాభిదృశ్యంబుగ ౯**

ఇలా పల్లవుల గురించిన అనేక విషయాలు ఈ గ్రంథం ద్వారా వివరించారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆంధ్రదేశమున జైనమతము విలసిల్లిన విషయాలను ఈగ్రంథంలో ఆయన చేర్చారు. అలాగే ఫాహియాను పర్యటన వృత్తాంతమొకటి ఈ గ్రంథంలో లభిస్తుంది. అతడు భారతదేశంలో జైన బౌద్ధమతముల ప్రాబల్యాన్ని గురించి రాశాడు.

హిందూదేశ చరిత్రలో మహత్తరమైన పాత్రను నిర్వహించిన రాజవంశములలో చాళుక్యులొకరు. వీరిలో బీజాపూరు జిల్లా యందలి బాదామి నగరమును రాజధానిగా చేసుకొని పాలించిన వారిది మాతృశాఖగా చెప్పబడుతున్నది. దీని నుండి యెన్నియో చిన్న చాళుక్య కుటుంబాలు పుట్టుకొచ్చినవి. బాదామి చాళుక్యుల తరువాత గొప్ప చరిత్ర కలవారు

తూర్పు చాళుక్యులు, బాదామి చాళుక్యులు, కళ్యాణి నగరం నుండి పాలన చేసిన పశ్చిమ చాళుక్యులు వీరిని ఆంధ్ర చాళుక్యులని, తూర్పు చాళుక్యులని, వేంగి చాళుక్యులని వ్యవహరించుచున్నారు. వీరుగాక ఆంధ్రదేశంలో వేములవాడ చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు అను చిన్న కుటుంబాల వారున్నారు. గుజరాత్, రాజస్థాన్‌లందు కూడా చాళుక్య వంశమూలవారు రాజ్యాలను పాలించారు.

చాళుక్యుల జన్మ వృత్తాంతమును గురించి కూడా జంధ్యాలవారు ఆంధ్రసామ్రాజ్యము గ్రంథంలో తెలిపారు. 11,12 శతాబ్దాలందలి చాళుక్య శాసనములలో వీరి వంశోత్పత్తి గురించిన అంశాలున్నాయి. కళ్యాణి ప్రభువైన ఆరవ విక్రమాదిత్యుని ఆస్థానంలో బిల్హణకవి తన విక్రమాంకదేవ చరిత్రలో ఒక కథను ఇచ్చాడు. తూర్పు చాళుక్య రాజు విమలాదిత్యుని శాసనములో ఉల్లేఖింపబడిన వ్యాఖ్యానం వేరుగా కనపడుతుంది. ఇక జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఆంధ్ర చాళుక్యుల గురించి ఒక భాగంలో వివరించారు.

**మ॥విజయాదిత్యుడు దక్షణాపథ మహోర్వీశాసనాపేక్ష సా**
**మజ యూధాశ్వరథప్రకాండ భట సంభారంబుతోవచ్చి భూ**
**ప్రజఁబాలించు త్రినేత్ర పల్లవుని సంగ్రామ ప్రకారంబుచే**
**విజితుండై వధియింపఁగాబడియెనవ్వేళ – విధిప్రేరణ –**

**ఉ॥వీరుఁడు విష్ణువర్ధనుఁడు విక్రమ నిర్జిత శాత్రువుండు రే**
**యూరు ముఖాగ్రహారముల నుర్విసురాళికి ధర్మమార్గ సం**
**చారులకిచ్చె ధీరజనసమ్మతిఁ దొమ్మిదియేడులాంధ్ర ధా**
**త్రీరమణీయత – బెనిచె, దెచ్చె యశంబు జళుక్యధాటికి –**

ఇలాంటి పద్యాలలో చాళుక్యరాజుల గురించి తెలుపుతారు జంధ్యాలవారు. మంగియువరాజు, కోకిలవర్మమహారాజు, అమ్మరాజు విజయాదిత్యుడు,

రాజరాజవిష్ణువర్థనుడు, రాజరాజచోడగంగు, విక్రమచోడుడు వంటివారి గురించిన విషయాలను ఈ గ్రంథంలోఁమనం చూడవచ్చు.

**మ॥ నవ గుంటూరు సమాఖ్య మండలములోనఁ వెల్గురేపల్లె చు**
**ట్టవు భూఖండము చందవోల్‌క్షితిని యుక్తానల్ప రాజ్యంబు మా**
**నవనాధుల్ వెలనాడనఁ బిలిచిరా నవ్యక్షమాపాలక**
**ప్రవరుల్ శ్రీవెలనాటిచోడుల ని బిల్వబడ్డవారైరిలఁ**

అంటూ వెలనాటి చోడుల గురించి తెలుపుతారు జంధ్యాలవారు. ఆఱువేల నాడు గురించి కూడా ఈ గ్రంథంలో దొరుకుతుంది. రెండవ కుద్యవర్మ, వెలనాటి మనుమ గొంకరాజు వంటి వారి గురించే గాక బేట విజయాదిత్య వంశము గురించి తెలుసుకోవచ్చు.

**సీ॥ప్రభువు ధనంజయవర్మ భూజానికిఁబుట్టెఁజోళమహారాజ భూవరుండు**
**వానికి నవరామపార్థివుండొదవె, మహేంద్రవిక్రమవర్మ యితని కొదవె**
**సరసముదిత శిలాక్షరుఁడాతనికి గల్గి పాండ్యకేరళచోళపదములేలె**
**అతనికి గుణముదితాఖ్యుండు జనియించె నతఁడు పోర్ముఖరామునందనయ్యె**

ఇలా ఆంధ్రచోడుల రాజుల గురించి వివరంగా తెలుపుతారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అలాగే నలంబ రాజవంశము గురించిన సమాచారమీ గ్రంథంలో లభిస్తుంది.

**మ॥నవ కాలంబున నాంధ్రమండలములోనన్ మిశ్రితంబయ్యె గా**
**ని విశాలంబు కళింగరాష్ట్రము తొలిన్ భిన్నప్రదేశంబు గాఁ**
**గవిసెన్ రాజ్యరమావిభోగములనాకర్షించె నానావనీ**
**ధవవీక్షా ప్రణిపాతమున్ నిజబలౌద్ధత్య ప్రకారంబుచేఁ**

**గీ॥ఆంధ్ర రాజ్యాధిపత్యమేపడఁగినప్పుడు గుప్తభూపాలపాలన గోష్ఠిఁబడియె**
**బైనఁబల్లవరాజులపాలఁబడియె గాంగవశమయ్యె నంతఁగళింగపదము.**

కళింగరాజ్యములోగాంగవంశీయుల పాలన గురించి తెలుపుతారు

జంధ్యాలవారు.

కులోత్తుంగ చోడచక్రవర్తి దక్షిణదేశపు చరిత్రలో గొప్పపేరు పొందాడు. క్రీ॥శ॥1076-77 ప్రాంతంలో ఇతని పినతండ్రి విజయా దిత్యుడు మరణించుటచే, వేంగిరాజ్యమునకు అతను వచ్చెను. కళింగ దేశమున తొమ్మిది శతాబ్దములు అవిచ్ఛిన్నంగా పాలించి తూర్పు గాంగ వంశము గొప్ప గౌరవం చూరగొంది. ఇంత దీర్ఘకాలం ఇతర ఏ వంశము వారును భూపరిపాలన చేసినట్లు కన్పించదు. ఈ వంశములో మహాస మర్థులైన రాజులు పలువురున్నారు. తూర్పుగాంగులు తమ పేరనొక నూతన శకమును స్థాపించారు. దీనిని గాంగశకమంటారు. ఇది క్రీ.శ. 497 సం.మున ఆరంభించినట్లు చరిత్రకారులు భావిస్తారు. అప్పటి నుండి క్రీ.శ.1435 లో సూర్యవంశరాజులు ఒడ్డెగజపతులు ఈ ప్రాచీన రాజ కుటుంబమును అంతమొందించు వరకు గాంగవంశమువారు కళింగను పాలించారు. మహావైభవంగా గాంగరాజ్యము ఉత్తరమున గంగానది నుండి దక్షిణమున గోదావరి వరకు వ్యాపించి  ఉండేది. దంతపురము గాంగ వంశపు మొదటి రాజధాని. ఇది చాలా ప్రాచీనమైన నగరము. బుద్ధుని దంతము నిచ్చుట ప్రతిష్టించి, దానిపై స్తూపము కట్టారని, అందువలన ఈ నగరానికి దంతపురమని పేరు వచ్చినదని పరిశోధకులంటారు.

**గీ॥వెనుక గంగవాడినినేలు వీరసింహునాత్మజుండైన సుమతి కామార్ణవుండు**
**పిన్నతండ్రికి రాజ్యమ్మువిడిచిపెట్టి యేడవశతాబ్దమందు నానాడువదలె**
**గీ॥అరుగుదెంచెడివేళ దానార్ణవుండు శ్రీగుణార్ణవుడు ౯ మారసింహుడనగ**
**వజ్రహస్తుఁడన ౯ నిజభ్రాతృ జనులు ననుగమింపఁ గళింగరాజ్యమునఁజొప్పె**

అంటూ వీరనరసింహ గాంగుని గురించి తెలుపుతారాయన.

**ఉ॥ శ్రీరమణీయ వైభవము చెందును గావుత; శత్రుశాసిదో**
**స్సార కుమార సంధిత యశః పరిపూర్ణము, సర్వజన్మ సం**

**సార కృతాఘ సంహనన శక్తి సమన్విత కృష్ణవేణికా**

**వారిఝురీ ప్రపూత జనవాసము, శ్రీపలనాటి ప్రాంతముఁ**

పల్నాటిసీమ గురించి ఈ పద్యము ద్వారా తెలిపారు జంధ్యాల వారు.

**సీ॥ ఏ దేవిమూర్ధ మహీన రత్న ప్రభాస్వర పశ్చిమాతల సానుతటము**

**ఏ దేవికరములు పృధులఫేననఖాగ్ర సహిత మంజుతరంగ సముదయములు**

**ఏ రాణిభూషలు చారుమత్స్యాహార సంచారిగారుడ సంచయములు**

**ఏ రాణి ప్రాణేశుఁడింది రాహ్వయతనూజా జన్మకారణ సాగరుండు**

**గీ॥ ఏ యమశిరోజాలము హృద్యవిష్ణు పదవిహారి వినిర్మలాంబుదచయంబు**

**ఆమహామహి సకలబుధార్చనీయ స్థగిత కలుష ప్రశాంతి; కృష్ణాస్రవంతి**

ఇలా కృష్ణాతరంగిణిని మనకళ్ళముందు ఆవిష్కరిస్తారు జంధ్యాల వారు హృదయంలో భావానికి అక్షరరూపమివ్వాలంటే భాషాపటిమతోపాటు అవసరాన్ని బట్టి అక్షరాలను పదాలుగా కూర్చి పద్యంలో ఇమిడిపోయేలా చేయగల నేర్పు అవసరం. అప్పుడే పాఠకుడికి కవి భావమేమిటో అవగత మవుతుంది. భాషాపటిమ, నేర్పు మెండుగా మనకు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారిలో ఉన్నదని ఆయన రచనలే చెపుతాయి. కృష్ణానది సౌందర్యాన్ని మనకు చూపించటానికి ఆయన వాడిన భాష మనల్ని కృష్ణా తీరానికి చేరు స్తుంది. ఒక్క కృష్ణానది అనే కాదు ఆయన ఏది రాసినా అందులో లీనమై, అనుభూతి చెంది ఆ అనుభూతిని మనకందిస్తారు. ఇది జంధ్యాల వారి ప్రత్యేకతగా చెప్పక తప్పదు.

**మ॥అనుగుక్ష్మాపతి పాపపుంజ పరిహారాయత్త సుస్వాంతుఁడై**

**చనిపుణ్యప్రదవాహినీ జలములఁ స్నానంబులఁ దోఁగుచు**

**జనిత ప్రస్ఫుట భక్తితోఁ దుదకు గృష్ణావాహినీపూతమై**

**చనుక్షేత్రంబమరావతి తటమునఁ జల్పెఁ శతస్నానముల్**

**గీ॥ఆర్య ముఖ్యులు చెప్పినయట్లు లనుగురాజు మైఁదాల్చినట్టి వస్త్రంబులెల్ల నెల్యము  బాసి ధవళిమఁ బడసెనవుర!వర్ణనీయమే? కృష్ణా స్రవంతి మహిమ**

ఇలా అనుగుభూపాలుడు ముఖ్యులు చెప్పినట్లు తన విధిని ఆచరించడాన్ని చూపిస్తారాయన. పల్నాటి వీరచరిత్రను ఈ గ్రంథంలో చక్కగా తెలియ జేశారాయన.

**మ॥ఉదయించెన్ నలగామరాజు, సమర ప్రోత్సాహి మైలమ్మక**
**ట్లో దవెన్ విజ్జలదేవి గర్భమున ఖద్యోత ప్రతాపోద్ధతిఁ**
**బెదమల్లన్న యుఁభిన్న మల్లనయు జన్మింపగ నైరాపయిఁ**
**బొదవెఁ శూరుఁడు బాలమల్లన రణ ప్రోద్ధామ శౌర్యాఢ్యుఁడై.**

ఇలా నలగామరాజు ఈ జన్మించిన సన్నివేశాన్ని మనకు చూపిస్తారాయన.

**ఉ॥ నాయకురాలు తత్క్షణమునఁ గురిజాల రాజ్ఞియయ్యె భూ**
**నాయకునెట్టు లేనియు మనఃపరితుష్టిని జేసి భూరిలోఁ**
**భాయతవృత్తి రాజు స్వవశాగతుఁ జేయగనెంచి సత్విశో**
**భాయుత దోర్విభాసి పరివారమునం పెఁ బురాల దోఁచఁగన్**

ఇలా నాయకురాలు నాగమ్మ ప్రస్థాపన చేసారాయన పల్నాటి వీర చరిత్ర గురించి రాసిన భాగములో

**గీ॥ బాలచంద్రుని వేదికపైన నిల్పి శాతభైరవఖడ్గ రాజంబు తోడఁ**
**గ్రమచంపకతైల సుగంధ సాంద్ర వితతమస్తకమున నొక్కవ్రేటువైచె**

**గీ॥ అదిర విధిలిఖితాయుస్సమగ్రబలమొ బాలనాయుని కర్తవ్యభువికార్య బలమొ, మఱియెట్టి పటువిధిబలమొగాని వ్రేటురిత్తయ్యె ఖడ్గమ్ము విరిగిపోయె**

**ఉ॥బాలుఁడు బ్రహ్మనాయని సభాస్థలికిఁ గొనితేఁబడెఁ సుధీ**
**జాలము దైవసత్వము వశంబున రక్షితుఁడయ్యెనింకనీ**
**బాలునిమిత్తి పాలు సలుపం దగదంచునె, బ్రహ్మనాయఁడే**
**స్వాలయ మందు జేర్చె సుతుఁనాయతి ధైర్యపరీతచిత్తుడై**

కథ నడిపే క్రమంలో బాలచంద్రుని, బ్రహ్మనాయుడిని పై పద్యాలలో మనముందుకు తెస్తారు గ్రంథకర్త. ఈ గ్రంథంలో బ్రహ్మనాయని ప్రదేశాం తరవాసము, పల్నాటి వీర యుద్ధం వంటి ఘట్టాలను తనదైన ప్రత్యేకతతో అందించారు శాస్త్రిగారు. అలాగే బాలచంద్ర నరసింహుల యుద్ధ సన్నివేశా లను మనముందావిష్కరించారాయన. ఇలా పల్నాటి వీర చరిత్రను అనేకా నేక పద్యాల ద్వారా మనకు చూపించారాయన. ప్రతిఘట్టము మన కళ్ళకు కట్టినట్టు వర్ణించి చూపించడంలో వారి ప్రతిభ ప్రస్ఫుటమవుతుంది.

**సీ|| తపసులబోలె శాంతముగ వర్తిల్లెడు శార్దూలములకు సంచారభూమి**
**ప్రాక్తపోభంగానఁబాములై వల్మీకముల నుండు శాంతజీవులకు నెలవు**
**పసికూనలను బొట్టఁబట్టించి కొమ్మలదుముకాడు తల్లికోతులకుఁదావు**
**బోయల విల్లునమ్ములధాటి లంఘించుహరిణి సంతతికి జన్మాలయంబు**
**గీ|| ఆశ్రమ తపస్విజనులమహత్త్వ గరిమఁబులులు మేకలుకలిసి వర్తిలెడు**
**పట్టు మల్లికార్జున దృక్కోటి మహితధాటి ప్రచితశుభపేటి, శ్రీశైల వన్యవాటి**

అంటూ కాకతీయ సామ్రాజ్యము గురించి రాసిన భాగం ప్రారంభంలో వర్ణించిన పద్యాలు మనల్ని ఆతృతగా కాకతీయ సామ్రాజ్య చరిత్రను చదవ మంటాయి.

**సీ||చంగుచంగునఁ దురంగాంగనల్ లంఘించి చకిత దృక్కుల విలాసంబు జూప**
**ఉభయపార్శ్వంబుల నుర్వీజశాఖల శాఖామృగంబులు సందడింప**
**సాయుధ యూధ సమాలోకనంబున నదరి భల్లుకరాజు పొదలడాగ**
**రణవాద్య నిస్స్వరార్భటుల నాకర్ణించి వ్యాఘ్రముల్ గిరిగుహావళికిఁజేర**
**గీ||వివిధ మృగవత్సములు మేయువిధముమాని తక్కొనదమతల్లులదాపు జేర**
**ప్రతత గోదావరీ తటారణ్యసీమఁ బయనమొనరించెఁ గటకభూపాలసేన**

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రకృతిని వర్ణించే తీరు మనల్ని చకితుల్ని చేస్తుంది. ఆయన ప్రకృతిలో లీనమై యధాతథంగా మనముందుంచుతారు.

కాకతీయ సామ్రాజ్యము గురించి తెలియజేసిన భాగంలో ప్రకృతిని మన ముందు అద్భుతంగా ఆవిష్కరిస్తారు.

**సీ॥ కరవాలమూనెనా కవచంబు దొడిగిన వీరునైనను దెగవేయువాడు**
**విల్లుకైబూనెనా వినువీధి బాఱెడు పక్షినైనను బడవైచువాడు**
**గదబూని నిల్చెనా ఎదిరించు శాత్రవు శీర్షంబు రెండుగా జీల్చువాడు**
**వ్యూహంబు పన్నెనా ఉఱికి పైవచ్చెడుకట్టిడిపగవాని గట్టువాడు**
**గీ॥ ఆహవంబున నిల్వగానయ్యెనేని అసువులంబ్రీతివిడిచి పోరాడువాడు**
**దివ్యకందారసీమను దేవవిభుని క్రేవనేలిన శ్రీసోమదేవరాజు**

ఇలా సోమదేవరాజు శౌర్యపరాక్రమాలను, ప్రాణాలను సైతం లెక్క చేయక పోరాడు వీరత్వాన్ని మనకు తెలియజేస్తారు జంధ్యాలవారు.

**చ॥ మనమునైన భావనము మాటిమాటికి జర్చచేసి యా**
**వనరుహలోచనుండు తనబాము సుదూరము సేయు మర్మముఁ**
**గనఁబడజేసెనంచు క్షణకాలములో ననుమాద్రి వీధులం**
**బనిగొని కోరికన్గొనియె మాధవవర్మ వసించుగేహమున్**

మాధవవర్మ జన్మము గురించి, అతనికి సంబంధించిన అనేక విషయాలను తెలుపుతారీ గ్రంధంలో శాస్త్రిగారు. కాకతీయ సామ్రాజ్యపు పూర్వ చరిత్ర నంతా ఈ గ్రంథం ద్వారా మనం తెలుసుకోవచ్చు.

**గీ॥ ఏసుశకముననొక వేయియేండ్లపైన డెబ్బదార్వత్సరమ్ములు ప్రబ్బువేళ**
**సనఁగఁద్రిభువన మల్లాంక చక్రవర్తి విక్రమాదిత్యుడి రాజ్యపీఠినెనసె**
**ఉ॥ కాకతీనామదేవత నఖండ నిజాన్వయ దేవతావిధిఁ**
**గైకొని నిత్యపూజల వికల్పముగా రచియించుచుంటచే**
**నీ కులదేవతాహ్వయమునే నిజవంశ సమాహ్వయంబుగా**
**గైకొనఁగాకతీయులనగఁ యశముంగొని రాంధ్రభూస్థలిఁ**

**ఉ॥ కాకతిరాజ పూర్వికుల కాలమునందునె జైన పద్ధతుల్**
**దోఁకుటఁజేసి జైనమత సూచిత కాకతిదేవి గొల్చియ**
**ట్లే కులదేవతాధి భజించిరి 'కాకతి' వంశ సంజ్ఞగాఁ**
**జేకొనగాకతీయులనఁజెల్లిరి తత్కులజాతులెల్లరు॰**

కాకతీయులకు ఆ పేరు ఎలా వచ్చిందో వివరిస్తారాయన. కాకతీయులకు సంబంధించిన అన్ని వివరాలు, వారి పాలన, జనజీవనం వంటి అంశాలను కాకతీయుల శౌర్యప్రతాపాలు ఇలా అనేక విషయాలను ఈ గ్రంథం ద్వారా ఆయన తెలియజేశారు.

కాకతీయుల ప్రస్థానాన్ని పరిశీలిస్తే మూడువందల సంవత్సరాలకు పైబడి ఆంధ్రదేశమున రాజ్యపాలన జేసి ప్రజోపయోగ కార్యక్రమాలెన్నో చేసి, కవి పండితులను పోషించి, లలితకళలను పోషించి, ప్రోత్సహించి ఖ్యాతి గడించారు కాకతీయులు. కాకతీయ సామ్రాజ్యం తెలంగాణకు గుండెకాయ వంటిది. నేటికీ వారు నిర్మించిన బ్రహ్మాండమైన తటాకముల నీరు త్రాగుతూ, ఆ నీటితో పంటలు పండించుకుంటూ ఉన్నారంటే కాకతీయుల ముందుచూపు ఎలాంటిదో అవగతమవుతుంది. కాకతీయుల పుట్టుపూర్వోత్తరాలను గూర్చి పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ విషయం గురించి కొన్ని గాథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. ఒక వాదము ప్రకారం కాకతీయులు కాకతియను దైవమును తమ కుల దేవతగా భావించి పూజించుచుండినందువల్ల వారు కాకతీయులుగా పిలువబడ్డారు. ప్రతాపరుద్ర యశోభూషణము రాసిన విద్యానాథుడు కూడా కాకతీయులు కాకతియను పేరుతో వెలిసిన దుర్గామాతను కులదైవము నమ్మి పూజించినందువల్ల కాకతీయులనబడినరని తెల్పియున్నాడు. వీరు కాకతీ దేవతను పూజించిరనుట సత్యదూరము గాదు. అయితే కాకతీయులు స్వయంభూదేవుని కూడా కులదైవంగా పూజించేవారు. స్వయంభూదేవుని

పాదకమల పూజకులుగా కాకతీయులు వర్ణింపబడి ఉన్నారు. ఇలా అనేకం ప్రచారంలో ఉన్నాయి.

**చ॥ శుభనృపలక్షణాన్వితుఁడు శూరజనస్తవనీయమూర్తి శ**
**త్రుభుజకళాధరద్యుతి విధూతుడు నార్యజనానుసంధిత**
**త్రిభువనమల్ల సద్బిరుద దీప్తుడు కాకతి బేతరాజ వ**
**ల్లభుడుదయించె దుర్జయబల ప్రభలార దదన్వయంబునన్**
**గీ॥ప్రసరదేసు శకంబున పదిశతకాల యిరువదియుదొమ్మిదిగనైన**
**యేండ్లనాడు**
**తెలుగుతల్లికి సేవలందించుకొనియె విబుధ వసురాజు కాకతీబేతరాజు**
**మ॥పలుప్రాంతంబుల శాసనాలఁబరికింపన్ గాకతీయల్ సము**
**జ్జ్వల సూర్యన్వయ జాతభూపులని విస్పష్టంబుగాఁ దోఁచు నీ**
**స్థల మేలన్ గరికాలచోళ నృపవంశ ప్రోద్భవుల్రారే?ని**
**స్తుల తేజస్వియతండు పుట్టెనుగదా! సూర్యాన్వవాయంబునన్.**
**చ॥గణపతిరుద్రదేవ పరికల్పిత శాసనలేఖనైక ధో**
**రణి గనుగొన్న నీతెలుగురాజుల పూర్వనృపాలురన్ జగ**
**త్ప్రణుత రఘుక్షమావరుడు రామనృపాలుడు నున్నయట్టి కా**
**రణమున సూర్యవంశ భవరాజులనన్వలెఁగాకతీయులన్.**
**గీ॥పాఠకులకీవిశేషంబు స్పష్టపడఁగదెలు పనగునిది గణపతిదేవఘటిత**
**శాసనంబునఁ గాకతిక్ష్మావరాళియినకు లోద్భవులని యెలిఖింపఁబడియె**

ఇలా కాకతీయులెవరనే దాని గురించి వివిధ శాసనాల్లో రాయబడిన విషయం తెలుపుతూ, లోతుగా చర్చిస్తారీ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. స్థానికంగా ప్రచారంలో ఉన్న విషయాల కంటే శాసనాలనే ప్రామాణికంగా భావించాలనే ఉద్దేశ్యాన్ని కూడా జంధ్యాలవారు వ్యక్తం చేస్తారు.

**గీ॥వస్తుపరిశోధనము లేక వ్రాయఁబడిన స్థానిక చరిత్రలందు విశ్వాసముంచు విషయమునకంటె శాసన విలిఖితములందు విశ్వాసముంచుటర్హంబుగాదె?** అంటారాయన. ఆయన వాదాన్ని అంగీకరించటంలో న్యాయముందనేది కాదనలేం. జనసమూహాలలో అనేకమైన ప్రచారాలు ఉండటం సహజంగా జరిగేవే. ఒకరి నుంచి ఒకరికి ఒక విషయం చేరేటప్పటికే అనేక మార్పులు, అతిశయోక్తులు వంటివి చోటు చేసుకోవడం సామాన్యంగా జరుగుతుంటాయి. అటువంటప్పుడు మనం నమ్మటానికి సరైన ఆధారాలుండవు. ఒక వంశచరిత్రో లేక మరోవిషయమో తెలుసుకోవడానికి శాసనాలు ఉపయోగపడతాయి. కాబట్టి శాసనాలనే నమ్మితీరాల్సి ఉంటుంది. చరిత్రలు తెలుసుకోవడానికి ప్రాచీన గ్రంథాల వంటివి కూడా ఉపయోగపడతాయి. అన్నింటిని క్రోడీకరించుకొని చరిత్రకారులు ఒక నిర్ధిష్టమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తారు. జంధ్యాలవారు ఈ గ్రంథ రచనలో లోతైన పరిశోధనగావించి మరీ అందించారని ఈ గ్రంథం చదివితే అవగతమవుతుంది.

కాకతీయ ప్రభువుల కుల నిర్ణయం చేయుటకు ఆధారాలున్నాయి. ఈ వంశములలో గొప్పగా కీర్తి పొందిన గణపతిదేవుడి కాలం నాటి మోటుపల్లి, పాకాల, కాంచీపుర శాసనాలందు కాకతీయులు క్షత్రియులని వర్ణింపబడి ఉన్నది. వీరు సూర్యవంశమని ఆ శాసనాల్లో కనపడుతుంది. ప్రతాపరుద్రీయంలో విద్యానాథుడు ఇదే విషయాన్ని స్పష్టం చేశాడు. ఇటువంటి వాటినన్నింటిని ఈ గ్రంథకర్త తన పరిశోధనలో భాగం చేసుకున్నారు.

కాకతీయులు తూర్పుచాళుక్యుల వలె వరాహాన్ని తమ గుర్తుగా వాడుకున్నారు. కాకతీయుల నాటి శిల్పసంపద కూడా చాళుక్యులనాటి శిల్పాన్ని పోలి ఉంటుంది. దీని కారణంగా కాకతీయులకు చాళుక్యులతో మొదట సంబంధం కలిగి ఉంటుందని పరిశోధకులంటారు. అయితే కాకతీయులు పశ్చిమ చాళు

క్యుల సామంతులని తెలిపే శాసనాలు కూడా ఉన్నాయి. ప్రోలరాజును, రెండవ బేతరాజును, రెండవ ప్రోలరాజును పశ్చిమ చాళుక్యప్రభులగు మొదటి సోమేశ్వ రుడికి, ఆరవ విక్రమాదిత్యునికి సామంతులుగా ఉన్నారు. మొదటి ప్రోలరాజు సోమేశ్వరుడి నుండి హనుమకొండను పొందినట్లు కాజీపేట శాసనం తెలుపు తుంది. కాకతీయులు తమ శాసనాలు కొన్నిటిలో చాళుక్య విక్రమ శకాన్ని అంగీకరించి కాలనిర్ణయానికై దానిని వాడటం, రెండవ బేతరాజు త్రిభువన మల్ల బిరుదు నామాన్ని ధరించటం వంటి వాటివల్ల కాకతీయులు పశ్చిమ చాళుక్యులకే సామంతులై ఉంటారని కొందరు పరిశోధకులంటారు. కాకతీయులు మొదట పూర్వ చాళుక్యులకు సామంతులుగా ఉండి ఉంటారు. తర్వాత కాలంలో పశ్చిమానికి తమ రాజ్యాన్ని విస్తరించే క్రమంలో చాళుక్య రాజ్యంతో సన్నిహిత సంబంధాలు ఏర్పడినందున, తూర్పు చాళుక్య రాజ్యంలో బలహీనపడి పశ్చిమ చాళుక్యులు బలపడినందున కాకతీయులు మొదటి ప్రోలరాజు కాలం నుండి పశ్చిమ చాళుక్యుల ఆధిక్యతను అంగీకరించి వారికి సామంతులై ఉంటారని కొందరు పరిశోధకులు భావించారు. శాసనాలను పరిశోధించే కాకతీయ వంశస్థులలో మొదటి రాజెవరనేదాన్ని గురించి పరిశోధకులలో కొన్ని భిన్నాభిప్రాయాలు లేకపోలేదు. రుద్రదేవునిచే వేయించ బడిన హనుమకొండ శాసనంలో అతని తండ్రి అగు ప్రోలరాజును, తాత అగు త్రిభువనమల్ల, బేతరాజును మాత్రమే పేర్కొన్నారు. కాని మోటుపల్లి శాసనంలో ప్రోలరాజును, అతని కుమారుడు బేతరాజును, అతని కుమారుడు మరొక ప్రోలరాజును, అతని కుమారుడు రుద్రదేవుని ప్రశంసలున్నాయి. కాబట్టి కాకతీయవంశానికి ప్రథమ ప్రభువు మొదటి ప్రోలరాజేనని పరిశోధకులు తేల్చారు.

కాని కాజీపేట నందు వెలుగు చూసిన శాసనంలో మొదటి ప్రోల

రాజుకు పూర్వం మొదటి బేతరాజు రాజ్యపాలన చేసినట్లు తెలుస్తుంది. దీన్నిబట్టి కాకతీయుల వంశము మొదటి బేతరాజుతో ప్రారంభమవుతున్నదని కొందరు పరిశోధకులు తేల్చారు.

మొదటి బేతరాజు క్రీ.శ.992 నుండి 1052వరకు పాలన చేసినట్లు చరిత్రకారులు నిర్ణయించారు. ఈ బేతరాజు నూతన రాజ్యాన్ని స్థాపించిన వాడవటం వల్ల ఇతను శత్రువులతో పోరాడటానికి అతని కాలం ఎక్కువగా హరించుకుపోయింది. ఇతను మొదట నతవాటిసీమను అటు తర్వాత కొరవి సీమను తన ఆధీనంలో తీసుకున్నట్లు తెలుస్తుంది. ఇతను రాజ్యాన్ని బలపరుచు కొనే క్రమంలో విరియాల వంశీయులైన వీరుల సహాయాన్ని పొందాడు. ఈ విషయం గూడూరు శాసనం వలన తెలుస్తుంది. విరియాల యెఱ్ఱభూపతి, అతని భార్య కామసానమ్మలు బేతరాజుకు కొరవి సీమను కట్టబెట్టినట్లు, కాకతీయ రాజుగా గూడా చేసినట్లు గూడూరు శాసనం వల్ల తెలుస్తుంది.

**సీ॥గుట్టలే త్రవ్వెనో కొండలే కూల్చెనో టాలఁగట్టెను దుర్గసాలమెల్ల**
**తానె నిర్మించెనో దైవసంఘటితమో ధర్మానులిప్త మావాసపదము**
**మనుజులే త్రవ్విరో అనిమిషుల్ గూర్చిరో యవిరతాంబువులు జలాశయములు**
**స్వయముగా నాటెనో ప్రకృతి సంసిద్ధమో అమృత ద్రుమాఢ్య ముద్యానవనము**
**గీ॥భూతిచేఁ బ్రోలరాజునుబోలురాజు కంచు దివిటీల వెదికిన ౯గానరాఁడు**
**అతని పరిపాలనమ్మున నాంధ్రదేశ మింద్రపద భోగ్యభాగ్య నిస్తంద్రమయ్యె**

అంటూ మొదటి ప్రోలరాజు పరిపాలనా కాలాన్ని వివరిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. మొదటి ప్రోలరాజు పరిపాలనా కాలాన్ని, అతని అభివృద్ధి కార్యక్రమాలను మన కళ్ళకు కట్టినట్టు ఆయన చూపిస్తారాయన. అతని పరిపాలన కాలాన్ని ఒక స్వర్ణయుగంగా మనకు చూపిస్తారాయన. మొదటి బేతరాజు మరణించిన అనంతరం మొదటి ప్రోలరాజు కాకతీయ సింహాసనాన్ని

అధిష్టించాడు. క్రీ॥శ॥1052 నుండి 1075వరకు ఇతని పాలన కొనసాగింది. మొదటి ప్రోలరాజు పశ్చిమ చాళుక్య చక్రవర్తి, త్రైలోక్యమల్ల బిరుదుగల మొదటి సోమేశ్వరుడి వలన హనుమకొండను లిఖితపూర్వకంగా పొందాడు. ఇది మొదటి సంఘటనగా చెప్పవచ్చు. అలాగే మొదటి ప్రోలరాజు తన సేనాని ద్వారా కాంచీపురాన్ని స్వాధీనం చేసుకోవడం రెండవ ముఖ్య సంఘటనగా చెప్పవచ్చు. పాలంపేట పిల్లలమర్రి శాసనముల వలన ఈ విషయం తెలియవచ్చుచున్నది.

మొదటి ప్రోలరాజు అనంతరం రెండవ బేతరాజు అధికారంలోకి వచ్చాడు. ఇతను 1076 నుండి 1108వరకు పాలన గావించాడు. ఇతనికి త్రిభువనమల్ల అనే బిరుదు కలదు. రెండవ బేతరాజు చోళమాళవరాజగు విక్రమాదిత్యునికి సామంతుడిగా ఉన్నాడు. కాజీపేట శాసనం ఇతడు గొప్పవీరు డని ప్రశంసించింది. ఇతని వద్ద వైజన అనే దండనాథుడుండేవాడు. ఇతడు పశ్చిమ చాళుక్య ప్రభువగు ఆరవ విక్రమాదిత్యునిచే సహస్ర గ్రామ పరిమితి గల సబ్బిమండలము (నేటి కరీంనగర్ జిల్లా ప్రాంతము)ను ఇప్పించాడు. ఈవిషయం హనుమకొండ శాసనం తెలియజేస్తుంది. ఆ కాలంలో పశ్చిమ చాళుక్యులు బలవంతులై వేంగిరాజ్యాన్ని స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. పశ్చిమ చాళుక్యులకు, వేంగి రాజ్యానికి నడుమ కాకతీయ రాజ్యం అడ్డుగా ఉంది. కావున దానిని స్వాధీనం చేసుకోవడానికి సబ్బిమండలాన్ని కాకతీయులకు ఇచ్చివుంటాడని చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. ఇట్టి విషయంపై వైజన దండనాథుడు రాయబారము నెరపినట్లు చరిత్రకారులు తెలుపుతారు. రెండవ బేతరాజు అపర పరమేశ్వరుడని హనుమ కొండ శాసనం తెలుపుతుంది. రెండవ బేతరాజు తర్వాత 1108 నుండి 1116 వరకు అతని పెద్దకుమారుడు దుర్గరాజు అధికారంలోకి వచ్చాడు. ఇతని పరిపాలనా

కాలపు విశేషాలు అంతగా తెలియలేదంటారు పరిశోధకులు. ఇతని కుమారుణ్ణి అధికారంలోకి రాకుండా అడ్డుపడి రెండవ ప్రోలరాజు కాకతీయ సింహాసనాన్ని అధిష్టించాడు.

**చ॥పదపడి బేతరాజు సుతవర్యుఁడు రెండవ ప్రోలరాజనన్**
**విదితుడు హన్మకొండ పృథివీ సముప్రాశిత సింహపీఠిపై**
**బదమునిచె ౯ దదీయ విభవంబ దియంతకు నంతకెంతో గొ**
**ప్పది యయి సర్వభూ వినుతి పాత్రముగా దనరారెఁ దీరుగ ౯**
**సీ॥సమరాంగణాయుధ చలనమెవ్వానికి బుడుతప్రాయము నాటి బొమ్మలాట**
**రాజ్యతంత్ర కథనారంభ మెవ్వానికి ఆటచోటుల లోని నోటిపాట**
**సంఖ్యావదభ్యర్ణ సత్కార మెవనికి చిటికెనవ్రేలిపై జిమ్ములాట**
**కితవాత్మ కేంగితజ్ఞత రీతియెవనికి కనుమూతలేని క్రీగంటి చూపు**
**గీ॥సరసపశ్చిమ చాళుక్య చక్రవర్తి విక్రమాదిత్య సామ్రాజ్య విహితమంత్రి**
**మకుటమణి సబ్బిసాయిర మండలాభిభూషితుడతండు రెండవ ప్రోలరాజు**

ఇలా రెండవ ప్రోలరాజు గురించిన విషయాలను వివరిస్తారు జంధ్యాలవారు. రెండవ ప్రోలరాజు 1116నుండి 1157వరకు పాలన చేశాడు. ఇతడు బేత రాజు రెండవ కుమారుడు. ఇతడు మహాపరాక్రమవంతుడిగా పేరుపొందాడు.

**మ॥తన పూర్వక్షితి పాలవల్లభులు తత్పాశ్చాత్య చాళుక్యరా**
**జనియుక్త ప్రతిబంధ సూత్రములకు ౯ సామంతులై తృప్తి భా**
**వనులై యున్నను బ్రోలరాజు నియమ స్వాతంత్ర్య లక్ష్మీసమా**
**ర్జనమందే మనముంచి ప్రొద్దుగడిపె ౯ సన్మంత్ర తంత్రజ్ఞుడై**

రెండవ ప్రోలరాజు కొంతకాలం వరకూ పశ్చిమ చాళుక్యుల సామంతుడిగా కొనసాగాడు. కాలక్రమంలో వారి బలము క్షీణదశకు చేరుకోవడంతో ప్రోల రాజు విజృంభించి వారి యధికారాన్ని అంగీకరించ పోరుసల్పాడు. ఇతడు

గొప్పవీరుడు. కాకతీయరాజ్యాన్ని సంపూర్ణంగా స్వతంత్రరాజ్యంగా చేశాడు. హనుమకొండలోని రుద్రేశ్వరాలయంలో ప్రోలరాజు సాధించిన విజయపరం పరను వర్ణించిన శాసనమొకటి ఉన్నది. ఇతడు తైలదేవుడు, గోవిందరాజు, గుండరాజు, జగద్దేవుడు వంటి వారిని ఓడించాడు. తైలపుడు పశ్చిమ చాళు క్యరాజు, గోవిందరాజు నేలకొండపల్లి ప్రాంతపు ప్రభువు; గుండరాజు మంత్ర కూటానికి ప్రభువు. జగద్దేవుడు నేటి కరీంనగర్ జిల్లాలోని వేములవాడ ప్రాంతపు ప్రభువు మంత్రకూటమనగా మంథెన గ్రామం. ఇలా జైత్రాయాత్ర కొనసాగించి కరీంనగర్, వరంగల్ జిల్లాలోని చాలా ప్రాంతాలను తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు.

పశ్చిమ చాళుక్యరాజగు ఆరవ విక్రమాదిత్యుని అనంతరం రాజ్య సింహాసనాన్ని అధిరోహించిన మూడవ సోమేశ్వరుణ్ణి కూడా ఓడించాడు. ఇలా అతడు స్వతంత్రుడై మహామండలేశ్వరుడను బిరుదు పొందాడు. పశ్చి మ చాళుక్య రాజగు తైలపుని మంత్రియు, దండనాథుడగు బిజ్జలకాలచర్యుడు తన ప్రభువును పదవి నుండి తొలగించుటకు కాకతీ ప్రోలరాజు నుండి చాలా సహాయం పొందారు. ఈవిధంగా కాకతీయ సామ్రాజ్యాన్ని రెండవ ప్రోలరాజు విస్తరించాడు. ఇతడు 1157 ప్రాంతంలో మరణించాడు. ఇతడు ప్రమాదవశాన తనకుమారుడగు రుద్రదేవునిచే చంపబడినట్లు ఒక కథ కూడా ప్రచారంలో ఉంది. కాని దానికి ఆధారాలంతగా లభించలేదు. ఇతడు తూర్పు తీరాన రాజ్యవిస్తరింపజేయడానికి ప్రయత్నిస్తూ యుద్ధంలో మరణించినట్లు చరిత్రకారులు తెలుపుతారు. ద్రాక్షారామంలో ఉన్న ఒక శాసనంలో వెలనాటి ప్రభువు చేతిలో మరణించినట్లు తెలుపుతుంది.

**మ॥వెనువెంట ౯ హనుమాద్రిరాజ్య రచనావీరుండు లేకుంటధీ**
**జనసంభావ్యము గామి సింహ పదతేజంబున్ బునస్సంస్కృతం**

**బొనరింపజని; రయ్యేcబౌరులకు నూత్నోత్సాహము ౯ రుద్రదే**
**వుని రాజ్య ప్రతిపాలనంబు మొదలై పుట్టించె నానందముఁ౯**
**శా॥ ప్రోలక్ష్మాపతి కూర్చినట్టి విభవమ్ము రాజ్యలక్ష్మి విలా**
**సాల ౯ బ్రోవగ రాజముద్రికల హస్తంబూని సింహాసన**
**స్థాలంకారము వన్నెదేల్చుటకు నిత్యాసక్తుడై శూరసై**
**న్యాళి ౯ దీర్చెను రుద్రదేవుడు సమీకాభ్యర్హ శిక్షాగతి ౯**

రుద్రదేవుడు 1158నుండి 1195వరకు తండ్రిని మించిన వీరుడై పరిపాలన సాగించాడు. రుద్రదేవుడు అనేక యుద్ధాలు చేసి తన రాజ్యమును విస్తరించాడు. దొమ్మెరాజు, మేడరాజు, మైలగిదేవుడు, భీముడు, చోడోదయుడు వంటి వారిని జయించాడు. ఈవిషయాలను హనుమకొండ శాసనంలో కనిపిస్తుంది. దొమ్మెరాజు నేటి హైదరాబాదు రాష్ట్రంలో ధర్మపురి నుండి భద్రాచలం వరకు పాలించిన ప్రభువుగా చెప్పబడుతున్నాడు. మేడరాజు నేటి వరంగల్ జిల్లాలోని ఒక స్థానిక ప్రభువు. మైలగిదేవుడు కరీంనగర్ జిల్లాలోని జగిత్యాల తాలూకా నందు పరిపాలన చేసినవాడు. కాకతీరుద్రుడు ఇతన్ని జయించుట వలన పొలవాసదేశం ఇతని స్వాధీనమయింది. ఈ ప్రాంతాన్ని నేటికీ పొలసా అనే పేరుతో పిలువబడుతున్నది. భీముడు అదే రాజు ఓరుగల్లుకు 50మైళ్ల దూరంలో గల వర్ధమానపురం(నేడు వడ్డమట్టి)ను పాలించేవాడు. ఇతడు చోళవంశానికి చెందినవాడు.

**చ॥ప్రముఖుడు భీమచోడ నరపాలుడు క్రూరనిరంకుశాధికా**
**రము రచియింపcజొచ్చి నిజరాష్ట్రమున ౯ బ్రజలెల్లc బెల్లుగ ౯**
**శ్రమపడcజొచ్చిరావిధి, బ్రజాపరపీడన శాంతిసేయసై**
**న్యములను వెంటబెట్టుకొని యాతని మార్కొనె శిక్షసేయcగ ౯**

**మ॥జనహింసాత్మక పాలన ప్రకృతిశిక్షఁ జేయబైవచ్చునా**
**యనుమాద్రీశుడు రుద్రదేవుభయదత్యావేగముఁజూచి వెం**
**టనెచోడుండునిజాప్తవర్గము,నరణ్యప్రాంతముల ఁజొన్పెరు**
**ద్రనరేంద్రుండు పురప్రశాంతికయి సంస్థాపించె సైన్యంబటఁ**
**అంత నుదయచోడ సమాహ్వాయ క్షితీశ ధామమగు పురి నగ్నిదగ్ధంబుసేసె**
**దత్పురీ మధ్యభాగానఁ ద్రవ్వఁజేసె నొక తటాకంబు,మాపె నాయూరిపేరు**

భీముడు అతిక్రూరుడై, అవినీతిపరుడై ప్రజాహింసకు పాల్పడుతుంటే రుద్ర దేవుడు అతనిపై దండెత్తి వర్ధమానపురాన్ని స్వాధీనం చేసుకున్నాడు. దీంతో చోళవంశం నాశనమయింది. చోడోదయునితో సఖ్యత నెరిపి అతని కుమార్తె పద్మావతిని వివాహం చేసుకున్నాడు. ఈవిజయం వలన నేటి హైదరాబాద్ రాష్ట్రంలోని తెలుగు ప్రాంతాలన్నీ అతని ఆధీనమయ్యాయి. అటు తర్వాత రుద్రదేవుడు వెలనాటిపై దండయాత్ర జరిపాడు. తన తండ్రి రెండవ ప్రోలరాజు మొదటి పర్యాయము, క్రీ॥శ॥1162వ సంవత్సరంలో రెండవ పర్యాయం రుద్రుడు ఈరాజ్యంపై దాడులు కావించాడు. ఈ రెండవ దండయాత్ర ఫలితంగా శ్రీశైలం, త్రిపురాంతకం ప్రాంతాలు రుద్రదేవుని ఆధీనంలోకి వచ్చాయి.

1185వ సంవత్సరంలో రుద్రదేవుడు వెలనాటి మూడవ గొంక రాజుతో యుద్ధం చేసి అతన్ని ఓడించాడు. దీంతో అతని కుమారుడు పృథ్వీ శ్వరుడు పిఠాపురానికి పారిపోయెనని ద్రాక్షారామ శాసనం తెలుపుతుంది. ఈ విజయం వలన, రుద్రరాజు తండ్రి వధకు ప్రతీకారం తీర్చుకొనుటేగాక తన రాజ్యమును నేటి గోదావరి, కృష్ణాజిల్లాలకు విస్తరింపజేశాడు. రుద్రదేవుని రాజ్యం ఉత్తరాన గోదావరి వరకు, దక్షిణమున శ్రీశైలం వరకు, పశ్చిమాన కళ్యాణి వరకు, తూర్పున తూర్పుకనుమల వరకు విస్తరించాడు. ఇట్టి

విషయాలన్నీ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో చూడవచ్చు.

**సీ॥మునుకులాడెను గదా పూతవారాశి తరంగాలఁ బూర్వది గ్రాష్టసీమ**
**కేలుగల్పెనుగదా చాళుక్య కళ్యాణ పదముతోఁబశ్చిమ ప్రాంతసీమ**
**మన్ననల్ గొనెఁగదా మాల్యవంతమునంటి ప్రచిత కౌబేర దిగ్రాజ్యసీమ**
**చేమోడ్పు గొనెగదా శ్రీశైలగిరిదన్క ప్రతత దక్షిణదిశావ్యాప్తసీమ**
**గీ॥కాకతీయాంధ్ర భూవరాస్తోకశౌర్య ఘటిత సామ్రాజ్యమది పురోగమనమూని**
**అభ్యుచిత శాంతిసౌఖ్యాల నందఁజేసి ప్రోదతనమూని, శ్రీరుద్రభూమిజాని**

ఇలాంటి పద్యాల ద్వారా రుద్రదేవుని శౌర్యప్రతాపాలను జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మనకు తెలియజేస్తారు.

కాకతీయుల కాలంలో ఆంధ్రదేశంలో ప్రాచీనములగు జైన– బౌద్ధ మతములు క్షీణించుట వలన శైవ–వైష్ణవ మతాలు పుంజుకోవడం జరిగింది. బౌద్ధమత స్థాపకుడైన గౌతమబుద్ధుణ్ణి దశావతారాలలో ఒకనిగా అంగీకరించి పూజించటం ప్రారంభమైనది. క్రమక్రమంగా బౌద్ధులు ప్రాచీన హీనయాన బౌద్ధాన్ని వదిలిపెట్టి, పూజాదికాలతో నిండిన మహాయానాన్ని అవలంబించటం వలన బుద్ధ ధర్మము క్రమంగా హిందూ ధర్మంలో లీనమయింది. కానీ జైన మతం అలాగాక కాకతీయ సామ్రాజ్య స్థాపన నాటికి బలంగా విస్తరించి ఉంది. కాకతీయ ప్రభువులు మొదట జైనమతాన్ని ఆదరించారు. వారి కులదైవమైన కాకతి కూడా జైనదేవతయే అయివుండవచ్చునని చరిత్ర పరిశోధకులంటారు. శైవమతం ఆంధ్రదేశంలో విస్తరిస్తున్న సమయంలో కాకతీయులు ఆ మతాన్ని అవలంబించారు.

**మ॥జనకుండంచితరీతి జైనమతదీక్షాతత్పరుండైనీ**
**తనివిశ్వాసము పూర్వజైనమతగాద ౯దేలగాబోక యా**
**దినమందుగల చక్రవర్తి గణమున్ దేశాధిపుల్గొన్న భా**

**తిని సంభావనసేసి శైవమతరీతిన్ నిల్పెఁజిత్తాబ్జము ౯**

**చ॥శివమత నైజపద్ధతిని స్వీకరణం బొనరించినంత భూ**
**ధవుడగు రుద్రదేవుడు మతప్రధిమాఢ్య శివాలయంబు ని**
**ర్మితిసలిపె ౯ బ్రతిష్ఠయొనరించెను శాస్త్రసముక్తపద్ధతి ౯**
**శతఘట పూరితాంబువుల జల్పగనయ్యె శివాభిషేకముల్**

ఇలా కాకతీయులు అవలంబించిన మతం యొక్క వివరాలను ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో తెలిపారు. అలాగే కాకతీయుల కాలంలో అభివృద్ధి చెందిన శిల్ప కళాభివృద్ధిని సవివరంగా జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తెలిపారు.

**మ॥తెలుగుల్ శిల్పకళా ప్రభావమున సాదృశ్యంబు లేనట్టి వా**
**రలనంగన్ విశదీకరించుటకు దార్కాణంబుగా నిల్చు మం**
**జుల చిత్రంబుల వేయి కంబములతో శోభించు నీ శ్రీశుదే**
**వళమే చాలదె యాంధ్ర శిల్పనిపుణత్వంబెట్టిదో చూపగన్**

**మ॥ కలదే? దేవళమిట్టిదెందయిన వేకంబంబులాధారమై**
**నిలువన్ శిల్పకళా విలాసములతో నింగిన్ సురవ్రాతమున్**
**బిలువంబోయెడు లీల నివ్వటిలు నుర్విన్ శిల్పనైపుణ్య మాం**
**ధ్రులకే చెల్లునటంచు జాటెడు వియద్భూమి ప్రదేశంబులన్.**

ఇలాంటి పద్యాలలో కాకతీయులు శిల్పకళా వైభవాన్ని మనకు చూపిస్తారు జంధ్యాలవారు.

**ఉ॥శ్రీకర రుద్రదేవుడు ధరిత్రివిడ ౯దనతమ్ముడౌ మహా**
**దేవుని పుత్రుడౌ గణపతి క్షితిపాలుడు రాజ్యశాసియే**
**కావలెనంచుఁ దెల్పెనటుగావున శ్రీగణపత్యాభిఖ్యుడే**
**భూవరుఁడయ్యె నావిభుడు పొందె మనోధృతి నల్లనల్లన ౯**

**మ॥వరకృష్ణాతట కాంచికాంత రసరద్వారాశి తీరోర్వధీ**
**శ్వరుడై యేలుచునుండc దద్గణతిక్ష్మానాథుడవ్వేళ సుం**
**దర సింహాచల, విక్రమాఖ్య ప్రమథ్యస్థంబువేంగ్యుర్వి, నే**
**లిరి, చాళుక్యనృపాలక ప్రతినిధుల్ వెల్నాటి వీరప్రభుల్.**
**గీ॥పదియుమూడవదగు శతాబ్దంబునందు నిర్వదియు నెన్మిదబ్దంబు లేగువఱకు**
**కాకతీయాంధ్ర గణపతి క్ష్మావరేణ్యు డెల్ల వెలనాటి సీమజయించిమించె**

ఇలా కాకతీయ ప్రభువులందరి గురించి వివరం ఈ గ్రంథంలో ఇచ్చారు శాస్త్రిగారు. కాకతిగణపతిదేవుడు(1199 నుండి 1262)గొప్ప పాలన గావించి కాకతీయ ప్రభువులలో మహాకీర్తిని గడించాడు. కాకతీయ రాజ్యాన్ని ఇతడు సామ్రాజ్యంగా రూపొందించాడు. ఇతడు క్రీ॥శ॥1199నుండి పది సంవత్సరాల పాటు యాదవరాజుల బందీగ ఉండి జైతునిచే కనికరింపబడి విడువబడ్డాడని యాదవ రామచంద్రుని పైఠాన్ శాసనం వలన తెలుస్తుంది. అయితే 1199 నుండి గణపతి దేవుడు పాలన గావించినట్లు శాసనాధికారాలు తెలుపుతాయి. దీనిని బట్టి ఇతడు యాదవులు బందీగా చాలా స్వల్పకాలమే ఉన్నట్లు చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. కుదిరిన ఒక సంధి కారణంగా అతడు బంధవిముక్తుడైనట్లు వారు తెలుపుతారు. అతడు 1199లో రాజ్యాధికారానికి వచ్చిన వెంటనే వెలనాటి పృథీశ్వరుని ప్రాబల్యానికి అడ్డుకట్టవేయడానికి ప్రయత్నం ప్రారంభించాడు.

గణపతిదేవుడు యొక్క సేనానులలో ప్రముఖుడైన మల్యాల చౌండ సేనాని దివిసీమపైకి దండెత్తి అక్కడి చోడిరాజును ఓడించి, అతని వద్ద పృధ్వీశ్వరుడు దాచియుంచిన కనక ధనరాశుల్ని కొల్లగొట్టుకొని వచ్చి గణపతి దేవుడికి అప్పగించాడు. గణపతి దేవుడితో సంధి చేసుకున్న చోడిరాజు తన కుమార్తెలు నారమ, పేరమలను గణపతి దేవుడికిచ్చి వివాహం చేశాడు.

చోడిరాజు కుమారుడగు జాయనను తన కొలువులోకి గణపతి తీసుకొన్నాడు. పగతో రగిలిపోతున్న పృథ్వీశ్వరుడు తూర్పుదేశం నెలవుగా గణపతి మీద యుద్ధానికి సిద్ధమయ్యాడు. ఇది క్రీ.శ.1206-8మధ్య జరిగింది. ఈ యుద్ధంలో పృథ్వీశ్వరుడు మరణించాడు.

వెలనాటిని జయించిన తర్వాత గణపతిదేవుడు దక్షిణదేశంపై దృష్టి సారించాడు. తిక్కభూపాలుని బాధ తొలగించడానికి నెల్లూరుని వశపరుచుకొని, నెల్లూరు రాజ్యాన్ని తిక్కభూపాలునికి అప్పగించి దాయాది బాధను తొలిగించాడు. తిక్కభూపాలుని దాయాదికి సాయము వచ్చిన సేవుణ, కర్ణాట, చోళసైన్యాలను గణపతిదేవుడు ఓడించాడు. అంతటితో తిక్కభూపాలుడు తన రాజ్యమందలి కడమమండలాన్ని గణపతికి ఇచ్చి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. గణపతి దేవుడు ఆ ప్రాంతంలో గంగయ సాహిణి అనువానిని సామంతపాలకునిగా నియమించాడు.

**శా॥నానారీతుల నాంధ్రరాజ్యరమ కౌన్నత్యంబుఁ జేకూర్చు భా**
**వానఁ దీర్ఘసముద్రయానములఁ జాలఁ బ్రోత్సహింపంగనై**
**నానాదేశపదార్థ నిష్క్రయమునఁ వ్యాపారముఁ బెంచి యెం**
**లేనిఁ శ్రీగణపత్యాధీశ్వరుడు చేయించెఁ దదుత్సాహమున్**

గణపతిదేవుడు వివిధ దేశాలతో వర్తకవాణిజ్యాలను నెరుపుటకు ప్రోత్సహించాడు. తన పాలనలో ప్రజలు సుఖసంతోషాలతో జీవించుటకు పాటుపడ్డాడు. కాకతీయ ప్రభువులలో తన పేరు చిరస్థాయిగా నిలుచునట్లు చేశాడు. ఇలాంటి విషయాలన్నింటి జంధ్యాలవారు చక్కగా వివరించాడు.

**శా॥అంబాదత్త వరంబుగా గణపతి క్ష్మాధీశనామంబు ని**
**ల్పంబుస్త్రీ యుగళంబు పుట్టె గణపాంబాదేవి యొక్తర్తు రు**
**ద్రాంబాదేవి మరోర్తు వీరలకు రాజ్య ప్రరక్షావిధా**
**నంబుఁ నేరిపె సైన్యశాసనవిధానంబెంతయుఁ నేరిపెఁ**

గణపతిదేవుడికి మగసంతానం లేదు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు. వారిని మగవారి వలె పెంచి, అన్ని విద్యలు నేర్పించాడు. వారు గణపాంబాదేవి, రుద్రాంబికాదేవి. జ్యేష్టపుత్రిక రుద్రాంబాదేవి.

**శా॥శ్రీరుద్రాంబిక జ్యేష్టపుత్రి విబుధాశ్వీర్వాద సత్వంబున**
**బారావారా గంభీర భావయయి భూపాలార్హ తంత్రజ్ఞతా**
**ధీరత్వంబున రాజ్యలక్ష్మిని గొన సందీపించి చండప్రచం**
**డారాతి ప్రతిరోధి సాహసభర స్వాంతబున ౯ రాజిలె ౯**

గణపతిదేవునికి మగసంతానం లేని కారణంగా 1262లో రుద్రాంబాదేవి కాకతీయ సింహాసనాన్ని అధిరోహించింది. రుద్రాంబను చాళుక్య వీరభద్రునికిచ్చి వివాహం జరిపించాడు గణపతిదేవుడు. ఈమెకు ఇద్దరు కుమార్తెలు. రుద్రాంబ యవ్వనంలో భర్తను కోల్పోయింది. తన తదనంతరం రాజ్యభారం వహించవలసినది తన కుమార్తేనని భావించిన గణపతిదేవుడు రాజ్యపాలనయందు మెళకువలు, యుద్ధతంత్రాలందు చక్కని శిక్షణనిప్పించాడు. రుద్రాంబ స్త్రీ అయినా పురుషవేషము ధరించి, పురుషులను మించిన ధైర్యసాహసాలతో రాజ్యకార్యనిర్వహణ భారాన్ని చక్కగా నిర్వహించేది. స్త్రీ పరిపాలన సమర్థంగా ఉండదని భ్రమపడి పలువురు సామంతులు ఈమెపై తిరుగుబాటు చేశారు. కానీ రుద్రాంబ సేనానులు వీరినందరిని అణచివేశారు. చోళ-పాండ్యరాజులు కాకతీయ సామ్రాజ్యపు దక్షిణ ప్రాంతంపై దాడులు సాగించారు. కాని వీరిని రుద్రాంబ పరాభవించి వెనక్కు తరిమిగొట్టింది. యాదవరాజగు మహాదేవుడు ఉత్తరము నుండి కాకతీయ రాజ్యంపై దండెత్తి రాగా, రుద్రాంబ సేనలు అతన్ని గోదావరి అవతలకు తరిమివేశారు.

**మ॥దినముల్ పైబడినంతకంత కభివృద్ధిన్ జెందె గానోచిత**
**స్వన వీణాపరివాదనోదిత సుధాప్రహ్లాదన ప్రౌఢయై**

**ఘనసాహిత్య జగద్విభాస్వర దలంకారైక విజ్ఞాత్రియై**
**జనకక్ష్మావర విద్వదంచిత సభాసంభాషణాభ్యర్హయై**
**క॥జనకుని జీవితకాలము దనుకన్ రుద్రాంబ రాజధర్మజ్ఞ సభన్**
**గొనియెన్ బూరుషవేషము ననుభవము గడించె బాలనాచరణమునన్**

ఇలా రుద్రమాంబ గురించి అనేక విషయాలను ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథంలో వివరిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. కాకతీయుల పాలన గురించి, కాకతీయ ప్రభువుల గురించి చాలా సమాచారము ఈ గ్రంథంలో మనకు లభిస్తుంది.

**మ॥చెలువుండం చరియంచు నెంచక జగత్ శీర్షంబు వ్రేల్పించువే**
**వెలుగుంజో దనుకూల కాలగతిచే వెచ్చందనమ్మోడి రా**
**జిల శాంతిప్రతిభ ఁ గొనె ఁ గగనలక్ష్మీ ఁ గ్రొమ్మొయిల్ పయ్యెద ఁ**
**వలనొప్ప ఁ దులకింప జేసెను గరస్పర్శా దరోదారత ఁ**

ఇలా వర్షరుతువు గురించి తెలుపుతారాయన ఒకచోట.

**శా॥ఆ రుద్రాంబకు ముమ్మడాంబ యన, రుయ్యమ్మంచు సత్సమ్మతా**
**చారల్ పుత్రిక లిర్వురైరి కొనియె ఁ జాళుక్యజు ఁ మమ్ముడాం**
**బారత్నమ్మట రుయ్యమాంబ గొనె దీవ్యన్నన్నదేవాఖ్యుని**
**వ్వారల్ రుద్రమయల్లురైరి గొని రాపై మండలాధీశత**
**మ॥నతరక్షారతి రుయ్యమాంబికకు సంతానంబు లేదాయె స**
**త్సుత యుగమ్ము జనించె ముమ్మడమకందు ఁపెద్దకు ఁ బెట్టెశ్రీ**
**మతి రుద్రాంబ ప్రతాపరుద్రుడను నామంబు ఁ ద్వితీయు ఁ గురు**
**స్మృతిగా నన్నమ దేవుడంచనియె రాజ్ఞీరత్న మత్యాదృతి ఁ**

జంధ్యాలవారు ప్రతాపరుద్రుని జననాన్ని పై పద్యాలలో వివరిస్తారు. కాకతీయ ప్రతాపరుద్రుడు 1239-1323వరకు కాకతీయ సామ్రాజ్యాన్ని పాలన చేశాడు.

ప్రతాపరుద్రుడు రుద్రాంబకు దౌహిత్రుడు. రుద్రాంబ ప్రతాపరుద్రుని దత్తత స్వీకరించింది. ప్రతాపరుద్రుడు మహావీరుడిగా ఖ్యాతి గడించాడు. అతను కవి పండిత పోషకుడిగా కూడా ఖ్యాతి పొందాడు. ఇతని కాలంలోనే కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. క్రీ.శ.1303వ సంవత్సరంలో మొదటి పర్యాయం అల్లావుద్దీన్ సేనాని మాలిక్‌కపూర్ ఓరుగల్లుపై దండెత్తగా ప్రతాపరుద్రుడు అతనితో సమానంగా పోరాడలేక విశేషధనం అతనికి ఇచ్చి సంధి చేసుకున్నాడు. మహమ్మదీయులు మరో రెండుసార్లు కాకతీయ రాజ్యంపై దండెత్తి వచ్చారు. మొదటిసారి పరాజయాన్ని అంగీకరించి సంధి చేసుకున్నా రెండవసారి వారినోడించి పారదోలాడు ప్రతాపరుద్రుడు. 1322వ సంవత్సరంలో ఢిల్లీశ్వరుడగు తుగ్లకు రాజు ఓరుగల్లుపైకి అపారసేనను పంపాడు. ప్రతాపరుద్రుడైదు నెలలపాటు యుద్ధం చేసి తుదకు ఓడిపోయాడు. మహమ్మదీయులు ప్రతాపరుద్రుని బందీని చేసి ఢిల్లీకి పంపారు. అయితే దురదృష్టవశాత్తు ప్రతాపరుద్రుడు మార్గమధ్యలోనే మరణించాడు.

**మ॥వరఢిల్లీనగరంబు రాట్పదముగా భాసిల్లగాఁజేసి యు**
**ర్వరఁ బాలించు మహమ్మదీయు లతి దర్పంబూని హిందుప్రజో**
**త్కరమున్ బాధలఁ బెట్టసాగిరి ధరాక్రాంతి ౯ విజృంభించిరీ**
**భరత క్షోణితలంబుపైఁ బడియె నాపచ్ఛాయ తద్రీతిగ ౯**
**మ॥కొన దుర్గముల నాక్రమించి తురకల్ గోదావరి నవ్వా**
**హిని పర్యంతము సాగివచ్చి రొకచోనే నిల్వగాఁ బోకయాం**
**ధ్ర నృపాలోద్భట యోధవర్గములుపోర ౯ నిల్చి ప్రాణంబులో**
**య్యన నర్పించి రినిల్వరింపగ నసంఖ్యాకారి సైన్యంబుల ౯**
**శా॥వీర స్వర్గమలంకరించె ను మహావీర వ్రజల బాపయి ౯**
**జేరంబోయి మహమ్మదీయ బలవత్సేనాను లాంధ్రేశ్వరా**

**గారం బేకశిలాఖ్య దుర్గమును వీక౯ జుట్టును౯ గ్రమ్మి ప్రా**
**కార ప్రాంగణ భూమిభాగములలో గావించి రావాసము౯**

ఇలా మహావీరుడైన ప్రతాపరుద్రుని వీరగాథను మనకు వివరిస్తారీ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**సీ॥ఎవ్వారిసామ్రాజ్య మేపొంది వ్యాపించె లింగత్రయాంతర్నిషంగపదము**
**ఎవ్వారి యవిరళ స్వేచ్ఛాసిధారకు ద్రావిడభూమి జోతంబు గూర్చె**
**ఏ మహాహవకలాధారముల నెమ్మోల కర్ణాటక క్షోణికైమొగిడ్చె**
**ఏ ధారుణీశుల మేధాప్రసక్తికి నల మహారాష్ట్ర మంజలి ఘటించె**
**గీ॥అట్టి శ్రీకాకతీయ మహాన్వవాయ రాజ్యపాలకులు ప్రకారంబులెన్న**
**నల హరిశ్చంద్ర ముఖనరనాథమణుల సంస్తుతి కిగొల్పుచుండుట సహజ గుణము.**

**చ॥నగరులఁగట్టి కోటలననల్పబలాఢ్యముల౯ రచించివై**
**రి గణము దర్పము౯ దిగిచి, ప్రేమముశాంతియుఁ బాదుగొల్పియే**
**వగపు బ్రజాళికిం గొలుపు భాతులడంచుచుఁ గాకతీయుల**
**త్య గణితసౌఖ్యముల్ ప్రజల కౌవిధిఁబాలన సేసిరుర్వర౯**

ఇలా కాకతీయుల పరిపాలనను మనకళ్ళముందు నిలుపుతారాయన.

**శా॥రామప్పార్య నిరూపితాలయ పుజిత్రంబుల్ గడున్ జిత్రముల్**
**ధీ మద్దర్శిత శిల్పకౌశలము నెంతేదర్శనీయంబనం**
**గా మాతృక్షిత వాసి ధీమణులు వేడ్కంజూచి తద్భంజికా**
**భామల్ పల్కుచుండిరే యను విధిన్ భాషించి రీయుక్తులన్**

కాకతీయుల కాలంలో రామప్ప దేవాలయంతో సహా అనేక దేవాలయాలు నిర్మించారు. వారి కాలంలో సంగీతము, జ్యోతిషము వంటి విషయాలపై అనేక గ్రంథాలను రచించటం జరిగింది. గణపతిదేవుడి సేనాని జాయప "నృత్తరత్నావళి"అనే గ్రంథం రచించాడు. ఈ గ్రంథం నాట్యశాస్త్రం గురించి

వివరిస్తుంది. ఇకవారు పాలంపేటలో నిర్మించిన రామప్ప దేవాలయంలో నృత్య సుందరుల విగ్రహాలు నేటికీ ఆకర్షిస్తూ, కాకతీయుల కళావైభవాన్ని చాటుతున్నాయి. రామప్ప దేవాలయమేగాక వారు నిర్మించిన దేవాలయాలలో శిల్పాలు ఆనాటి శిల్పకారుల అద్భుత శక్తికి, కళాదృష్టికి, సౌందర్యోపాసనకు అద్దంపడుతూ నిలిచి ఉన్నాయి. హనుమకొండలో కాకతీయ రెండవ ప్రోలరాజు కాలంలో నిర్మించబడిన పద్మాక్షిదేవి ఆలయం చెప్పుకోదగినది. ఈ దేవాలయం మొదట జైన మందిరంగా ఉండేది. ఈ జైనమందిరం కాలక్రమంలో పద్మాక్షి దేవాలయంగా మారింది. కాకతీయుల శిల్పానికి గొప్ప నిదర్శనంగా హనుమ కొండలోని వేయిస్తంభాల గుడి కనిపిస్తుంది. రేచర్ల రుద్రసేనానిచే నిర్మించబడిన పాలంపేటలోని రామప్ప గుడి కాకతీయ శిల్పానికి తలమానికమని చెప్పవచ్చును.

కాకతీయులు, వారి సామంతులు కూడా ప్రజాసౌఖ్యానికై మిక్కిలి కష్టపడి వారికి అనేక సదుపాయాలు కల్పించారు. వారి కాలంలో సంస్కృత మును, వేదవేదాంగాలను బోధించుటకు కళాశాలను స్థాపించారు. మఠాలు, సత్రాలు నెలకొల్పారు. వాటికి తగ్గ వనరులు ఏర్పాటు చేశారు. ప్రజల ఆరోగ్య రక్షణకు ఆరోగ్యశాలలు, ప్రసూతిశాలలను ప్రభుత్వం ఏర్పాటు గావించింది. ప్రతి గ్రామ రక్షణ కొరకు వీరభద్రులనే రక్షకభటులను ప్రతి గ్రామంలో నియమించేవారు.

కాకతీయుల కాలంలో చేతిపనులు అభివృద్ధి చెందాయి. ప్రాచీనకాలం నుండి ఆంధ్రదేశంలో నేతపని గొప్ప ప్రసిద్ధిగాంచింది. వెండి, బంగారు, నగల తయారీ ఇనుము, ఇత్తడి, రాగి వంటి లోహాలను ఉపయోగించి ప్రజలకు అవసరమైన వస్తువులు తయారుచేసేవారు. దంతపు పని, లక్కబొమ్మలపని వంటివి కూడా ఉన్నాయి. కాకతీయుల కాలంలో వ్యాపారం గొప్పగా సాగుతుం

దేది. తూర్పుదీవుల నుండి, పశ్చిమప్రాంతాల నుండి వస్తువులు దిగుమతి అయ్యేవి. ఏయే వస్తువులకు ఎంత సుంకము చెల్లించవలెనో ప్రభుత్వం శాసనాలు చేసేది. ఇక్కడకు వచ్చే అత్యధిక సంఖ్యాకులైన నావికులకు ఏ విధమైన ఆపదలు కలుగకుండా చర్యలు చేపట్టేది. వ్యాపార నియమాలను పాటించే విధంగా సేనాని సిద్ధయదేవుడిని నియమించారు. ఇలాంటి వివరాలు వరంగల్ దగ్గరలో దొరికిన ఒక శాసనంలో ఉన్నాయి.

**మ॥గుడికిన్ దీర్చిన ఊలు నల్లనివి తళ్కుల్ బెళ్కులీనాటికే**
**నుడివోజాలని వెన్నోమంటపములం దొప్పారు నాఊల గ**
**న్నడు స్నిగ్ధత్వమె యాలయాల సమతత్త్వంబెంతయున్ జాటు నా**
**గుడి కట్టించిన ధర్మకర్తయెటు వైకుంఠాన నిద్రించునో**

రామప్పదేవాలయం యొక్క నిర్మాణపు గొప్పదనాన్ని వివరిస్తారు జంధ్యాలవారు. అంతేకాకుండా దానిని నిర్మించిన

**మ॥గణప్రత్యాంధ్రమహీశ పాలన మనేకప్రాచ్య విద్యాధిపో**
**షణ భూయిష్ఠముగాగ వర్తిలుటఁ దత్క్ష్మాశాసి శిల్పక్రియా**
**ర్పణమున్‌జేయఁగఁజేసి శిల్పితతిచే రామప్పదేవాలయే**
**క్షణ మత్యంత మవశ్యమై తనర భాస్వత్ శిల్పవిజ్ఞానిక్**

అనేక విద్యల విషయంలోను, వ్యాపార వాణిజ్య విషయాలలోను, దేవాలయాల నిర్మాణంలోనూ, శిల్పకళా నైపుణ్యత విషయంలో కాకతీయులు అత్యంత శ్రద్ధ వహించారు.

**శా॥నీరాగారములో దిగంబరవిధిన్ గ్రీడించు కాంతాళి శృం**
**గారా భోగకళామయాంబరములన్ గన్స్వామికైపట్టి,కా**
**సారప్రోన్నతతీరభాసిమహిరుట్‌శాఖగ్రమందుండిబా**
**లారత్నంబుల గేలిసేయు నరు లీలల్ శిల్పసదృశ్యముల్.**

ఓరుగల్లులో అన్నిరకాల వారు ఉండినట్లుగానే వేశ్యలు ఉండేవారు. అన్ని కులములలో వీరు కనిపించేవారు. వీరంత వేరువేరుగా జీవించేవారు. వేళాకోలా లాడే స్త్రీపురుషులు కనిపించేవారు. ఇట్టివిషయాలన్నీ వినుకొండవల్లభరాయనిచే రాయబడిన "క్రీడాభిరామము"లో కన్పిస్తుంది. ఇట్టి అనేక విషయాలను పరిశోధన గావించి ఈ "ఆంధ్రసామ్రాజ్యము"గ్రంథాన్ని అత్యంత శ్రద్ధతో అందించారు జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

కాకతీయయుగంలో మహారాష్ట్ర నుండి వచ్చి ఈ ప్రాంతంలో శాశ్వత నివాసాలేర్పరుచుకొని తెలుగువారిలో కలిసిపోయారు. కాకతీయుల కాలంలో ఆంధ్రదేశంలో జాతీయ భావ వికాసము కలిగింది. కాకతీ గణపతి దేవుడు ఆంధ్రదేశం అంతా జయించి, ఆంధ్రప్రాంతాలన్నింటిని ఒక్కతాటి మీదకు తీసుకువచ్చాడు. ఈ గ్రంథాల వలన ఒక నూతన చైతన్యం కలిగిందని చెప్పవచ్చు. ప్రతాపరుద్రయశోభూషణము రచించిన విద్యానాథకవి గూడా త్రిలింగదేశమును ప్రత్యేకంగా పేర్కొని దాని యెల్లలను వివరించాడు. ఈవిధంగా జాగృతమైన జాతీయభావమే కాకతీయుల అనంతర కాలంలో ఆంధ్రదేశం మహమ్మదీయుల ఆక్రమణ నుండి పునఃస్వతంత్రమగుటకు మూలమయ్యింది. అఖిలాంధ్ర భావన కాకతీయుల యుగంలో ఏర్పడిందని చెప్పవచ్చును.

**సీ॥ వాడవాడలందు గీర్వాణ భాషాపరిసర్పకమ్ములు పాఠశాలలుండె**
**సర్వశృంగాటక స్థానంబులందొప్పె నఖిలధర్మానువాదశ్రమములు**
**కోనకోనకు నవిజ్ఞాన విచ్ఛేద క దేవపూజలెసంగె దేవళముల**
**సీమసీమకెసంగె శివకేశవాంతర హారక హరిహరాభ్యర్చనములు**
**గీ॥ప్రతిపదమునందు విగ్రహారాధనములు శక్తిపూజలు శ్రీశప్రశంసలమరి**
**ఆంధ్రదేశంబు కాకతీయాభిజాతపాలనముక్రింద నభివృద్ధిఁబడయునాడు**

కాకతీయుల కాలంలో విగ్రహారాధనలను, శక్తిపూజలను, విద్యావిధానాలను భాషాభివృద్ధిని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రతిభావంతంగా వర్ణించి మనకు తెలియజేశారు. ఈ ఆంధ్ర సామ్రాజ్యము గ్రంథాన్ని జంధ్యాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు రెండు భాగాలుగా రాసి వెలువరించారు. ఈ గ్రంథాన్ని ఆయన 1962లో తొలిసారిగా ముద్రించారు. మొదటి గ్రంథంలో క్రీ॥పూ॥221లో శ్రీముఖ శాతవాహనుని కాలం నుండి కాకతీయుల కాలం (క్రీ.శ.992)నుండి క్రీ.శ.1323 వరకు గల ఆంధ్ర రాజ్యచరిత్ర కళావైభవాలను పూర్తిగా వివరించారు. ఇక రెండవ భాగంలో కాకతీయ సామ్రాజ్యానంతరం జరిగిన పరిణామాలు మొదలుకొని విశాలాంధ్ర ఏర్పడిన వరకు గల చరిత్రను మనకళ్ళకు కట్టినట్టు వివరించారు. 1923తర్వాత జరిగిన పరిణామాలు, రాజ్యవంశాల చరిత్ర, రాజ్యాభివృద్ధి ఇలా అనేక అంశాలను చర్చిస్తూ ఆంధ్ర రాష్ట్రోద్యమం, పొట్టిశ్రీరాములుగారి నిరాహారదీక్ష వంటి అంశాలు ఇలా అనేకం ఈ గ్రంథం రెండవభాగంలో చోటుచేసుకున్నాయి.

**మ॥కవితాలోక విహారవాంఛ గొని తత్కౌశల్యమున్ దొల్తగా**
**నవధానంబులజొన్పి, యస్థిరయశోవ్యాసక్తి వమ్మించు స**
**త్కవితాలంకృత కావ్యలేఖనము చిత్తంబుంచి దేశోపయో**
**గ విశేషానుమత ప్రకారముననీ ।కావ్యంబు సంధించితిన్.**

ఇలా చెప్పుకున్నారు జంధ్యాలవారు రెండవభాగం ప్రారంభంలో. అలాగే

**మ॥వరుసన్ డెబ్బదిరెండునేండ్లు గడిచినప్రాయంబునన్ భావవి**
**స్మరణంబేర్పడె నిట్టికాలమున 'సామ్రాజ్యో'రు కావ్యంబుస**
**త్వరమై వెల్వడఁజొచ్చె సుక్తినొ, యతిప్రాసాదులందోయలం**
**కరణ శ్రీవిధి నొతొసంగులయినన్ గావచ్చు క్షంతవ్యుడన్**
**గీ॥సమయపరిశోధనమ్ములు జరుగుకొలది నృపవరుల పాలనాకాల నిర్ణయమున**

**దగిన సవరణ సేయఁగర్తవ్యమైన జలుపఁగాఁబదునంచు, నంజలిఘటింతు**

జంధ్యాలవారు ఈ గ్రంథాన్ని తన 72వయేట ముగించారు. ఆయన ఈ గ్రంథం కోసం విశేష పరిశోధనగావించారని పైన తెలిపినదాన్ని బట్టి మనం గ్రహించవచ్చు. రాజ్యవంశాల చరిత్రల యొక్క కాలనిర్ణయం విషయం ఆయన జాగరూకతతో వ్యవహరించారు. ఇది ఒక పరిశోధకుని కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని అన్నివిధాలుగా పూర్తిచేశారని ఘంటాపథంగా చెప్పవచ్చు.

**మ॥ పెనుగాలంబున శాంతిధర్మమయ పృథ్వీపాలనన్‌జేసి పె**
**ల్చన నయ్యేక శిలాంధ్రరాజ్యపదమున్ శాసించు శ్రీకాకతీ**
**య నృపాలుండు ప్రతాపరుద్రుదు తపోవ్యాసంగమూనెన్ వ్యథన్**
**గొనియన్ భూజనమెల్ల దైవహతమైకూలారె సామ్రాజ్యమున్**

**మ॥అపుడెట్టైన నురాణ్మహేంద్ర వరరాజ్యశ్రీ మహాలక్ష్మికై**
**న,పరాధీనత పెద్దకాలమగుదన్కన్ నిల్వఁగాలేదు కూ**
**నపనాయండను మంచికొండ విభుడున్మత్తారి గర్వాప నో**
**ద పరారంభుడు రాణ్మహేంద్రవర సంతాపంబుగాంచెన్‌వెస**

**మ॥ఘనుఁడాకూనపనాయకుండు పటుసంగ్రామ క్షమానైపుణీ**
**ఖనియౌ ప్రోలయనాయకోత్తముని సఖ్యంబంది సాహాయ్యమున్**
**గనుచున్ రాజమహేంద్ర పత్తన తురుష్కశ్రేణినోడించి క్ర**
**న్నన రాజ్యంబువశంబు సేసికొని సంస్థాపించె శాంతిస్థితిన్.**

**గీ॥స్తవ్యరాణ్మహేంద్రపురికీ శాన్యభాగమందుఁ బదొకండు మైళ్లకు నవలనున్న**
**కోరుకొండ ప్రదేశానఁగోటఁగట్టి యతఁడు పాలించెఁ దత్సీమనర్హసరణి**

అంటూ ఆయన కాకతీయుల అనంతరం జరిగిన పరిణామాలను విశద పరుస్తారు. కాకతీయుల సామ్రాజ్యం నశించిన తర్వాత సుమారొక శతాబ్దకాలం రెడ్డిరాజులు, పద్మనాయక వీరులు తెలుగుదేశంలో చాలాభాగం పరిపాలిం

చారు. కాకతీయరాజ్యం నశించిపోవడాన్ని ఆంధ్ర ప్రజానీకం జీర్ణించుకోలేని స్థితిలో నిరాశకులోనై ఉన్నారు. అటువంటి సమయంలో కాపయనాయకుడు ముందుకొచ్చాడు. ప్రజల్లో నూతనోత్సాహాన్ని నింపాడు. ఇతడు ముసునూరు వంశానికి చెందినవాడు. తెలంగాణలో తురుష్కులపై గెలిచి వారి నుండి రాజ్యాన్ని విడిపించాడు. ఇతనికి వరసకు సోదరుడగు ప్రోలయ నాయకుడు ఉద్యమానికి నాయకత్వం వహించాడు. మహమ్మదీయులు నోడించి ఆంధ్ర ప్రాంతము నుండి తరిమేయాలని ప్రయత్నం ప్రారంభించాడు. ఇతనికి కాకతీ ప్రతాపరుద్రుని సేనానులగు కొలని ప్రతాపరుద్రుడు, అన్న మంత్రి పూర్తిగా తోడ్పాటునందించారు. కాకతీయుల సామంతులనేకమంది ఈ ఉద్యమానికి తోడయ్యారు. వీరందరు ముసునూరి ప్రోలయను తమ నాయకునిగా ఎన్నుకున్నారు. ప్రోలయనాయకుడు క్రీ॥శ॥1325సంవత్సరంలో మహమ్మదీయుల అధికారాన్ని ధిక్కరించి స్వతంత్రతను ప్రకటించి హిందూధర్మాన్ని పునరుద్ధరించాడు. మహమ్మదీయులు బలవంతం తీసుకున్నా అగ్రహారాలను తిరిగి బ్రాహ్మణులకు అప్పగించాడు.

**మ॥ అవనిన్ గాకతిరాజులేలు తరుణంబందాతతా యోధనో**
**త్సవులై డెబ్బదియైదుమంది యధిపుల్ సామంత భూజానులై**
**పవరంబుల్ నడిపించు నాయకులుగా వర్తిల్లిరాకాకతీ**
**య విభుల్ పాయస్వతంత్రులై మెలిగిరాయాప్రాంత భూనాయకుల్**
**మ॥అకటా సర్వమహాంధ్ర భూమితల సౌఖ్యస్థాపనాసక్తమై**
**ప్రకటారంభముసేయు కాకతి మహారాజేంద్రసామ్రాజ్యమే**
**వికలంబయ్యెఁ ద్రిలింగమెట్లు యవనుల్ పీడింపగా నోర్చునాన్**
**సకలాంధ్రుల్ విలపించి రశ్రుకణముల్జాఱెను బ్రవాహంబులై**
**మ॥విపదాప్తిన్ ధృతిమాలి యశ్రువులఁబృథ్విన్ గార్చుటేభావ్యమా?**

**అపచారావహఘోరరూపములు మాయన్జేయ నెవ్వాడగున్**
**విపరీతార్తి పయోనిధిన్గడువఁగా విజ్ఞాతయోజింపఁడా?**
**అపచార ప్రతిభంజనంబునకులేరా! యాంధ్రశూరాగ్రణుల్**
**మ॥అని చింతించెడు నాంధ్రమాత కపుడాయాసంబు దీర్పంగ దు**
**ర్జన దోర్దర్ప విభంజకుండలఘుధైర్యస్థైర్య వారాశియై**
**చను శ్రీప్రోలయనాయకుండు ముసునూర్ సంజ్ఞాన్వయోద్భూతుఁడౌ**
**తెనుగుంజోదు ప్రజాపదంబునిధికిన్ దెప్పయ్యె నానాటికిన్**

ఇలా కాకతీయ సామ్రాజ్య పతనానంతరం జరిగిన పరిణామాలను, ప్రజల పరిస్థితులను, మహమ్మదీయుల వలన ప్రజలనుభవించిన బాధల గురించి నడిచిన ఉద్యమాల గురించి, కాపయనాయకుడు, ప్రోలయనాయకుడు వంటి వారి ధైర్యసాహసాల గురించి, వారు సాధించిన విజయాల గురించి పూర్తిగా వివరించారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ గ్రంథంలో. మూడవ ప్రతాప రుద్రుని శౌర్యవిహారము గురించిన అధ్యాయమొకటి లభిస్తుంది. మూడవ ప్రతాపరుద్రుని కాలం 1344గా జంధ్యాలవారు చూపించారు. అలాగే అతడు మహమ్మదీయులపై సాధించిన విజయాల్ని వివరించారు. ఇక పద్మనాయక వీరుడు రేచర్ల సింగమనాయఁడుగురించిన విషయాలను మనం ఈ గ్రంథంలో చూడవచ్చు.

**మ॥కమనీయంబగు రాచకొండ ఘనదుర్గంబందు వర్తిల్లుని**
**స్సమ శౌర్య ప్రథమాన చండతరదోస్సారుండు రేచర్ల సిం**
**గమనాయుండటఁ గాకతీయ కుశలక్ష్మాపాలవర్యాధికా**
**రము ధిక్కారమునేసి క్రుమ్మఱె స్వతంత్ర ప్రాభవోన్మేషియై**

అంటూ రేచర్ల సింగమనాయఁడుగురించి తెలుపుతారు.

**మ॥పెనుగాలంబు నుండి భారత మహాపృధ్వీతలావాసిస**
**జ్జన సందోహము వేదధర్మ సరణీ సంబద్ధ శీలంబునన్**
**దనరెన్ దత్స్థితి యొప్పెనాంధ్రమున వ్యాప్తంబై సహస్రాబ్దముల్**
**చని పై నిర్వది వత్సరంబులరుగన్ శైవంబుమొల్చెన్ భువిన్**
**గీ॥పూర్వచాళుక్య సామ్రాజ్యమునకు మున్ననమ్రుడైయటుపైస్వతంత్రతనుగొన్న**
**రాజరాజేంద్రవిష్ణువర్ధనవిభుండుశైవమతముననభిమానశాలియయ్యె**
అని శైవమతము గురించి, ఇతర మతాల గురించిన సమాచారమందించారీ గ్రంథంలో.
**గీ॥అవలఁ బదమూడు నూఱులు నరిగి నాల్గుపదులు నాల్గవదైన యబ్దంబునుండి**
**ముప్పదాఱేడ్లు తత్సింగభూపునాత్మ జాతుఁడనపోతవిభుడు భూసాధ్వినేలె**
**మ॥స్తవనీయుండన పోతభూవరుడు, మాదానాయకాఖ్యానుజుం**
**డ విభేద్యాలఘు బాహుసత్వమునఁదోడై, యూంతగావింప శా**
**త్రవులన్ గూల్చి తిలల్ తనూరుధిరధారన్ జోపుచున్ దండ్రికిన్**
**గవియన్ దర్పణమున్ విడన్దలచి,తాకన్ బోయిరయ్యుర్విపై**
1348ప్రాంతం కొండవీటి రెడ్డి వంశము స్థాపించబడింది. ఈ వంశాన్ని స్థాపించినవాడు ప్రోలయ వేమారెడ్డి. ఇతని పూర్వీకులు బహుశా వ్యవసాయం చేసినవారై ఉంటారని పరిశోధకులు భావిస్తారు. ఇతని తండ్రి ప్రోలయరెడ్డి. తాత వేమారెడ్డి. వేమారెడ్డి కాలంలో వ్యవసాయవృత్తిని విడిచిపెట్టి ఖడ్గాన్ని ధరించారు. ఈ వేమారెడ్డి కాయస్థ వంశజుడైన అంబయ వద్ద ఒక దేవుని సేనానాయకుడిగా పనిచేశాడు. బహుశః ప్రతాపరుద్ర భూపతి సేవించిన వారిలో ఇతడు ఉండి ఉండవచ్చునంటారు పరిశోధకులు.

ప్రోలయవేమారెడ్డి అనంతరం (1353–1364)ఇతని దత్తపుత్రుడు అనపోతారెడ్డి రాజ్యాధికారం చేపట్టాడు. ఆనాటికి రాజమహేంద్రవర రాజ్యాన్ని

పాలించిన తొయ్యేటి అనపోతనాయకుడు మరణించాడు. ఈ అనపోత నాయకుడు కాపయనాయకుడి బంధువు. ఓరుగల్లు రాజ్యమునకు తానధిపతి అయిన తర్వాత ఇతడు రాజమహేంద్రవరానికి తన ప్రతినిధిగా నియమించాడు.

**మ॥అనపోత క్షితిజానియంత నిజరాజ్య వ్యాపనాలోలుడై**
**తనతమ్మున్ గణనీయ శౌర్యనిధి మాదా నాయకున్ గూడిచ**
**య్యన వేవేలుగా లెక్కసేయనగు యుద్ధాభ్యర్హ యోధాళితో**
**ఇనుకుర్త్యాహ్వయదుర్గమున్ గెలువఁగా నేతెంచె నుత్సాహియై**

ఇతను రాజ్యవిస్తరణగావించి యుద్ధములు చేశాడు. ఇనుకుర్తి దుర్గాన్ని జయించాడు.

అనపోతనాయకుడు మరణించిన పిదప అనవేమారెడ్డి రాజ్యాధికారానికొచ్చాడు. అనపోతారెడ్డికి కుమారగిరి యను పుత్రుడున్నాడు. కుమారగిరి సోదరియగు మల్లమాంబను కాటయవేమారెడ్డియను గొప్ప వీరుడు వివాహమాడాడు. ఇతడు సహజంగానే కుమారగిరి పక్షమే వహించాడు. కాని కుమారగిరిరెడ్డి అల్పాయుస్కుడగుటవలన రాజ్యం శత్రుబాధలకు గురైంది. ఇటువంటి సమయంలో రెడ్డివీరులలో మహావీరుడైన అనవేమారెడ్డిని రాజుగా ఎన్నుకున్నారు. అనవేమారెడ్డి అనపోతారెడ్డికి సోదరుడు అవటం వల్ల ఎవరూ అభ్యంతరం పెట్టలేదు.

**సీ॥విమలిన రేచర్ల విక్రమాదిత్యుండు గోనమల్లేభ పంచాననుండు**
**మంగళపూడి యిమ్మడిరెడ్డి సంపాతి రావు వరపు మల్లరాడ్విమర్ది**
**నృపమాన్య పోలరాణ్ణి ర్ధామధాముండు వినుకొండ రామాహి విహగరాజు**
**అలఘుకుంట్లూరు ఘోరాటవీ దావాగ్నిబండి కోటోగ్ర గర్వప్రహారి**
**గీ॥అరవవల్లీశగౌరరాడాత్మగర్వచండతిమిరాంతమార్తాండమండలంబు**
**ఆంధ్రమాతృ విశాల యశోనురాగపూతగుణఖని యనపోతభూమిజాని**

ఇలా రెడ్డి రాజుల గురించిన వివరాలను వివరిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఇలాంటి వివరాలనేకం మనకీ గ్రంథంలో లభిస్తాయి.

**సీ॥పలుచీలికలుగాగ బ్రద్ధలైయున్న చింపిరి వల్వలను నరమేనఁదాల్చి**
**ఆకలి జంపగా నైనంత భోజ్యంబు దొరుకమింజేసి యెంతొకృశియించి**
**సిరితోడఁ దులదూగు నరులగేహంబుల వేమాఱు ప్రార్థించి విసుగుచెంది**
**పూటకు నొక్కింత బోనమ్ము గుడిపించి కొలువొందువారి కైతలఁచి తలఁచి**
**గీ॥హస్తినాపుర వీధుల నటమటించి నిత్యసేవావిధిన్ మనన్ నిశ్చియించి**
**హసనభిఖ్య మహమ్మదీయార్భకుండు గది సెనొకవేళఁదత్కళాస్ఫదుని శాల**

కాకతీయ రాజ్యపతనానంతరం క్రీ.శ.1325/6 ప్రాంతంలో ఢిల్లీ సింహాసనాన్ని అధిరోహించిన మహ్మద్ బీన్ తుగ్లక్ ఆధీనంలోకి దక్షిణాపథమంతా వచ్చింది. తెలంగాణ పశ్చిమోత్తర ప్రాంతంలో బహుమనీషా వంశీయుడయిన హసన్ గంగు ఢిల్లీ చక్రవర్తియైన మహమ్మద్‌బీన్ తుగ్లక్ మీద తిరుగుబాటు చేసి క్రీ.శ.1341లో దౌలతాబాద్ రాజధానిగా బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. అదే సమయంలో తెలంగాణను ముసునూరి వంశస్థుడైన కాపయనాయకుడు పాలిస్తున్నాడు. తిరుగుబాటు సమయంలో కాపయ సహాయం చేశాడు. దీనివల్ల నష్టమే జరిగింది. సుదీర్ఘకాలం తెలంగాణకు పక్కలో బల్లెంలా తయారయింది. బహమనీ రాజ్యం అనేకసార్లు తెలంగాణమీద దండయాత్ర చేసింది. క్రీ.శ. 1350ప్రాంతంలో హసనుగంగు దండయాత్ర చేసి కౌలాస్(నిజామాబాద్ జిల్లా)దుర్గాన్ని ఆక్రమించాడు. పానగల్లు కోటను ఆక్రమించి వాడపల్లి దాటి అమరావతి దాకా ఆక్రమించాడు. నీలగిరి కోటను కూడా ఆక్రమించాడు. (నీలగిరి అప్పటి నుండి నల్లగొండ అని పిలువబడింది)కాపయ ఇరు రాజ్యాలకు గోల్కొండ సరిహద్దుగా ఉండే విధంగా సంధి చేసుకున్నాడు. క్రీ.శ.1356లో రెండోసారి దండయాత్ర చేసి భువనగిరి దుర్గాన్ని ఆక్రమించాడు. హసన్‌గంగు

తన రాజధాని దౌలతాబాద్ నుండి గుల్బర్గాకు మార్చాడు. తన రాజ్యాన్ని గుల్బర్గా, దౌలతాబాద్, బీదర్, బీరార్ అనే నాలుగు రాష్ట్రాలుగా విభజించాడు. ఇతని రాజ్యం ఉత్తరాన మాండు  వరకు, దక్షిణాన రాయచూరు, పడమట గోవా, తూర్పున భువనగిరి సరిహద్దులుగా ఉండేది.

ఇతని తర్వాత ఒకటవ మహ్మద్‌షా (క్రీ.శ.1358-1375), ముజాహిద్‌షా (1375-78) రెండవ మహ్మద్‌షా క్రీ.శ.(1378-1379)ఫిరోజ్‌షా (1397-1422) అహ్మదుషా (1422-1436)అల్లావుద్దీన్ అహ్మద్‌షా-2 (1436-1458)హుమాయున్ క్రీ.శ.1458-1461 నిజాంషా (1461 -1463)3వ మహమ్మద్‌షా (1463-1483), మహమూద్‌షా (1482 -1518)లు క్రమంగా బహమనీ రాజ్యాన్ని పాలించారు.

**మ॥పదియున్ మూడు శతాబ్దముల్ నలువదిపై మూడుసంవత్సరాల్**
**గదియన్ దక్షిణహిందూదేశ మహిథక్ష్మాపాల సౌహార్దసం**
**పదనార్జించి బలాఢ్యుడై హసను సస్వాతంత్ర్య భూపాలనా**
**భ్యుదితేచ్ఛున్ జని చక్రవర్తి కవిధేయుండై మనన్ నూల్కొనెన్**
**గీ॥కలుబరిగి పత్తనంబున నెలవుసేయఁ బరిగి యవ్వీటిని హసనాబాదనంగ**
**నామమునఁ బిలిపించెజనంబు చేత జలిపె నూతన రాజ్యస్థాపనంబు**

ఇలా బహమని సుల్తానుల ఏలుబడిని,వారాక్రమించిన దుర్గాలను గురించి, వారి రాజ్యం విస్తరించిన తీరును గురించి వివరించారీ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

అలాగే తర్వాతికాలంలో మహమ్మద్‌షా పరాజయం గురించి వివరాలు ఈ గ్రంథంలో లభిస్తాయి. గోల్కొండ కోటను కోల్పోటం, అనపోత మాధవుని పరిపాలన గురించి, రెండవ సింగమనాయుడు గురించి ఈ గ్రంథంలో చేర్చారు జంధ్యాలవారు.

**చ॥విడువక వేదగిర్యధీపు వీరకుమారుడు రామచంద్ర నా**
**యుడు తెలుగుంజమూపతుల యందున ముఖ్యుడటన్ ఫిరోజి వెం**
**బడిబడి సైన్యమున్ దటిమి,వాని వజీరగు మీరు ఫైజు లా**
**మడియంగజేసి, బండికనుమన్ బలుబాధలు పెట్టెనాతనిన్**

బహుమనీ ఫిరోజ్‌షా పానగల్లును ముట్టడించడానికి తీవ్ర ప్రయత్నం చేశాడు. మహావీరులైన పద్మనాయకవీరులు ప్రతిఘటించి పోరాడారు. చివరకీయుద్ధంలో విజయం పద్మనాయకులకే దక్కింది. చేసేదిలేక ఫిరోజ్‌షా పారిపోయాడు. ఈ విషయాలను జంధ్యాలవారీ గ్రంథంలో వివరించారు.

ఇంకా రావుమాధవరావు గురించి, ఇతర పద్మనాయకుల గురించిన సమాచారము ఈ గ్రంథంలో చూడవచ్చు.

**మ॥తెనుగుంగైతకు వన్నెదెచ్చి రసవృత్తిన్ జేసియే శబ్ద జీ**
**వనమంచున్ మహదాంధ్ర, లోకమునకున్ స్పష్టంబు గావించుచున్**
**వనజాక్షున్ మదినుంచి భాగవతమున్వ్రాసెన్ సుధీసమ్మతం**
**బనంగన్ బమ్మెరపోతరాజతని యాఖ్యానంబు శ్రావ్యంబగున్**
**సీ॥జనియించెనెవ్వాడు సరసధీరావాస బమ్మెరా భిఖ్యపురమ్మునందు**
**వసియించె నెవ్వాడు పండిత ప్రముఖుడై శ్లాఘనీయైక శిలాపురాన**
**విలిఖించె నెవ్వాడు వేశ్యకళాలీల దనరార భోగినీ దండకంబు**
**భూషించె నెవ్వాడు భూరినియోగి సద్వంశ కౌండిన్య గోత్రంబునందు**
**గీ॥శుద్ధచరితుడాపస్తంబ సూత్రశాలి ఆర్యకేసనకున్ లక్క మాఖ్యసతికి**
**సుతుడు శ్రీతిప్పరాయని సోదరుండు పూజ్య కవిరాజు బమ్మెరపోతరాజు**

ఇలా బమ్మెర పోతన గురించి రాసి ఆ మహాకవి యెడల తనకు గల భక్తి గౌరవాలను చాటుకున్నారీ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అంతేగాకుండా తెలుగు భాషకు బమ్మెరపోతన చేసిన మహాసేవను

కొనియాడతారాయన.

**కll తెలుగుభువిఁ బుట్టినావు తెలుగుంగవనంబు సెప్పదిట్టవు తెలుగున్**
**బలుకుల భాగవతంబును విలిఖింపుము నాకు బ్రీతివెలయింపంగన్**
**కll అని పలికిరామభద్రుడు క్షణమున ననవేక్ష్యుడయ్యెఁ గవిరాజెటిగెన్**
**తెనుగున భాగవతమునుడి తనకు సమర్పింపరామ దైవాజ్ఞయనన్**
**గీll బమ్మెరాన్వయ కవిరాజు వ్రాసినట్టి ఆంధ్రభాగవతాశ్వాసగాంత్య గద్య**
**వితతియందున సహజ పండితుడనంగ బలుకునేగాని యిట్టు లెవ్వడులిఖించె**

ఇలా సరళ సుందరంగా రచనగావించారు జంధ్యాలవారు. ఆయన బమ్మెర పోతన గురించి రాసిన ప్రతిపద్యంలోను మనకు బమ్మెరపోతన దర్శనమిస్తాడు. అంతేగాకుండా తెలుగుభాషను అభిమానించే ప్రతి ఒక్కరికి పోతన పట్ల భక్తి గౌరవాలు పెరిగేటట్లుగా జంధ్యాలవారు పోతన గురించి రాశారని ఘంటా పథంగా చెప్పవచ్చు.

**ఉll కాటుక కంటినీరు చనుగట్లపయిన్ బడనేల నేడ్చె దో**
**కై టభరాజమర్దనుని గాదిలికోడల యోమదంబ యో**
**హాటక గర్భురాణి నిను నాకటికిన్ గొనిపోయియల్ల క**
**ర్ణాటకిరాట కీచకులకమ్మఁ ద్రిశుద్ధిగనమ్ము భారతీ**
**ఉll పండిత కీర్తనీయుడగు బమ్మెరపోతన, యాసుధాంశు మా**
**ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్లభోగినీ**
**దండకమున్ రచించె బహుదాన విహర్తకు, రావుసింగ భూ**
**మండల భర్తకున్ విమత మానవ నాధమదాపహర్తకున్**
**సీll కరతలామలకమై క్రాలె వేదాంత విద్యావిశేషంబు పోతన్నకవికి**
**పెరటికల్పకముగా విలసిల్లె సహజాత్త పాండితి బమ్మెర పండితునకు**
**అపృథక్ప్రయత్న సమాయాతకవికైయంత భాగవతబద్ధోద్యమునకు**

**సర్వాంధ్ర లక్షణసారంబు సత్కవివరునకు జిహ్వాగ్రవాగ్లతాంగి**
**గీ॥కృత్రిమయశస్సమార్జన ప్రియనరేంద్ర శాసనమునకు వెఱవని సాహసికుడు**
**సర్వశుభకర,శంభు పూజారతుండు పూజ్యకవిరాజు బమ్మెరపోతరాజు**

ఇలా తెలుగు భాగవత సృష్టికర్త బమ్మెర కవిరాజును కొనియాడతారాయన. ఈ గ్రంథంలో లింగమనాయని శౌర్యప్రతాపాల గురించి కూడా ఒక అధ్యాయంలో వివరిస్తారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**మ॥నవ సారస్వత ధీరమూర్తి యయి నానాశాస్త్రవిజ్ఞాతయై**
**కవిరాజేంద్ర గజాంకుశంబనగ సత్కావ్యంబు వ్రాసెన్ యశ**
**శ్శివమేపారవిశుద్ధభక్తిఁజలిపెన్ శ్రీరంగ మాహాత్మ్యమున్**
**బ్రవిశుద్ధాంధ్ర వచోవిలాసముల సారస్యంబు వ్యక్తంబుగాన్**

అంటూ భైరవకవి గురించి తెలుపుతూ ఆయన రాసిన "శ్రీరంగ మహాత్మ్యము"గూర్చి తెలుపుతారు. గొప్పకావ్యసృష్టి గావించారని కొనియాడతారు జంధ్యాలవారు. కవుల పట్లవారు రాసిన కావ్యాల మీద గురించి అమితాభిమానాన్ని ఆయన చూపిస్తారు.

**సీ॥చల్లదనంబు నిష్పంద హిమాంశుని బింబము నైజమై వెలయునేని**
**ఉష్ణతాధిక్యంబు నుష్ణాంశు మండలం బందుండు ననుట సత్యంబుయేని**
**ప్రోత్తుంగ పర్వత భూములన్ జనియించి ఝరి నిమ్న మార్గానఁ బొరలునేని**
**ఉత్తంగ భూమీ ధరోద్వేల భారంబు వహియించు టుర్వి స్వభావమేని.**
**గీ॥రాట్పదంబది రాజపర్యాయమేని అన్యశాఖల వారి యైక్యంబునొంది**
**చాల కాలంబు నాంధ్రోర్వి నేలుకొనినవారలగు రెడ్లు క్షాత్రాంశభవులు నిజము**

ఇలా రెడ్డిరాజుల పరిపాలన గురించి సవివరంగా తెలుపుతారాయన. అలాగే రెడ్డిరాజుల వంశ చరిత్రను ఈ గ్రంథం ద్వారా మనం తెలుసుకోవచ్చు. అలాగే కోరుకొండ దుర్గం యొక్క చరిత్రను కూనరెడ్డి గురించి వారి పరాక్రమాల

వారి పరిపాలనా విధానం గురించి కూడా మనమీ గ్రంథం ద్వారా తెలుసుకోవచ్చును.

**ఉ॥ప్రాజ్య వసుంధరావలయ భాగ్య వర్ధక కాకతీయ సా**
**మ్రాజ్యము వైరి పాలబడి బాములకున్ గుఱియైన నాడు సం**
**పూజ్య సమీక కౌశల విభూషిత దోర్బలులైన బుద్ధి స**
**త్వోజ్యులురెడ్డిసైన్యపతులేగి జయించిరి పెక్కు సీమలన్**

ఇలా కొండవీటి రెడ్డిరాజుల గురించి తెలుపుతారాయన. దేసటి వేమారెడ్డి (1324-1350)అలాగే వేమారెడ్డి విద్యాభిమానాన్ని, అనపోత భూపాలుడు (1350-1362)గురించి, నాటి సముద్ర వర్తక వాణిజ్యాల గురించి తెలుపు తారు ఈ గ్రంథంలో జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**మ॥అనపోతక్షితి పాలపుత్రకుని ప్రాయంబూనమై యుంట నా**
**మనుజాధీశుని తమ్ముడైన యనవేమారెడ్డి ఱేడయ్యె నా**
**జనపాలుండును నన్నవోలె సముదంచద్ధర్మ సంసక్తుడై**
**ఘనదోర్దర్పము శౌర్యమున్ వెలయఁగాఁ గావించె భూపాలనన్**

అనవేమభూపాలుని శౌర్యప్రతాపములను గురించి, అతని పరిపాలన గురించి వివరిస్తారాయన. అనవేముడు విద్యాభిమానాన్ని తెలుపుతారు. ఇంకా కుమార గిరిరెడ్డి 1383-1400), పెదకోమటి వేమరాజు (1400-1200)అతని సాహిత్యాభిమానాన్ని అతని పాలనా వైభవాన్ని ఈ గ్రంథంలో మనం చూడవచ్చు.

**మ॥తెలుగుఁదేశము రెడ్డిరాజులకు స్వాధీనంబునందుండఁగా**
**జెలగెన్ సంగరమ్ములు, తనర్చెన్ బెక్కులాఖ్యానముల్**
**తెలుగుంబల్కువెలంది రాజసభలన్ ధీమత్పరివ్యాప్త సం**
**స్థలలోనన్ నటనంబుఁజేసె రసరాజత్కావ్య రూపంబులన్**

**మ॥అవనీనాథుల కొల్వులందలరు విద్యానాథ సంఘంబులన్**
**గవిరాజున్ బుధశేఖరుండయిన శ్రీనాథుండు సంస్తవ్యుడై**
**నవకావ్యప్రతిలేఖనాచతురుడై నానా ది శాయాత ధీ**
**రవరేణ్యాభినుత ప్రభావధురుడై రాజిల్లె, c(బజ్ఞాధృతిన్**

రెడ్డిరాజులనాటి సమాజాన్ని, వారి పాలనాకాలపు వైభవాన్ని తన కావ్యాలలో నిక్షిప్తం చేసి అందించిన కవివరేణ్యుడు శ్రీనాథుడు. అతని కవితాధారలు తెలుగు సాహిత్యానికి హారతులద్దాయి. ఆ మహాకవిగురించి మనమీ గ్రంథంలో చూడవచ్చు. శ్రీనాథకవి సార్వభౌముని పట్ల తనకు గల అపారమైన అభిమానాన్ని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ గ్రంథంలో మనకు చూపించారు.

**మ॥ఘనకర్ణాటక రాజ్యపాలన కలాకౌశల్యధాముండు శౌ**
**ర్యనిధానుండగు దేవరాయలు మహారాయండు ధీరాళి మ**
**న్నన గావించెడివాడనంగ విని శ్రీనాథుండువేమావనీ**
**శుని విద్యానిధి, దేవరాయ సభన్‌జూడన్ వేడ్కతోన్.**

**శా॥నానాశాస్త్ర పురాణ రాజకలితాంతర్భావ నిర్ధారణ**
**జ్ఞానోదార చరిత్రుడన్ రసఝురీ సంభావ్య సత్కావ్య ని**
**ర్మాణ ప్రౌఢమతి ప్రభాసితుడ వేమక్ష్మావరానంద దా**
**స్థానాభ్యర్హ కళాధికార రచనాదక్షుండ, శ్రీనాథుడన్.**

**గీ॥అనివచించినవెన్కరాజాధిరాజుదేవరాయలుశ్రీనాథధీరమణికి**
**వసతిగల్పించి,కొన్నాళ్ళువసతిసేయదగునటంచానతిడెరాజధానియందు**

దేవరాయల కీర్తిని గురించి, అతను చేసే సాహిత్య సేవాతత్పరతల గురించి విన్న శ్రీనాథుడు దేవరాయలను కలవాలని ఉత్సాహంతో విజయనగరం చేరుకోవడం, అక్కడ శ్రీనాథుడి వివరాలు తెలుసుకొని దేవరాయలు అతనికి తగిన వసతి కల్పించి ఆదరించిన ఘట్టాలను మనకు చూపిస్తారు జంధ్యాల

సుబ్రహ్మణ్యశాస్త్రిగారీ గ్రంథంలో.

**సీ॥కవిసార్వభౌమ సంకలితకావ్యంబులన్ సత్కవుల్‌చదివి ప్రశంస సేయ**
**లలిత శబ్దార్థగాలంకారవిదుడని సాహిత్యవిదులు భాషణము సేయ**
**సర్వాగమజ్ఞాన సంయుతుండితడని షడ్దర్శనీవిదుల్ స్తవముసేయ**
**వేదార్థసార సంవిన్మూర్తియితడని సర్వవేదజ్ఞులాశీర్వదింప.**
**గీ॥ఉద్భట వివాద రచనాసముద్యమమున గాంశ్యఢక్కావిదారణ ఘటకుడంచు**
**సర్వపండితమండలి సన్నుతింప నొప్పె స్వర్ణాభిషేకమహోత్సవంబు**
**గీ॥మాన్య కవిసార్వభౌముని మస్తకంబు తివిరిదీనార టంకాలఁదీర్థమాడు**
**సమయమున మంజుపుష్ప వర్షంబుగురిసె ధన్యవిన్యస్త మంత్రాక్షతలుజెలంగె**

కవులు, పండితులు, వేదాంతవేత్తలు శ్రీనాథుడి రచనలు చదివి ప్రశంసించిన విషయాన్ని, ఆయన్ను ఘనంగా సత్కరించిన విషయాన్ని వివరిస్తారీ "ఆంధ్ర సామ్రాజ్యము"గ్రంథంలో జంధ్యాలవారు

**మ॥త్వరమై వేమనృపాల శేఖరుడున్ స్వప్రాంత సంసృష్ట సుం**
**దర హర్మ్యంబును జూపి యభ్యుచిత సత్కారంబు గావించి యా**
**దర దృష్టిం బరికించుచున్ దృఢ సుహృద్భావంబు జూపించి క్ర**
**మ్మఱఁ గర్ణాటక భూమిజాని కడకుంబంపించె నాశిల్పులన్.**
**గీ॥శిల్పితతి కొండవీటికి జేరి నూత్న సౌధరాజంబు నరసి యాశ్చర్యకారి**
**హర్మ్య కల్పన కలరి రాయలకు దెల్పుటెరిగి శ్రీనాథసుకవి యాహ్లాదమందె.**

తిరిగి శ్రీనాథుడు విజయనగరం నుండి కొండవీడు చేరుకోవడం, తాను చూసిన ఒంటి స్తంభము మేడ వంటి విశేషాలు, విజయనగర కళావైభవములు, తాను పొందిన సత్కారాలను, అక్కడ వారు చూపిన ఆదరమును కొండవీటి ప్రభువు వేమభూపాలునికి వివరించడం వంటి సన్నివేశాలను మనమీ గ్రంథంలో చూడవచ్చు.

**సీ॥అభినవభట్ట భాణాభిఖ్య బిరుదాంకశాలి వామనభట్టు సాక్షిగాగ**
**ధీర వామనకృత వీరనారాయణ చారిత్ర కావ్యంబు సాక్షిగాగ**
**సత్కవి శ్రీనాథ సంధిత పోనుపల్లి శాసనాక్షర రాజి సాక్షిగాగ**
**వివిధ దేశాయాత విబుధేంద్ర కృతి విమర్శన సత్క్రియాలీల సాక్షిగాగ**
**గీ॥పెద్దకోమటి వేమభూవిభున కలరె నర్వ సర్వజ్ఞ బిరుదాంకమనెడు మాట**
**ధృవపడుచునుండనేటికాందోళనంబు? కలిగియుండ మికేటి సాక్ష్యంబు కలదు**
**గీ॥భవ్య"సర్వజ్ఞ"బిరుద విభసమాన రావుసింగమహీపాలు రాజసభకు**
**రాజశాసిత కార్యాంతరమునఁ జేసి యపుడు శ్రీనాథకవిమౌళి యరుగుదెంచె!**
**గీ॥చటులవిబుధ ప్రదీపితాస్థానమగుట సింగమహీపాలు ప్రాంగణమున**
**వెలసియుండిన శారదా విగ్రహంబు మ్రోల శ్రీనాథుడీపద్యము బఠించె**
**సీ॥దీనారటంకాల తీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల**
**బలుకుతోడై తాంధ్రభాషా మహాయోష నైషధగ్రంథ సందర్భమునకు**
**పగులగొట్టించి తుద్భటవివాద ప్రౌఢిగౌడడిండిమభట్టు కంచుఢక్క**
**జంద్రభూష క్రియాశక్తి రాయలయొద్ద బాదుగొల్పితి సార్వభౌమ బిరుద**
**గీ॥మెటుల మెప్పించెదో నన్ను నింకమీద రావుసింగమహీపాలు ధీవిశాలు**
**నిండుకొలువున నెలకొని యుండినీవు సకల సద్గుణనికురుంబ;శారదాంబ**

శ్రీనాథుడుసర్వజ్ఞ సింగభూపాలుని దర్శించటం, తాను పొందిన సత్కారాలను, బిరుదములను సింగభూపాలునికి వివరించడం వంటి అనేక విషయాలను వివరిస్తారు జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

రాచ వేమారెడ్డి పరిపాలనా వైభవాన్ని మనం ఈ గ్రంథంలో చూడ వచ్చు. రాచవేమారెడ్డి 1420–1424మధ్యకాలంలో కొండవీటిని పరిపాలిం చాడు. అలాగే కందూరిరెడ్ల వంశాల గురించి ఈ గ్రంథం ద్వారా తెలుసు కోవచ్చు. మల్లారెడ్డి వంశ చరిత్ర, కాటయ వేమభూపాలుడు (1386–

1400)గురించి కూడా వివరించారు జంధ్యాలవారు.

**సీ॥సన్నుతాభిజ్ఞాన శాకుంతలాంతర బహురసాశయముల బయలుపఱచె**
**అభిగేయమాళవికాగ్ని మిత్రాహ్వాయ నాటకాంతరరుచుల్ తేటపఱచె**
**ప్రోన్నతాశయ విక్రమోర్వశీయాభిఖ్య నాటకరసగుంభనంబు దెలిపె**
**గ్రంథవాగ్ వ్యాఖ్యాన కలితోక్తుల వసంతరాజీయసూక్తి దిరంబుసేసె.**
**గీ॥భళిర! కాటయ వేమభూపాలమౌళి స్వయముగా నాంధ్రవేదభాషా ప్రపంచ**
**మహిమవర్ధన గ్రంథ నిర్మాతయయ్యె యందఱట్లున్న నెటులుండు నాదిభాష**

కాటయవేమభూపాలుడు భాషా,సాహిత్యాలను అభిమానించిన తీరు, అతడు చేసిన దానధర్మాల గురించి వివరించారాయన. ఇలా ఈ గ్రంథ:లో సాహిత్యాన్ని అభిమానించిన ప్రభువులకు అత్యంత ప్రాధాన్యతనిచ్చారాయన.

రాజమహేంద్రవరపు ప్రభువులు కూడా పండితులను, కవులను పోషించి సాహిత్య సృష్టికి విశేష కృషి సల్పారు. వీరి కాలంలో శాస్త్ర గ్రంథాలు, వ్యాకరణము, జ్యోతిషము, గణితం, మీమాంస, వంటి అనేక గ్రంథాలు రచించబడ్డాయి. జ్యోతిషశాస్త్ర పండితులు రెడ్డిరాజులచే సన్మానాలు అందుకున్నారు. నన్నయ బాటలో నడిచిన కవులు పురాణాలను, ఇతిహాసా లను సంస్కృతం నుండి తెలుగు భాషలోకి అనువదించారు. రెడ్డి రాజుల కాలంలో అనేకమంది తెలుగు కవులు తమ రచనలు అందించారు. ఎఱ్ఱాప్రగడ భారతంలోని అరణ్యపర్వాన్ని, లక్ష్మీనరసింహపురాణము, రామాయణము, హరివంశము వంటి గ్రంథాలు రచించాడు. ఎఱ్ఱాప్రగడ ప్రోలయ వేమ భూపాలునిచే ఘనసత్కారాలందుకున్నాడు. బమ్మెరపోతన, కవిసార్వభౌముడు శ్రీనాథుడు వంటి మహాకవులు రెడ్డిరాజుల కాలంలోనివారే. శ్రీనాథుడు విజయనగర రాజులచే స్వర్ణాభిషేకం పొందాడు. శ్రీనాథుడు కొండవీటి రెడ్డి ఆస్థానంలోను, అటు తర్వాత రాజమహేంద్రవరపు రాజుల ఆస్థానంలోనూ

ఉన్నాడు. శ్రీనాథుడు హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, నైషధము వంటి గొప్ప గ్రంథాలు రచించాడు. నైషధము పెదకోమటి వేమారెడ్డి వద్ద మంత్రిగా ఉన్న మామిడి సింగనమంత్రికి అంకితమిచ్చాడు. హరవిలాసము అవచి దేవయ తిప్పయ అనే వాణిజ్యవేత్తకు, భీమఖండాన్ని వీరభద్రారెడ్డి వద్ద మంత్రిగా ఉన్న బెండపూడి అన్నయమంత్రికి అంకితమిచ్చాడు. ఇదిగాక శ్రీనాథుడు అనేక కృతులు రచించాడు. పెదకోమటివేమారెడ్డి శ్రీనాథుణ్ణి విద్యాధికారిగా నియమించుకున్నాడు. ఇంకా రెడ్డిరాజుల కాలంలో వెన్నెలకంటి సూరన, అనాంతా మాత్యుడు, విన్నకోట పెద్దన, నిశ్శంక కొమ్మన, రావిపాటి త్రిపురాంతకుడు, వినుకొండ వల్లభరాయుడు, మడికి సింగన వంటి కవులు జీవనం సాగించి గొప్ప రచనలు చేశారు. ఈ కవులను రెడ్డిరాజులు, వారి సామంతులు పోషించారు. హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్ర అను ద్విపద కావ్యాలను రచించిన గౌరన పద్మనాయకుల ఆస్థానంలో ఉన్నాడు. రెడ్డిరాజుల కాలంలో అష్టావ ధానాలు, శతావధానాలు వంటివి విరివిగా జరుగుతుండేవి. రెడ్డిరాజుల కాలం లో అనేక రంగాలలో విశేష అభివృద్ధి జరిగింది. ఇటువంటి అనేక విషయాలను జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "ఆంధ్రసామ్రాజ్యము" గ్రంథంలో వివరించారు.

అల్లాడరెడ్డి పూర్వీకుల (1416–1426)చరిత్ర వంటిది కూడా ఈ గ్రంథంలో ఇచ్చారాయన. అలాగే అల్లాడ వేమభూపతి, వీర భూపతి (14 26–1450)వంటి ప్రభువుల గురించి కూడా మనం తెలుసుకోవచ్చు.

**మ॥అలరించెన్ గులదైవతంబయిన దక్షారామ భీమేశు ని**
**ర్మల పుష్పార్చనచేసి తానుపశమింపన్‌జేసె సీమాద్రి క**
**వ్వలిధ్వాంతంబు యశఃప్రభాదవళి మన్‌బర్వించి,శ్రీబెండపూ**
**ద్యలఘు శ్రీయుతవంశవార్ధి శశి యన్నామాత్యుండత్సంతమున్**

అల్లాడ వీరభద్రునివద్ద మంత్రిగా విధులు నిర్వహించిన బెండపూడి అన్నామాత్యుని గురించిన పలు విషయాలు ఈ గ్రంథంలో లభిస్తాయి. అలాగే ఆ ప్రభువు చేసిన రాజ్యవిస్తరణ, అతని కాలంలో అతను చేసిన దానధర్మాలు,కవి పండిత పోషణ, అగ్రహారాల దానాలు వంటివి కూడా మనమీ గ్రంథంలో చూడవచ్చు.

**మ॥వితంతాంధ్రక్షితి యిట్టులబల దోర్వీర్యైక్యసాహాయ సం**
**స్థితి వర్తింపఁగ చోడవంశమున నొందెన్ జన్మయొక్కండు,ధీ**
**యుతుడున్ క్షత్రియుడన్న దేవసమభిఖ్యుండమ్మహీజాని య**
**ద్భుత తేజంబున నెల్ల రాజ్యములలోఁబుట్టెన్ భయక్షోభముల్.**
**గీ॥ఆ మహావ్యక్తి, విస్తృతోద్దామ శౌర్యఘటిత ఘనగాథ లోకవిఖ్యాతమగుట**
**నితనిపూర్వుల జగదభిమత పరాక్రమాంచిత చరిత్ర మాలింపనర్హమిచట**

ఇలా చోడవంశానికి చెందిన అన్నచోడుని గురించిన అంశాలు ఈ గ్రంథంలో మనకు కనిపిస్తాయి.

**శా॥శ్రీనాథున్మతి తన్మనోజ్ఞ కవితా శృంగారవత్కన్యకన్**
**మానింపన్ బయకొన్న రెడ్డివిభులున్ మంత్రి ప్రకాండుల్ సుర**
**స్థానంబందిన వెన్కదత్కవి కెటన్ స్థానంబు లేకుండె నెం**
**దేనిన్ బొట్టకుఁజిట్టెడున్ దొరుకదాయెన్ దాదృశజ్ఞానికిన్**
**మ॥దిన వెచ్చంబిడువాడులేక కవివృత్తిన్రోసి,శ్రీనాథధీ**
**జనుఁడావార్థకమందు సేద్యముపయిన్ స్వాంతంబు జొప్పించె నం**
**దున గృష్ణాతటినీ తటాంచలములందున్ బొడ్డుపల్లెన్ భువిన్**
**గొని,దున్నించి ఫలై కకాలమున దా గోల్పోయె సస్యంబులన్**
**గీ॥అట్లుపడరాని కష్టంబు లనుభవించి ఒడ్డెరాజుల కఠినత కోర్వుగొనుచు**
**వారి యపకీర్తి యుర్వి నెప్పటికిఁబర్వ సంకటంబున నిట్లు సీసంబుసెప్పె.**

**సీ॥కవిరాజు కంఠంబు కౌగలించెనుగదా పురవీధి నెదురెండ పొగడదండ**
**సార్వభౌముని భుజాస్తంభమెక్కెనుగదా నగరి వాకిటనుండు నల్లగుండు**
**ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున దగిలియుండెనుగదా నిగళయుగము**
**వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత వియ్యమందెనుగదా వెదురు గొడియ**
**గీ॥కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము బిల బిలాక్షులు తినిపోయె తిలలుపెసలు**
**బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి నెట్లు చెల్లింతు టంకంబు లేదునూర్లు**
**గీ॥కొంతకాలమెయీరీతి వంతలందు ధీరకవి సార్వభౌముడు దినము గడిపి**
**త్రిదశపదవికి జనునున్న దినమునందు బలికెనీ సీసమామెయిన్ బాసెఁదనువు**
**సీ॥కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయడిచ్చు**
**రంభగూడె దెనుంగు రాయరాహుత్తుండు కస్తూరి కేరాజుఁబ్రస్తుతింతు**
**స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వాని పంక్తిఁగలుగు**
**కైలాసగిరి బండమైలారు విభుడేగె దినవెచ్చ మేరాజుతీర్పగలడు.**
**గీ॥ భాస్కరుడు మున్నె దేవునిపాలి కరిగె గలి యుగంబున నింకనుండఁగష్టమనుచు**
**దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ నరుగుచున్నాడు శ్రీనాథుఁడమరపురికి.**

శ్రీనాథుడు అష్టైశ్వర్యాలు,భోగభాగ్యాలు, ఘనసన్మానాలను చూసినవాడు. చివరి కాలంలో రోజులు గడవడానికి కూడా కష్టపడవలసి వచ్చింది. జీవిక కోసం వ్యవసాయాన్ని చేపట్టి నష్టపోయాడు. చివరికి తన వద్ద పన్నులు కట్టడానికి డబ్బు లేకపోయింది. ఏడువందల కాసులు ప్రభుత్వానికి బాకీపడ్డాడు. ఒడ్డె రాజులు కఠినంగా శ్రీనాథుని భుజంపై నల్లగుండు ఎత్తి, ఎండలో నగరవీధుల్లో తిప్పారు. మరే కవి పొందని కష్టాలను శ్రీనాథుడు చివరిరోజుల్లో పొందడం అత్యంత శోచనీయం. ఎన్నో ఘనకీర్తులందుకు కవిసార్వభౌముడిని ఆదుకునే వారు లేక అతని సాహిత్యాన్ని ఆదరించేవారు లేక చివరకు కష్టాలతోనే తనువు చాలించడం కంటతడి పెట్టించే సన్నివేశం. దీన్ని మన కళ్లకు కట్టినట్టు వర్ణించి

చూపించారు ఈ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**మ॥పదినూఱుల్ పదునాల్గు క్రైస్తవ శతాబ్దంబుల్ గతింపంగ న**
**భ్యుదయ ప్రాంచిత మానెగొందె సమభిఖ్యోపేత కిష్కింద సం**
**పదలేపారగ నందభూవరుడు సామ్రాజ్యంబు స్థాపించె నా**
**పద మందిర్వదిరెండు వర్షములుగాపాడెన్ ప్రజామోదమున్**

ఈ పద్యముతో విజయనగర సామ్రాజ్యము యొక్క ప్రాభవాన్ని తెలిపే ఘట్టాలను మనకు వివరించడం మొదలుపెట్టారు ఈ గ్రంథంలో జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**చ. హరిహరబుక్కరాయ యుగమంతకు మున్నె యెఱింగి సాధ్యమై**
**తరలినయంత రత్నసముదాయమునున్ మణిసంచయమ్ము నే**
**ర్తెఱవెను వెంటగైకొని కడిందిజవమ్మున నానెగొంది భూ**
**వరుడగు జంబుకేశ్వరునివద్దకుజేరి వసించిరయ్యెడన్**

ఇక విజయనగర సామ్రాజ్య స్థాపన విషయానికొస్తే క్రీ.శ.1326వ సంవత్సరమున మహమ్మద్ తుగ్లక్ అనగొందె రాజ్యాన్ని జయించి అక్కడి రాజును సంహరించాడు. అతని పరివారంలోని కొందరిని చెరపట్టి తీసుకు పోయాడు. అందు హరిహరబుక్కరాయలను ఉద్యోగి కూడా ఉన్నాడు. బందీలుగా తీసుకువెళ్ళబడిన హరిహరుడను బుక్కరాయలును ఢిల్లీలో బలవంతంగా మహమ్మద్ మతం స్వీకరించవలసిన పరిస్థితి ఏర్పడింది. అనగొందె ప్రజలు త్వరగానే మహమ్మద్ పాలనపై తిరుగుబాటు చేశారు. పన్నులుకట్ట నిరాకరించారు. అదేసందర్భంలో పశ్చిమాంధ్రదేశములో యవన వినాశమునకై పోరాడుతున్న అర్వీటి సోమదేవరాజు అనగొందిని పాలిచుచున్న మహమ్మదీయ రాజప్రతినిధినోడించి చెరబట్టాడు. అతడు శరణాగతుడై ఆరువేల గుర్రాలను కానుకగా ఇచ్చి వేడుకొనగా అతన్ని సోమదేవరాజు విడిచిపెట్టాడు.

దక్షిణాపథమందు తాము జయించిన భూభాగాలు చేయి జారిపోవుట చూచి ఢిల్లీశ్వరుడు తుగ్లక్ మరియొక పథకాన్ని పన్నాడు. తన ఆధీనంలో ఉన్న దక్షిణాపథ భూభాగాల ప్రతినిధులుగా మహమ్మదీయులను పంపిన ఎడల ఇబ్బందులు తలెత్తుతాయని భావించాడు. కనుక మహమ్మదీయ మతము స్వీకరించిన వారిని పంపిన యెడల ప్రజల కభ్యంతరముండకపోవచ్చుని భావించాడు. ఈవిధంగా ఆలోచించిన తుగ్లక్ అనగొందెకు తన ప్రతినిధిగా హరిహరబుక్కరాయలను నియ మించాడు.

దక్షిణాపథమున కాపయనాయకుడు,మూడవ భల్లాళరాజు మొదలైన వారి ఆధ్వర్యంలోని జాతీయ సమితిలో ఏర్పడిన మొదటి యుద్ధములలో హరిహరబుక్కరాయలు పరాజయం పాలై పారిపోవల్సి వచ్చింది. బుక్కరాయలు అడవులలో తిరుగుతూ పంపా క్షేత్రము నందు తపస్సు చేసుకుంటున్న విద్యా రణ్యస్వాముల వారిని దర్శించాడు. విద్యారణ్యులు బుక్కరాయలను తిరిగి హిందూమతంలోకి మార్చాడు. సేతువునకు కృష్ణానదికి నడుమగల భూభాగ మంతా విరూపాక్ష దేవునికి చెందినదనియు, ఆ దేశమును హరిహరబుక్క రాయలను, అతని సోదరుడ్ని తనకు ప్రతినిధులు పాలించవలసిందిగా ఆదేశించాడు. అలాగే ఆ సోదరులకు కావలసిన ధనాన్ని కూడా సమకూర్చాడు విద్యారణ్యులవారు. తర్వాత హరిహరబుక్కరాయలు రెండవసారి యుద్ధం చేసి అనగొందెని స్వాధీనపరుచుకున్నాడు. విజయసూచనగా 1246వ సంవత్సరంలో విరూపాక్ష దేవాలయం సమీపంలో విద్యానగరాన్ని స్థాపించారు. ఇట్టి విషయాలన్నింటిని లోతుగా పరిశోధించారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**మ॥తురకల్ భూరి జయస్వనంబుల మెయిన్ దుర్గంబులోజొచ్చి బం**
**గరు నాణెంబుల రత్నపుంజములనున్ గాలించి,చేపట్టి క్ర**

**చ్చుఱ రాజాంక నిషంగులన్ వెదకి కాంచన్‌గల్గి బంధింప జే**
**సిరి మ్లేచ్ఛున్ బహుదీనునిన్ హరిహర శ్రీబుక్కరాడ్ధీరులన్**
**శా॥వారిన్ ఢిల్లీమహీశ్వరుండు బలిమిన్ బంధించి,యాతేని స**
**ర్దారుల్ నల్వురబట్టి హస్తినగరీ రాట్సీమ కంపించె నా**
**తతి నే మల్లికునాయకున్ నిలిపె సంస్థానాభి రక్షార్థమై**
**త్వరలోఁదుగ్లక్ ఢిల్లీచేరుకొనియెన్ దర్పావృత స్వాంతుడై**
**గీ॥క్రూరచిత్తుండు తుగ్లకు క్షోణీవిభుడు మొట్టమొదలుగ బహుఉద్దీన్ దిట్టబట్టి**
**చిత్రవధపాలుచేయించెఁ జీకులేక యతని క్రౌర్యప్రకారంబులసదృశములు**

ఇలా అనేకచోట్ల చరిత్రను అర్థవంతంగా వర్ణిస్తారాయన.

హరిహరరాయలు (1336–1355)గురించి సంపూర్ణంగా ఈ గ్రంథం ద్వారా మనం తెలుసుకోవచ్చును.

**సీ॥ఘనవసంత విలాస కావ్యంబులిఖియించి సరసకవిత్వ కౌశలముఁజూపె**
**ప్రతిమలోత్తర హరివంశ కావ్యమువ్రాసి ప్రౌఢ కవిత్వతత్వంబుజూపె**
**సముచిత సకల భాషాభూషణుండయి సాహిత్య సత్సభాజయములందె**
**రసపోషణ క్రియారంగాలమార్కొని చక్రవర్తి ఖ్యాతిసంతరించె**
**గీ॥బహుళ కర్ణా భాషాప్రపంచబంధురాభరణకల్ప కావ్యచయంబు వ్రాసి**
**ఉభయ వాగ్జగదేక మాన్యుడునయ్యె సుకవిగణ్యుండు నాచనసోమబుధుడు**
**గీ॥రమ్యవిక్రమసింహపురక్షితీంద్రుశుభదసత్కృతులందిశ్రీసోమబుధుడు**
**అనుదినమువృద్ధిగాంచువిద్యానగరమునెనసె శ్రీబుక్కరాయసత్కృతులగాంచె**

ఇలా బుక్కరాయలు(1355–1377)గోపనామాత్యులు వంటివారి గురించి ఈ గ్రంథం ద్వారా అవగాహన చేసుకోవచ్చును. అలాగే బుక్కరాయని పరిపాలనా తీరును, రెండవ హరిహరరాయల గురించి (1377– 1404) చాలా విషయాలు తెలిపారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**మ॥తన రాజ్యంబున నందు నందున జలధారార్థకాసారముల్**
**ఘనవృత్తిన్ బొసఁగించి కాలువలపోకల్ తీరుమానించి క**
**ర్షణ వృత్త్యర్థుల కర్షమార్గముల గూర్పన్ నేర్చి నానాప్రజా**
**వన నైమిత్తిక సస్య సంపదలఁగాపాడెన్‌బటు ప్రక్రియన్**

అంటూ మొదటి దేవరాయలు(1406–1422)పరిపాలన గురించి తెలుపుతారు. అలాగే ప్రౌఢ దేవరాయలు(1423–1447)గురించి, వారు చేసిన సైన్యాభివృద్ధి గురించి, రాజద్రోహాలు జరుగకుండా చేసిన విషయాల గురించి వివరించారాయన. ఈ గ్రంథం ద్వారా మల్లికార్జునరాయల గురించి కూడా తెలుసుకోవచ్చును. ఆయన పరిపాలన కాలం (1447–1465)గురించిన పలు విషయాలు తెలిపారాయన. విరూపాక్షరాయలు (1465–1478) గురించి సాళువాన్వయులు నరసింహభూపాలుని గురించి సవివరంగా తెలిపారాయన.

**గీ॥సరసవినుతయోగానంద సమభిదానమగు ప్రహసనము దేవరాయలబుధుండు**
**వ్రాసె డిండిమకవి సార్వభౌముడితఁడు నరుణగిరి నాథుడార్యలోకాభినుతుడు**
**గీ॥అతని కుదయించె రాజనాథాఖ్యుడతడు పండితుండయి సత్కవిప్రవరుడనయి**
**పడసె డిండిమకవి సార్వభౌమసంజ్ఞ సర్వపండిత లోకరంజనముసేసె**

ఇలా డిండిమకవి సార్వభౌమునిగా పేరుపొందిన కవి యొక్క కవితాధార గురించి తెలుపుతారాయన.

తుళు వంశమువారు తుళు ప్రాంతం నుండి ఆంధ్ర దేశమునకు వచ్చి స్థిరపడినట్లు చరిత్రకారులు నిర్ధారించారు. వీరు తాము చంద్రవంశపు క్షత్రియు లమని చెప్పుకున్నారు. ఈ వంశంలో ఈశ్వరనాయకుడనే అతను ప్రసిద్ధి చెందాడు. అతను సాళువ నరసింహరాయల వద్ద సేనానాయకుడిగా అనేక దుర్గాలను జయించినట్లు వరాహపురాణము తెల్పుతున్నది. ఈశ్వర

నాయకుడి కుమారుడు తండ్రివలె గొప్పవీరుడు. సాళువ నరసింహరాయలు ఇతన్ని మంత్రిగా, దండనాయకుడిగా, నియమించుకున్నాడని నరసనాయకునికి ముగ్గురు భార్యలలోని తిప్పాంబికకు వీరనరసింహరాయుడు జన్మించాడు. ఇతడు తండ్రి మరణించిన తర్వాత (1503)రాజ్యసింహాసనమధిరోహించి ఆరు సంవత్సరాలు పాలన చేశాడు. ఇతని వద్ద గొప్ప రాజనీతిజ్ఞుడైన తిమ్మయ మంత్రిగా ఉన్నాడు. ఇతడే తిమ్మరుసుగా ప్రసిద్ధి చెందాడు. వీరనరసింహ రాయలు క్రీ.శ.1509వ సంవత్సరంలో మరణించగా తుళువ నరసరాజు రెండవ భార్య నాగలాంబిక కుమారుడు కృష్ణదేవరాయలు రాజ్యాన్ని చేపట్టాడు. కృష్ణరాయనికి రంగరాజు, అచ్యుతరాయడు అనే ఇద్దరు సవతి తమ్ములున్నారు. వీరు నరసనాయకుని మూడవభార్య ఓబాంబిక కుమారులు.

**ఉ॥ఈశ్వరదేవరాయలు మహీశ్వర లక్షణశాలియయ్యెఁద**
**ద్విశ్వమ యాజ్ఞచేఁబుటుక వెంబడివచ్చిన స్వల్పభాగ్య భో**
**గేశ్వరతన్ జరిపించినను హృత్పుటముద్భట సాహసక్రియా**
**శశ్వదభీష్టమై తనరసత్సమయాభిని రీక్షసేసెడన్**

**చం॥తుళువ శ్రీమహదన్వయోద్భవుడటన్ దోర్దండ చండక్రియా**
**చలిత స్వాంతులజేసి శాత్రవులఁదత్సామర్థ్యమును సాళ్వ భూ**
**తల నాథాత్మకు భావనీయమయి చింతన్‌బాపె,ధాత్రీప్రజా**
**వళికిన్ శాంతిసుభోపభోగమొదవెన్ వర్థిల్లె సౌభాగ్యమున్**

**గీ॥సాళ్వసామ్రాజ్య శాసికాసమయమందె స్వర్గసీమనుకుఁ జేరనాహ్వానమయ్యె**
**ఆత్మజాతునిఁ దిమ్మ నాహ్వయని రాజ్యపీఠికాధిపతిఁ గావించి వెడలెనతఁడు**

**గీ॥బాలకుండౌటఁ దిమ్మభూపాలుఁ డతడు దండనాథపదోద్భాసి స్తవ్యశీలి**
**తుళువనరసింహదేవరాయలు తదీయరాజ కార్యసమర్థ నారంభమూనె**

ఇలా సాళ్వవంశ చరిత్రను, తుళునరసింహరాయలపాలనా తీరును, తిమ్మరుసు

మంత్రాంగ నైపుణ్యాన్ని వివరిస్తారాయన. అలాగే విజయనగర పరిగ్రహణాన్ని గురించి సవివరంగా తెలుపుతారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. అలాగే శ్రీకృష్ణదేవరాయల జననము, బాల్యము, విద్యాభ్యాసము వంటి అనేక విషయాలు ఈ "ఆంధ్రసామ్రాజ్యము"లో చోటుచేసుకున్నాయి. అలాగే శ్రీకృష్ణదేవరాయల బాల్యంలో జరిగిన హత్యాయత్నం, తిమ్మరుసు రాయలను రక్షించిన విషయాలనేకం ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. ఇంకా శ్రీకృష్ణదేవరాయలు రాజ్యలక్ష్మిని చేపట్టటం వంటి ఘట్టాలలో అనన్య సామాన్యమైన ప్రతిభ కనపరుస్తూ పద్యరచన గావించారు. అలాగే కృష్ణరాయలు జరిపిన దండయాత్రలు, ఆయన పొందిన విజయాలు, రాజ్యవిస్తరణగావించిన విషయాలను హృద్యమైన పద్యాలలో పొందుపరిచారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

**మ॥కదనారంభముసేసి యుమ్మతురుదుర్గంబదు నోటందుచున్**
**మరిసంతాపముతోడ నచ్యుతుడురా, మాన్యుండు తిమ్మరుసుకే**
**యుదయించెన్ బరితాపమాసరణి నత్యుగ్రాగ్రహంబయ్యె దు**
**ర్మదరాడ్భంజన సద్యశోవిభవ శుంభత్ కృష్ణ భూజానికిన్**
**గీ॥రయము మెయినుమ్మ తూరు దుర్గమ్ముఁజుట్టి వశము గావించుకొనుటయవశ్యమనుచు**
**మున్నె చెప్పినరసింహభూమిపాలుఁడపుడె శ్రీకృష్ణరాయలనంపుదనియె**

కృష్ణరాయలు ఉమ్మత్తూరు దుర్గంపై దండయాత్రకు ముందు జరిగిన కొన్ని విషయాలను తెలుపుతారు జంధ్యాలవారు. అలాగే ఆయన ఉమ్మత్తూరు దుర్గాన్ని స్వాధీనం చేసుకున్న విషయాన్ని ఈ గ్రంథంలో చూడవచ్చు.

**సీ॥కరవాలధారు లుగ్రముగఁ బోరెడు వేళ నసిఘాత నినద మాకసమునంటె**
**విచ్ఛిన్న సైనికవీర శీర్షమ్ములు పరిఖాజలంబులఁబడి మునింగె**
**శుండాల తుండముల్ ఖండమ్ములై తెగి రక్తస్రవంతు లేర్పడఁగ జోపె**
**తురగరింఖా ముఖోద్ధూత రజంబదిభాను దీధితి నెల్లవాటుఁ జేసె.**

**గీ॥ఉమ్మత్తూర్ తేని కదన రథమ్ములెన్నో ఫెళఫెళారావములతోఁ దబ్బుథ్వీఁగూలె**
**క్రమముగా దుర్గ రక్షకగణము తగ్గె కోటలోఁబ్రజకాహార మోటుచెందె**

ఉమ్మత్తూరుకోటపై శ్రీకృష్ణరాయలు జరిపిన దండయాత్ర సందర్భంగా జరిగిన భీకరయుద్ధసన్నివేశాలను మనకు కళ్ళకు గట్టినట్టుగా చూపిస్తారు శాస్త్రిగారు.

**మ॥పెనుగాలంబు విరామమున్ గొనక యవ్వీరుండు శ్రీకృష్ణరా**
**డ్జననాథుండు తదీయ రాజ్యరమ నిస్సంత్రాన గావించుటే**
**తన కర్తవ్యమటుంచు దా శివసముద్ర శ్రీజయోత్సాహియై**
**చననంగీకృతిఁ బల్కె జల్పెసు సమిత్స న్నాహ మారీతిగన్**

శ్రీకృష్ణదేవరాయలు ఉమ్మత్తూరుదండయాత్ర తర్వాత ఎక్కువకాలం ఆగకుండా శివసముద్రంపై దండయాత్ర జరిపిన విషయం తెలుపుతారాయన.

**శా॥దుర్గస్థానముఁ జుట్టుముట్టి విజయోద్యగంబు సేయన్ జమూ**
**వర్గంబున్ నియమించి కృష్ణధరణిపాలుండు పోరాదరా**
**మార్గంబందున నున్న వార్త భువిగ్రమ్మన్ స్థాన రక్షాక్రియన్**
**దుర్గాదీశుడుయుక్త రంగములందున్ నిల్పె యోధావళిన్.**

**గీ॥గజపతీంద్రుడు తన తురంగములగముల జండశుండాల వితతి, నఖండ సత్వ**
**భట గణంబులఁగృష్ణకావలనుజేర్ప గనుట రణరంగములు రెండుగా జెలంగె**

**గీ॥కృష్ణరాయలు కర్తవ్యమేమటంచు మంత్రినడుగంగ నాతడిమ్మాడ్కి నొడివె**
**సముచితముగ రెండుభాగములు సేయవలయుఁ దొలుదొల్తమన సైన్యం బలమునెల్ల**

ఇలా కొండవీటిదుర్గాన్ని జయించడానికి వ్యూహరచన గావించి, ఆ దుర్గాన్ని స్వాధీనపరచుకొని విజయం సాధించాడు శ్రీకృష్ణదేవరాయలు. అలాగే కటకంపై జరిపిన దిగ్విజయయాత్ర, కాటూరిదండయాత్రలను గూర్చి సవివరంగా ఈ గ్రంథంలో వివరించారు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

**మ॥తనయాస్థానమునందు సర్వవిధ విద్వన్ముఖ్యులన్ నిల్పియే**
**దినమున్ ధీర సభాప్రదేశముల నిర్దిష్టాంశ చర్చాక్రియా**
**ఘనతన ధర్మవిచారముల్ సలుపుచున్ క్ష్మామండలీ సౌఖ్యసం**
**జనక ప్రక్రియ ధర్మకర్మములచే సాధించె, ఁబుణ్యౌఘమున్.**
**గీ॥రాయలాసమయమున నాంధ్రప్రశస్త వాఙ్మయాభ్యుదయమ్ము భావనము సేసి**
**ఘన సభాస్థలినెనమంద్రు కవులనిలిపి వారలనె అష్టదిగ్గజ ప్రాయులనియె**
**సీ॥ఆంధ్రవాక్కవితామహామహు నలసాని పెద్దన్న సత్కవిన్ బెద్దజేసె**
**సరసవాక్కవితా విశారదుండగు నందితిమ్మన కవికి నాదృతి నొసంగె**
**అసమాన మధురవాగ్ వ్యాసంగి ధూర్జటికవికి నభీష్టవైభవముగూర్చె**
**వివిధార్థవాఙ్నిధిన్ బింగళసూరన్న వివిధార్థభోగ సంప్రీతుఁజేసె**
**గీ॥రామరాట్కవి మల్లన రామభద్ర రామకృష్ణుల విశ్రుత ప్రౌఢకవుల**
**సముచితాభీష్ట సంప్రదానములదన్నె స్వయముగా రాయలేకవివరుడయ్యె**
**గీ॥కృష్ణరాయలు ప్రధీతకవీశ్వరులకు నురుధన సమర్పణము సేయుటొండెగాక**
**కవితకై తనబుద్ధివైభవముగూడ సమర్పణము సేసి కృతకృత్యుడై రహించె.**
**గీ॥అతడు సత్కవితారస హితుఁడెగా కలఘు శిల్పకళాభ్యుదయంబు సేయ**
**దూరమునుండి శిల్పులఁజేరఁబిల్చి యుచిత శిల్పజ్ఞవితతి బహూకరించె**

ఇలా శ్రీకృష్ణదేవరాయల సాహిత్యాభిమానాన్ని, వివిధ కళల పట్ల గల అభిమానాన్ని వివరిస్తారు జంధ్యాలవారు. శ్రీకృష్ణదేవరాయల అనంతర కాలంలో జరిగిన విషయాలను పూర్తిగా మనం ఈ గ్రంథం ద్వారా తెలుసుకోవచ్చు.

కృష్ణదేవరాయల అనంతరం అతని సవితి తమ్ముడు అచ్యుతరాయలు రాజయ్యాడు. ఇతను 1530-1542 మధ్యకాలంలో పాలనగావించాడు. అచ్యుతరాయలు పరిపాలన కాలమున తిమ్మరుసే రాజ్యకార్యములన్నీ నిర్వహించినట్లు తెలుస్తుంది. అచ్యుతరాయల మరణానంతరం అతని కుమారుడు

వేంకటరాయలు రాజయ్యాడు. ఇతడు అల్పాయుష్కుడు. వేంకటరాయలు రాజైనప్పటికీ అతని మేనమామయగు సలకముతిమ్మయయే రాజ్యాధికారము చేపట్టాడు. మరికొంతకాలానికి మేనల్లుడిని చంపించి అతనే రాజైయ్యాడు. తనకు తోడుగా నుండునని బీజాపూరు నవాబు సహాయమర్థించాడు. సతకము తిమ్మయ్యకు అతని బంధువు రామరాజు యుద్ధం ఏర్పడింది. ఈ యుద్ధంలో తిమ్మయ్యను రామరాజు వధించి విజయం సాధించాడు. ఇతడు అచ్యుత రాయల అన్న కుమారుడు సదాశివరాయలను నామమాత్రంగా రాజును గావించి, అతని పేరున మిక్కిలి వైభవముగా ఇరువది మూడు సంవత్సరాలు చక్రంతిప్పి పాలన చేశాడు. రాజ్యాధికారము తుళువంశము వారిదైనప్పటికీ తుళువంశాన్ని వెనక్కు నెట్టి ఆర్వీటి వంశము విజయనగర రాజ్యాధిపత్యము వహించినట్లు చెప్పవచ్చు.

**ఉ॥అయ్యెడ రామరాజు మదనాశబద్ధ మనోవికారుడై**
**తొయ్యలిఁ జూచి నాకుబరితోషము గూర్పఁగ నేర్తువాయనన్**
**నెయ్యము పాటిజేసి రమణీమణియా గ్రహమూన కిట్లనెన్**
**జయ్యన నీకు నాకిచట సమ్మతమౌనొక కోర్కెకొప్పినన్**

**చ॥మనకగు పొందు హేతువఁగుమారి జనించిన నాకునిమ్మికన్**
**దనయుడు గల్గు పక్షమునఁ త్వత్పురి పోషణమందు నుండగా**
**ననుమతి నిమ్మియీ సరణికౌనని సమ్మతిదెల్ప నేర్చినన్**
**మనమలపూవుల పొదమాటున పొందగవచ్చు సౌఖ్యముల్.**

రామరాజు కాలములలో విజయనగర రాజ్యమత్యున్నతస్థితి పొంది శత్రురాజులకు సింహస్వప్నంగా ఉంది. అలాంటి కాలంలోనే ఈరాజ్యం పతనదశకు చేరుకోవడము జరిగింది. ఒకరకంగా ఇతని రాజనీతే ఉన్నతికి కారణమైనా దానివల్లనే పతనదశకు చేరిందని చెప్పవచ్చు. తనకు బద్ధ శత్రువులైన

మహమ్మదీయులు కొందరు అసూయ కలిగి వైరభావాన్ని పెంచుకున్నారు. ఈ వైరముల నదనుగా తీసుకుని రామరాజు కొందరి సహాయము పొంది వారిచే తన ఇతర శత్రువులనోడించవలననె ఆలోచన చేశాడు. క్రీ.శ. 1543లో రామరాజు అహమద్‌నగర్ సుల్తాన్‌తోను, గోల్కొండ నవాబుతోను స్నేహంచేసి బీజాపూర్ నవాబుపై దండెత్తాడు. తన తమ్ముడు వెంకటాద్రిని గొప్పసేనతో పంపి బీజాపూర్‌ను, రాయచూరున స్వాధీనం చేసుకోవాలని ఆదేశించాడు. బీజాపూర్‌రాజు ముగ్గురు శత్రువులతో పోరాటం చేయలేక రామరాజుతోను, అహమ్మద్ నగర ప్రభువుతోను సంధి చేసుకున్నాడు.

ప్రతిసారి తమ సహాయము కోరుతున్న రామరాజు పన్నాగాలను గ్రహించిన మహమ్మదీయులు ఆలోచనలో పడ్డారు. అనేక యుద్ధాలలో జయించిన రామరాజు ఆదిల్‌షా బీజాపూర్ సుల్తాన్ కావడానికి సహాయపడినప్పటికీ ఆదిల్‌షా రాక్షస తంగిడి వద్ద జరిగినయుద్ధం సందర్భంలో మోసగించి రామరాజును శత్రువులు, చంపడానికి సహాయపడ్డాడు. ఇలాంటి సంఘటనలనెన్నింటినో ఈ ఆంధ్ర సామ్రాజ్య గ్రంథంలో చూడవచ్చు.

**చ॥అపుడు నిజాముషాహి,కఠినాత్ముడు రామనృపాలు కంఠమున్**
**గృపవిడి యుత్తరించె, భటుకేల జలంగెడు బల్లెపుంగొనన్**
**నృపతి శిరంబు గ్రుచ్చి పయికెత్తి తెలుంగు పదాతి వర్గముల్**
**చపలత నందఁజూపె ధృతిసారముగొల్పె దురాంధ్ర సైనికుల్**

ఇలా రామరాజు జీవితం ముగిసింది. రామరాజు అనంతరం రెండవ వెంకటపతిదేవరాయలు (1585–1614) అధికారంలోకి మార్చాడు. అరవీటి వంశములయిన విజయనగర రాజులలో రెండవ వెంకట దేవరాయలు గొప్ప వ్యక్తిగా కీర్తిపొందాడు. అతని కాలంలో ఎంతోమంది యాత్రికులు విదేశరాజులు పంపిన కానుకలను చంద్రగిరిలో దర్శించినట్లుగా రాశారు.

రెండవ వెంకటపతి దేవరాయలు 1592లో తన రాజధానిని పెనుగొండ నుండి చంద్రగిరికి మార్చాడు. అతడు విద్యాభిమాని, కవిపండితులపట్ల అపార గౌరవం కలిగినవాడు. ఎన్నో దేవాలయాలకు దానధర్మాలు చేశాడు. రెండవ వెంకటపతిరాయల అనంతరం విజయనగర రాజ్యంలో అంత:కలహాలు చెలరేగాయి. వెంకటపతిరాయలు తన అన్న కుమారుడగు శ్రీరంగరాయలను రాజుగా నిర్ణయించాడు. ఇతన్నే రెండవ శ్రీరంగరాయలంటారు. శ్రీరంగరాయలను రాజుగా నిర్ణయించడం గొబ్బూరి జగ్గరాయడనే బంధువుకు ఇష్టంలేదు. వెంకటపతి రాయల భార్యయు తన సోదరియునగు ఒక రాణి కుమారుడు ఉన్నాడని ప్రకటించాడు. ఇతను తన మేనల్లుని పక్షం వహించి రాజుపై తిరుగుబాటు చేశాడు. అంతేగాక జగ్గరాయలు శ్రీరంగరాయని సకుటుంబంగా వధించాడు. కాని స్వామిభక్తి పరాయణుడైన యాచమనాయ కుడను సామంతుడు శ్రీరంగరాయని కుమారులలో ఒకని రక్షించి తనకడ పెంచసాగాడు. ఈ సంఘటనలు రాజ్యమంతర్యుద్ధానికి దారితీసింది రాజ్యంలోని సామంతులందరు జగ్గరాయని పక్షం వహించారు. కాని తిరుచునాపల్లి సమీపంలోని తోపూరు నందు జగ్గరాయునికి యాచమ నాయకునికి జరిగిన యుద్ధంలో జగ్గరాయుడోడిపోయాడు. ఈ యుద్ధం తంజావూరు పాలకుడై రఘునాథరాయలు యాచమనాయకుడి పక్షం వహించాడు. అందువల్ల కోపించిన విజయనగర సామంతులందరు చంద్రగిరి రాజును, తమ ఏలికనంగీకరించుటకు నిరాకరించారు. తోపూరు యుద్ధము వలన కలిగిన పరాజయం తాల్లికోట పరాజయం కంటే ఎక్కువగా విజయ నగర వినాశనమునకు కారణమని చరిత్రకారులు అభిప్రాయపడ్డారు.

విజయనగర చిట్టచివరి రాజు మూడవ శ్రీరంగరాయలు. సామ్రాజ్యం చిన్నాభిన్నమై పోవుతున్నదని ఇతడు గ్రహించాడు. తంజావూరు, మధుర,

జింజీ మున్నగు ప్రాంతల సామంతులను తన వశమందుంచుకొన్న రాజ్యం నిలువదని అతడు ఆలోచించాడు. కాని అతని వద్ద అట్టి సామర్థ్యం లేదు. ఈ దుస్థితిలో అతడు ఢిల్లీ పాదుషా షాజహాన్ వద్ద ఒక విన్నపం పంపాడు. తన సామంతులను లోబరుచుకొనుట సహాయపడితే తాను మహమ్మదీయ మతం స్వీకరించుటకు సిద్ధమని ఆ విన్నపంలో తెలిపాడు. అయితే ఇతనికి షాజహాన్ ఎట్టి మద్దతు నియ్యలేదు. బీజాపూర్,గోల్కొండ నవాబులు శ్రీరంగరాయని రాజ్యాన్నాక్రమించి రాజధానిగా ఉన్న వేలూరు కోటను 1646సంవత్సరంలో ముట్టడి చేశారు. శ్రీరంగరాయలు పారిపోయి మైసూరు రాజు శరణుకోరాడు. ఆ తర్వాత ఇతనిని గూర్చిన సమాచారం దొరకలేదని పరిశోధకులంటారు. విజయనగర సామ్రాజ్యం 1675 నాటికి పూర్తిగా నశించింది. శ్రీరంగనాయని భార్య తన కుటుంబ రక్షణకై ఏదైనా సహాయం చేయవలసిందిగా మహారాష్ట్ర పాలకుడైన శివాజీని కోరినట్లు ఒక శాసనం తెలుపుతుంది. ఇది సరైనదో కాదు తెలియదు.

సుమారు మూడువందల సంవత్సరాలు దక్షిణాపథమున తేజోవంతంగా రాజ్యపాలన చేసిన విజయనగర రాజ్యం తన సామంతుల ద్రోహం వల్ల పూర్తిగా నశించింది.

**ఉ॥ఆనలి,శౌర్యధుర్య వసుధాధిప నిర్మిత మంజులాంధ్ర వి**
**ద్యానగరంపు సంపద దయారస హీనతురుష్కభూవ రా**
**ధీనములోనఁజిక్కిచెడె, ద్రెళ్ళక దక్కిన భాగమున్ బర**
**స్థానముజేరుచున్ సమయ చక్రములోబడి రూపు గోల్పడెన్.**
**ఉ॥పూనికజేసి తొల్దొలుత పూర్ణబలంబున నాంధ్రరాజ్య ని**
**ర్మాణము సేసి యాంధ్రనగరంబును గట్టిన యుద్ధశూర పం**
**చానన కీర్తి శాలి విజయ ధ్వజ భూపతితత్శుభాభిదన్**

**మానసమందు నెంచ బెరిమమునఁ గన్నులనీరు గ్రమ్మదే.**

**గీ॥అతని విజయాంకమునఁజేసియాంధ్రనగరి విజయనగరంబనన్ బొల్చె వెనుక ధీర**

**తమతపస్వి విద్యారణ్యధన్యుపేర నయది విద్యానగరమునన్ ఖ్యాతిఁగాంచె**

**గీ॥మాయురే బహుళాంధ్ర సామ్రాజ్యపదమె అయిన విజయనగరమె విద్యానగరము**

**తడయకయి తల్లికోట యుద్ధంబుతోడ మహావైభవాలయంబంత మందె**

**గీ॥ఆంధ్రపరిపాలన క్రమంబంతరించినంగాల క్రమమ్మున నచటి సకల**

**రాజసౌధమ్ముల రంగుబాసె కుడ్యములు సైతమల్లన గూలిపోయె.**

తల్లికోటయుద్ధంలో పరాజయంతో విజయనగర సామ్రాజ్యానికి అంతిమకాలం దాపురించిందని చరిత్రకారులు నిర్ధారించారు. ఎంతటి వైభవాలైన కాలం ముందు కరిగిపోవలసినవేనని విజయనగర సామ్రాజ్యం మరొకసారి నిరూపించింది. వర్తకం పేరుతో భారతదేశంలోకి ప్రవేశించిన ఆంగ్లేయులు దేశాన్ని తమ ఆధీనంలోకి తీసుకొని పాలన కొనసాగించారు. ఇది దేశానికి పట్టిన దుర్గతిగా, భారత నాయకులు భావించారు. దేశమంతా స్వాతంత్రో ద్యమం ఉధృతంగా కొనసాగింది. దీనిలో అనేకమంది తమ ధనమాన ప్రాణా లను కోల్పోయారు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన పిదప మద్రాసు రాష్ట్రంలో కలిసి ఉన్న ఆంధ్ర ప్రాంతంవారు తమకొక రాష్ట్రం కావాలనే ఉద్యమాన్ని ఉధృతం చేశారు. అసలు ఈ ఉద్యమం స్వాతంత్ర్యానికి పూర్వం నుంచి ఉన్నదే. అలాగే నిజాం నిరంకుశపాలన నుండి విముక్తం కావాలనే కాంక్షతో తెలంగాణ ప్రాంతంలో విముక్తి ఉద్యమం సాయుధ పోరాటంగా రూపు దిద్దుకుంది. ఇలా స్వాతంత్ర్యం రాక మునుపు నుంచి ఉన్న ఉద్యమాలు ఉధృత స్థాయికి చేరుకున్నాయి.

**మ॥ప్రకటాంధ్రక్షితి ధర్మరక్షిత యశోవద్రామరాడ్ భూమి నా**

**యకుడారీతిగఁ గైతవాభిగమనోద్యత్కాల గర్భస్థుడై,**

**ప్రకృతిన్ బాయఁగ నాంధ్రభూజనని నిర్వద్బాష్పధారావృతాం**
**బకమైకుందెఁ బ్రచండ శాసన విధామందీకృతోల్లాసయై**
**మ॥పరతంత్ర ప్రతిబద్ధ భారత మహీభాగంబు భాగ్యంబొగిన్**
**బరదేశంబులఁబ్రాకె, దివ్యమణి సౌవర్ణాది సంపద్యశ**
**స్స్ఫురణంబాత్మపదంఁ బుదాటి,జలరాశులుదాటి యాంగ్లేయు వి**
**స్తరదేశాంతరవాసి కర్ణములలో సంధించెనా రావముల్.**
**మ॥పరదేశమ్ములకేగనీయక ప్రజన్ ప్రాంతీయ వాణిజ్య వై**
**ఖరులన్ దేలగనీక యాయుధములన్ గై బట్టగానీకయీ**
**భరతోర్వీతలమెల్ల ఘోరతర నిర్బందాధి వాసంబుగా**
**జరుపన్ జాలిరి పాలకుల్ బ్రజలకున్ సంతాపముల్ వాటిలెన్.**
**గీ॥శ్రీయుత సురేంద్రనాథ్‌బెనర్జీ ప్రభృతులవలన నొకవేయి యెనిమిదివందలెన్బ**
**దైదు వత్సరముల నాటనంకురించె సకలభారత జాతీయ సభ్యసంస్థ.**

ప్రజలను బానిసలుగా చూస్తున్న ఆంగ్లేయులపై పోరాడటానికి సురేంద్రనాథ్ బెనర్జీవంటి వారి నాయకత్వంలో 1885అఖిల భారత జాతీయ సంస్థ అంకురించింది. జంధ్యాలవారు భారతజాతీయోద్యమంతోపాటు భారతదేశం లోను, తెలుగు ప్రాంతాలలోను జరిగిన అనేక ఉద్యమాలను ఈ “ఆంధ్ర సామ్రాజ్యము”గ్రంథం పొందుపరిచి అందించారు. ప్రాచీన రాజకుటుంబాల చరిత్రనేగాక సమకాలీన సమాజంలోని సంఘటన సారాన్నంతా ఆయన ఒడిసిపట్టుకున్నారని ఈ గ్రంథం ద్వారా మనం గ్రహించవచ్చు.

**శా॥ధీరత్వంబున నీ శతాబ్దిఁబదియారు దివ్యాబ్దముల్ వ్రాలదే**
**శారాధ్యుండు తిలక్ మహాశయుడు స్వేచ్ఛాభ్యర్థి; విద్యార్థులన్**
**భూరక్షాయత సైనమేర్పఱుప నుద్బోధించె నద్దాన క్షో**
**ణీ రాజ్యాధి పులాన్చిరాతనిపయిన్ నిర్బంధ సంవాసమున్**

**ఉ॥అవల హెూమురూలనెడి యాతని యుద్యమమెల్ల భారతీ**
**ర్వీ విబుధాళికిష్టమయి పెంపుదలన్ గొనె సర్వజాతి సం**
**భావితమైన యీ స్వపరిపాలన భావము వ్యాప్తి చెందెఁద**
**ద్భావము గుర్తెరిగి ప్రభువర్గము మాఱిచెఁ బాలనస్థితిన్**

హోంరూల్ ఉద్యమం, రెండు హోంరూల్ లీగ్‌ల ద్వారా కొనసాగింది. ఒక హోం రూల్ లీగ్‌ను బాలగంగాధర తిలక్ 1916లో పూనాలో నెలకొల్పారు. అతను నెలకొల్పిన సంస్థ ద్వారా మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలలో ఉద్యమం కొనసాగింది. 1918నాటికి తిలక్ నెలకొల్పిన సంస్థలో 32000మంది సభ్యులుండేవారు. మరో హోంరూల్ లీగ్‌ను అనిబిసెంట్ మద్రాసులో తిలక్ కంటే ముందే 1916 సెప్టెంబరులో నెలకొల్పారు. ఆమె నెలకొల్పిన హోంరూల్ లీగ్, దేశంలోని వివిధ ప్రాంతాలలో శాఖలేర్పడ్డాయి. దేశవ్యాప్తంగా ఆమె హోంరూల్ ఉద్య మాన్ని నడిపింది. ఈ హోంరూల్ ఉద్యమాల ప్రధాన లక్ష్యం స్వపరిపాలనే. 1917నాటికి ఆమె సంస్థలో 27000మంది సభ్యులున్నారు. అనిబిసెంట్, తిలక్‌లు సభల్లో ప్రచారం గావించడం, పత్రికల ద్వారా ప్రచారం చేయడం ద్వారా ఉద్యమాన్ని ఉధృతం చేశారు. మనదేశంలో యుద్ధం తర్వాత, స్వపరి పాలన నెలకొల్పాలనే ముఖ్యమైన కోరికను హోంరూల్ నాయకులు ప్రచారం చేశారు. "హోంరూల్ నా జన్మహక్కు, దానిని నేను సాధించి తీరుతాను"అని తిలక్ ప్రకటించాడు. అనిబిసెంటు తిలక్‌ల ప్రచారంవల్ల ఆరోజుల్లో హోంరూల్ నినాదం దేశమంతా ప్రతిధ్వనించింది.

హోంరూల్ ఉద్యమకాలంలో ఇంతకుముందు జాతీయోద్యమాలలో పాల్గొనని గుజరాత్, ఉత్తరప్రదేశ్ ప్రాంతాలుకూడా ఈ స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్నాయి. ఉద్యమంలో కార్మికులు, విద్యార్థులు కూడా ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు.

హోంరూల్‌ఉద్యమాన్ని బ్రిటీష్ ప్రభుత్వం అణిచివేసింది. యుద్ధకాలంలో అమలులో ఉన్న ప్రత్యేక చట్టాలను కూడా అమలు చేసింది. న్యూఇండియా పత్రికలో ప్రభుత్వాన్ని విమర్శించే రచనలు చేసినందుకు అనిబిసెంట్‌ను నిర్బందించింది.

హోంరూల్ ఉద్యమం అంతంతో తిలక్ యుగం కూడా ముగిసిందని చెప్పవచ్చు. వందేమాతరం ఉద్యమకాలంలో గణపతి, శివాజీ ఉత్సవాల ద్వారా మహారాష్ట్ర ప్రజల్ని జాగృతపరిచి జాతీయభావాలను పెంపొందించిన తిలక్ గాంధీజీ కంటే ముందున్న తరంలో ముఖ్యమైన నాయకుడు తిలక్ ఇచ్చిన "స్వరాజ్యం నా జన్మహక్కు"అనే నినాదం ప్రజలను ఉత్తేజితుల్ని చేసింది. బాలగంగాధరతిలక్ దేశ స్వాతంత్ర్యం కోసం వీరోచితంగా పోరాడారు. ఆయన నిర్వహించిన మరాఠీ, కేసరి పత్రికలు, జాతీయతను ప్రజల్లో ప్రజ్వలింపజేశాయి. అతను చేసిన రచనల వల్ల, బ్రిటీష్ ప్రభుత్వం 1908లో 6 సంవత్సరాలు దేశాంతర కారాగార శిక్ష విధించింది. అతను దేశం కోసం చేసిన త్యాగాలు మరువరానివి.

**గీ॥అపుడు నిర్భంధమెనసిన యట్టివారి విడుదలకు నయి జాతీయ విబుధ సంస్థ**
**సాత్విక నిరోధ పద్ధతి జర్చసేసి యాచరణమందునుంచగా నరసినిల్చె**
**మ॥పదమూడబ్దములేగ నిప్పటి శతాబ్దమందునన్ బాధ్యతా**
**స్పద భూమిపరిపాలనంబువలెనన్ భావంబు సంస్థాసభా**
**సదులామోదము సేసి రాంధ్రపద రాష్ట్రంబొందు ప్రత్యేకతన్**
**బొదలన్ గావలెనంచుఁగోరఁబడె సభ్యులు మెచ్చిరీ కోరికన్**
**గీ॥అయది పదినైదవదియైన యబ్దమందు కలకతాపురిసభన గ్రగణ్యులెల్ల**
**రాంధ్రరాజ్య సముత్పత్తి కరుసపడిరి ఆంధ్రరాష్ట్ర పునర్జృంభణాశవొడమె**

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రమేర్పడాలని ఆంధ్ర ప్రాంత నాయకులంతా బలంగా

కోరుతూ వచ్చారు. కలకత్తాలో జరిగిన సభలో ముఖ్యనాయకులంతా తమ గళాన్ని బలంగా వినిపించారు.

**శా॥ఈ జాతీయసభార్థలక్ష్యము ప్రజాస్వేచ్ఛా పరివ్యాప్తికై**
**తాఁజేయూత నొసంగె న్యాపతికులోత్తంసుండు శ్రీసుబ్బరాడ్**
**సౌజన్యాకరమూర్తి; భారతమహీ స్వాతంత్ర్య సంపాదనా**
**వ్యాజారంభుడు స్థాపితాంధ్రపద రాష్ట్రారాధ్యుడ శ్రాంతమున్**
**గీ॥పదినెనిమిది నూర్ల యెన్మదియు నెన్మిదబ్దముల నాడు భారతీ యార్య తతికి**
**న్యాయకార్యనిరూపి సంఘాంతరముల భారతీయాధికృతులకై పాటుపడియె**
**గీ॥ప్రకటధైర్యంమ్ము నలహాబాదునగరినగు తురీయజాతీయ సభాంతరమ్ము**
**నందు గంభీరమగు నుపన్యాసమిచ్చె, స్వార్థరహిత ప్రజాసేవ నాచరించె**

జాతీయతను చాటుకుంటూ, జాతీయోద్యమంలో కార్యశూర్యులై తమ వంతు పాత్రను అమోఘంగా పోషించారు. ఈ నాయకులు అవకాశమున్న చోటల్లా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూ, దానికోసం తీవ్రంగా కృషిసల్పుతూ వచ్చారు. ఆంధ్రప్రాంత నాయకుడు న్యాపతి సుబ్బారావుగారు తమ వంతు పాత్రను పోషించారు. ఇటువంటి అనేక విషయాలను మనమీ గ్రంథం ద్వారా తెలుసు కోవచ్చును. న్యాపతి సుబ్బారావుగారు కలకత్తాలో జరిగిన సభలో ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పరచాలనే తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఈ విషయాలను జంధ్యాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు విపులంగా వివరించారు.

మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికాలో బ్రిటీషు ప్రభుత్వం పాల్పడుతున్న దమనకాండకు వ్యతిరేకంగా ఉద్యమించారు. వారి దాస్యవిముక్తికై పోరాటాన్ని నడిపారు. తనదేశం పరిస్థితిని కూడా ఆలోచించసాగారు.

**గీ॥దక్షిణాఫ్రికాదేశ జదాస్యవృత్తి నంతమొందింప సముచితోద్యమమునడిపి**
**భారతోర్వికిఁజనుదెంచి భారతీయ సంకటమడంప జాతీయ సంస్థఁజొచ్చె**

**మ॥ఆ సహాయమూన్చి యెందుననహింసామోదమున్ గ్రుంగ నీ**
**క సమర్థించుచు స్వైరపాలన విధా కళ్యాణ మీ యుర్వికిన్**
**బొసగింపన్ దిలకించు గాంధియెడలన్ బూర్వధృతిన్ మాని;న్యా**
**యసభన్ శిక్షవిధించి రార్యముల కారాగార సంవాసమున్.**

అహింసా సిద్ధాంతాన్ని ప్రజల్లోకి బలంగా తీసుకువెళ్లి స్వాతంత్రోద్యమాన్ని కొత్తపుంతలు తొక్కించారు గాంధీజీ. సహాయనిరాకరణ, విదేశీ వస్తు బహిష్కరణ, నిరాహారదీక్షలు, ఉప్పుసత్యాగ్రహం ఇలా అనేక ఉద్యమాలకు రూపకల్పన చేసి స్వాతంత్రోద్యమంలో గొప్ప నాయకత్వాన్ని వహించారాయి. జైళ్లకు వెళ్లడానికైనా, లాఠీదెబ్బలు తినడానికై వెరువని వ్యక్తిగా భారత ప్రజల గుండెల్లో శాశ్వతంగా నిలిచిపోయారాయన. ప్రపంచ ప్రజలకు ఆదర్శనీయమైన వ్యక్తిగా, భారతజాతిపితగా ఘనహారతులందుకున్న ధన్యజీవి గాంధీజీ.

**మ॥ప్రతతోర్వీతల సర్వభూత వితతి స్వాంత ప్రమోదోదయా**
**నిత్యసౌఖ్య ప్రతికల్ప నాభిరతి,గాంధీమూర్తి,యాంగ్లేయ భూ**
**పతికిన్ జేసిన తొంటిమేలు ఫలమై ప్రాప్తించె; నాడౌర?యా**
**యత కష్టాన్విత షట్సమాభిచిత కారాగార వాసాకృతిన్.**

మహాత్ముని అడుగుజాడల్లో స్వాతంత్రోద్యమంలో లెక్కకు మిక్కిలి ప్రజలు నడిచారు. జాతిజాతంతా ఆయన మాటను వేదవాక్కుగా భావించింది. ప్రపంచంలో మరే వ్యక్తికి లేని మహా వ్యక్తిత్వమాయనది. అందుకే ఆయన మహాత్ముడిగా పిలువబడ్డారు.

**మ॥పదియున్ దొమ్మిదినూర్ల నల్వదిసమల్పై నేడువర్షమ్ములై**
**పొదలన్ గాలము స్వైరపాలన విధంబున్ వ్యక్తమున్జేసి స**
**మ్ముదమేపారగ నాంగలేయుల వనీ పూర్ణ స్వతంత్రావనా**
**భ్యుదయాధ్వమ్మును జూపి యేగిరి దయాభూయిష్ట భావంబున్**

అనేక పోరాటాల తర్వాత 1947 ఆగస్టు 15వ తేదీన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.

**సీ॥అఖిల సామ్రాజ్య సింహాసనాధ్యక్షుఁడై హితవు శాసింపరాజేంద్రబాబు**
**తరుణార్వరాజ్యతంత్ర ప్రకారంబుజోపంగ బ్రధాని జవాహరుండు**
**అధిప సంస్థాన వర్గాయత వ్యవహార భారంబుపై బూన వల్లభాయి**
**నిజదేశ రక్షా వినిద్ర రక్షణశాఖతీర్పు సేయగ బలదేవసింగు**
**గీ॥ప్రధితపట్టాభి,టంగుటూరి ప్రముఖ బంధురాంధ్ర వీరులు జయరహస్యములఁ దెల్ప**
**స్వైరభారత సామ్రాజ్య జయపతాక నాడఁగాఁ జేసెగాంధీ– మహామహుండు**
**గీ॥పదియుఁ దొమ్మిదినూర్ల నల్బదియునేడునైన యేట నగష్టుమాసాన రాయ**
**బారమరిగిరి రాజ్యాంగ పరిషదాంధ్ర సభ్యులుంకించి యాంధ్రరాష్ట్రంబు గూర్ప**

భారతజాతి ఆనందోత్సాహాల మధ్య రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతిగా, నెహ్రూ ప్రధానిగా, పటేల్ హోంమంత్రిగా, బలదేవ్‌సింగ్ రక్షణమంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు పట్టాభి,ప్రకాశంగారు ఇతర నాయకులు కృషి మళ్లీ మొదలుపెట్టారు. వారు కేంద్రం వద్దకు రాయబారాలు నడిపారు.

**సీ॥ప్రాగాంధ్ర భూమీవర స్థాపితమ్ములు నాటి దుర్గమ్ములీనాఁడు గలవు**
**సరళీకృతాంబు నిర్ఝరణీతటంబులు నప్పటి విపుడు సాక్ష్యముగ నిల్చు**
**అన్యరాజన్యుల నదలించి తీర్చిన విజయచిహ్నంబు లీవేళ నిల్చు**
**పాంథసౌకర్యార్థ పరికల్పితాతత పథములీనాటికిన్ వరలుచుండు**
**గీ॥కాలవశమున భారతఖండమెల్ల పరులపాలయి స్వచ్ఛంద పాలనమ్ము**
**గనియనీనాడు స్వపరిపాలనసేయ నర్హమనిపల్కరానిదే?యాంధ్రజాతి**

ఆంధ్రరాజ్యకీర్తిని గుర్తుచేస్తూ, నాటి చిహ్నాలు నేటికీ గలవని తెలుపుతూ స్వతంత్ర భారతంలో ఆంధ్రజాతి స్వపరిపాలన కావాలని పల్కరాదా? అంటూ

ప్రశ్నించారు మన నాయకులు అంటూ తెలుపుతారు. 'ఆంధ్రసామ్రాజ్యము' గ్రంథంలో జంధ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటానికి ముందు జరిగిన అనేక సంఘటనలను ఈ గ్రంథంలో ఇచ్చారాయన. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులు పడిన పాట్ల గురించి ఈ గ్రంథంలో వివరించారు జంధ్యాలవారు.

**సీ॥మేనఁదాల్చిన మేలి మిసిమించు వల్వాల జండవహ్నుల పాలు సల్పినాము**
**చేతితోవడకి కూర్చిన మోటు వల్వలదీర్చి మైబాధల కోర్చినాము**
**నలువురు గుమికూడి పలుకాడు మాత్రాన గూర్చిన శిక్షలన్ గుందినాము**
**పండించి నిల్పిన పంటకుప్పలనెల్ల విడిచి బాధకుల కర్పించినాము**
**గీ॥దొరతనమువారి భృత్యుల దుండగంపు చర్యలను మాఱుపల్కక సైచినాము,**
**బూతుకూతలతో దిట్టపోయుచున్న బృద్ధ్వి స్వాతంత్ర్యమొందు భావించినాము**
**మ॥అపరాధంబులు సేయకుండినను నిందారోపమున్ జేయుచున్**
**విపరీతమ్ముగా న్యాయరంగములకున్ బిల్పించి వంచించి తీ**
**రుపులిప్పించి యపారవిత్తములిడన్ బ్రోదగ్ర శిక్షావిధం**
**బపలాపిఁగ నోర్చినారలకటా? యాంధ్ర ప్రజానీకముల్**

ఇలా ఉమ్మడి రాష్ట్రంలో ఆంధ్రులు కష్టాలను, అవమానాలను పడుతున్న తీరును వివరించారాయన. ఇలా అనేక కష్టాలు పడుతూ కలిసి ఉండలేమని తేల్చిచెప్పినా కేంద్రం దిగిరాకపోయేసరికి పొట్టి శ్రీరాములుగారు గాంధేయ మార్గంలో నడిచి ఆమరణ నిరాహారదీక్షకు పూనుకున్నారు.

**గీ॥నేడుగాకున్నా రేపొపైనాడొ మనదు నాంధ్రభూమండలము రాష్ట్రమైత నర్చు**
**శాంతిపడుమన్ననతడు రోష ప్రదీప్తినెనసి యుద్యమవృత్తాంత మెట్లుపల్కె**
**చ॥అలఘుతరాంధ్ర వీరఘటితాంధ్ర మహాసభ భిన్నభిన్న భా**
**షలుగల పెద్దప్రాంతముల శాశ్వత రాష్ట్ర నిరూపణము గా**

**వలెనని గాంధియాశయము పట్టున నమ్మిక జేసి భారతా**
**ఖిల జనసంస్థతోఁ జెలిమికిన్ మనసొగ్గెను మెచ్చెనాతఁడున్.**

ఈరోజుగాకపోయినా రేపైనా ఆంధ్ర రాష్ట్రమేర్పడుతుందనే నమ్మకంతో ఉన్న పొట్టి శ్రీరాములుకు చాలా బాధ కలిగింది. ఎంత శాంతంగా ఉన్నా కేంద్రంలో కదిలిక రాకపోవడం చూసి ఆయన కోపం తారాస్థాయికి చేరుకున్నది.

**శా॥"భాషారూపకమైన ప్రాతిపదికన్ ప్రాంతాల భాగింప సం**
**తోషంబేయగునాకుఁ దద్విభజన నోద్యోగేచ్ఛయాంధ్రోది యా**
**భ్యేషిప్రోద్యమజాతసూత్రమగుమున్నేభూరిసంపన్మయా**
**శేషాంధ్రావని, యొక్క రాష్ట్రమని నాసిద్ధాంతమో మిత్రమా!"**

**గీ॥ఆంధ్రరాష్ట్ర నిరూపణాద్యాశయంబు అఖిలభారత జనసంఘమనుమతించి**
**పదియు నాలుగు వర్షాలవఱకు కడచె నిప్పటికి జేయకుంట సహించుటెట్లు**

భాషా ప్రాతిపదికన రాష్ట్రాలేర్పడితేగూడా నాకు సంతోషమే. ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకు అంగీకరించి పద్నాలుగు సంవత్సరాలు గడిచినప్పటికీ రాష్ట్రం ఏర్పాటు చేయకపోవడమేమిటని శ్రీరాములు తీవ్రంగా ప్రశ్నించారు. ఇలా చేస్తూ ఉంటే ఎన్నాళ్లు ఓర్చుకొని ఉండాలని వేదనతో ప్రశ్నించారాయన. సరళమైన భాషలో ఇట్టి విషయాలను జంధ్యాలవారు విడమర్చి మరి తెలిపారీ గ్రంథంలో. ఈ గ్రంథాన్ని పండితులనేగాక ఆయన సామాన్యులను కూడా దృష్టిలో ఉంచుకొని రాశారని మనం గ్రహించవచ్చు.

**మ॥అనిభాషించుచు లేశమైననను భోగ్యాహారమాసింపకే,**
**దినముల్ పుచ్చుఁ గ్రమక్రమమ్ముగల నద్దేహైక దార్ఢ్యక్షయం**
**బని వార్య స్థితినయ్యెఁగరనద మత్యంతంబుగాఁ దగ్గెనూ**
**తన రాష్ట్రోద్భవమొందెగా కితరమున్ ధ్యానింప డొక్కింతయున్**

**మ॥దినముల్ మీఱెను వారముల్ గడచె బూర్తిన్‌జెందె మాసంబు నిం**
**దనుకన్ నిత్యము పత్రికాముఖ సంయుక్తంబైన శ్రీరామవీర**
**నిరాహార శితవ్రతంబెఱింగి యున్ రాజ్యాంగ సభ్యాళి,తె**
**ల్పనివారేయయి రాంధ్రరాష్ట్రమొనగూర్పన్ మించు సంకల్పమున్.**

ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు మినహా మరేమి ఆశించక చేస్తున్న నిరాహారదీక్షతో మాట కూడా సరిగా పలుకలేని నీరసమావరించినా, వెనకడుగువేయలేదు. రోజులు, వారాలు గడచిపోయి నెలపూర్తి అయినా మొండి వైఖరితో కేంద్రం ఉంది. పొట్టి శ్రీరాములుగారి నిరాహారాదీక్షను వీరనిరాహారదీక్షంటారు జంధ్యాలవారు. ఇది ఒక మహావ్రతంగా ఆయన తెలియజేస్తారు. ఇది జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తెలిపింది అక్షరసత్యమని అందరూ అంగీకరించ వలసిందే. ఆయన నిరాహారదీక్షతో ఆంధ్రరాష్ట్రం నలుమూలలా ఉద్యమం కొనసాగింది.

**సీ॥క్షుద్బాధనైన సంక్షోభంబుతో నాంధ్రరాష్ట్రమా? యంచునారవము సేసె**
**ప్రతత భారతరాజ్య పటముగైకొని యాంధ్రదేశంబుఁజూప గన్దెఱచి చూచె**
**బహున్నృపాలుర చిత్రపటములందున నాంధ్రభూపులఁజూపఁ గైమోడ్పుజేసె**
**ఆహారమన్న "నాఁ"యనినోరుదెఱువక యాంధ్రరాష్ట్రమున "నాఁ"యనఁగనయ్యె**
**గీ॥భవము పొడుగున రాష్ట్రరూపంబు గనమిఁబొట్టి వంశానఁబుట్టిన పుణ్యమూర్తి**
**రాష్ట్రసముదయమునకు నాంధ్రంబు పొందుబన్నమరయంగరాదని కన్నుమూసె.**
**ఉ॥ పాలకులన్ ప్రధాని పదవర్తి జవాహరులాలు సత్కృపా**
**శీలుడు తత్సమస్య, బరిశీలనమున్ రచియించి భారతీ**
**యాలఘు సంస్థలో సభికులందరి సమ్మతిఁజేసి యుంట,స**
**త్యాలపన ప్రసిద్ధుడు మహాత్ముడు గాంధియునొ ప్పుటారసెన్**

**సీ॥యాబది మూడవేడాది జనవరి నెలవచ్చి యాశనగ్గలముఁ జేసె**
**నిష్పక్షపాతధీనిధి న్యాయమూర్తి తత్ప్రభుతాజ్ఞ నెరవేర్పబయలుదే దె**
**స్త్రవ్య దక్షిణభారత ప్రాంతమున్ డాసి వరుస సర్వాశలన్ బర్యటించె**
**అఖిలవర్గముల నాయకులనాహ్వానించి, ప్రాకటాశయముల సేకరించె**

ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు కొరకు న్యాయమూర్తి "వాంఛూ"కమీషన్ ఏర్పాటు చేశారు నెహ్రూ. ఆయన తననివేదిక సమర్పించిన పిదప, అదే సంవత్సరంలో 5ఏళ్ల వరకు ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా మద్రాసునే వాడుకోవచ్చని, తాత్కాలిక వ్యయం కోసం 5కోట్లు ఇచ్చేటట్లుగా, రాజధాని నిర్మించుకోవడానికి పదికోట్లు ఇవ్వాలని తన నివేదిక వాంఛూ పొందుపరిచాడు.

**శా॥ఆ వర్షంబున మార్చియిర్వది యునైదౌ నాడు నెహ్రూబుధుం**
**డావిష్కారము సేసె రాజ్యసభలో, నక్టోబరాద్యాహ మం**
**దావిర్భావమునొందు, నాంధ్రసమభిఖ్య క్షోణిరాష్ట్రంబు నా,**
**నా విశ్వాసమయోక్తిమాన్పెనునిరాహారైకదీక్షాదులన్**

**గీ॥ఆపయి నగష్టునెలలోన నలరు నిరువదేడవ దివంబు నందాంధ్రపృథ్వినొక్క**
**రాష్ట్రముగఁజేయు చట్టంబు రచననరసియాదృతిన్ లోకసభయు నామోదమొసఁగె**

ఏది ఏమైనా ఆంధ్రులు సల్పిన మహోద్యమం వల్ల, ముఖ్యంగా పొట్టిశ్రీరాముల నిరాహారదీక్ష వలన సంభవించిన పరిణామాల వల్ల పెద్దలు దిగిరాక తప్పలేదు. ఇలా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమేర్పడింది.

తర్వాత విశాలాంధ్ర ఉద్యమం వల్ల 1956 నవంబరు ఒకటవ తేదీన తెలంగాణను విలీనం చేస్తూ హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.

ఇలా శాతవాహనుల కాలం నుండి 1956 నవంబరు ఒకటిన ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ వరకు గల చరిత్రనంతా ఈ గ్రంథంలో పొందుపర్చారు. విద్వన్మణి,పంచసహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

"సాలంకారకృష్ణదేవరాయలు ఒక చారిత్రక కావ్యము. కృతికర్త మా పెద్దనాయనగారు శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. హరివంశోద్భవులు. జంధ్యాల వారికి దత్తత వెళ్లారు. వారు ఇరు వంశములకు కీర్తి తెచ్చిన సహస్రావధానులు. ప్రపంచ సాహిత్యమున అవధాన ప్రక్రియ తెలుగు సాహిత్యముననే కలదు. అట్టి ప్రపంచమున పంచ సహస్రావధాని మా పెద్దనాయనగారు మాత్రమే.

శ్రీకృష్ణదేవరాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముడు. వారి జీవితము, విజయములను చారిత్రక కావ్యంగా వ్రాసిన ఘనత శాస్త్రి గారిదే" నంటారు డా॥ హరిసనత్కుమార్‌గారు "సాలంకార కృష్ణదేవరాయలు"గ్రంథం గురించి తెలుపుతూ. 1964వ సంవత్సరంలో కొండపల్లి వాసుదేవరావుకు "ఆంధ్రసామ్రాజ్యము"అనే చారిత్రక పద్యకృతిని అంకితం చేశారు. ఇది 4,340 పద్యాల మహాకావ్యం. క్రీ.పూ. 180–170నుంచి ఉన్న చారిత్రక విషయాలు, ఇందులో చోటు చేసుకున్నాయి. ఇందులో కవి సహస్ర ముఖ ప్రతిభా పాండిత్యాలు, కవితాశక్తి విజృంభణ తెలుస్తుంది. ఇందలి కవితాసక్తిని వర్ణింప సామాన్య పరిశోధకులకు సాధ్యం కాదు. అనల్పదీప్తితోడి, సంస్కృత సమాసాల సీస పద్యాలు, ఉదాత్తగంభీరము మత్తేభశార్దూలవిక్రీడితాలు, లలిత పదన్యాస చంపకోత్సవమాలల పరిమళాలు, ఎక్కడ చూసినా చారిత్రక ప్రదర్శనా శాలలు శాశ్వతంగా నిర్మించినాడు. తెలంగాణ చారిత్రక విశేషాలు మక్కువగా ఎక్కువగా వివరించినాడు"అంటూ జంధ్యాల వారి "ఆంధ్ర సామ్రాజ్యము" గ్రంథం గురించి వివరించారు డా॥ ఎస్.ఎమ్.మహ్మద్ హుస్సేన్‌గారు.

**మ॥మతి మన్మొఖ్యుడవం చెటింగియు రసామందోక్తి సంలగ్న స**
**త్కృతి సంధాతవుగా గ్రహించియు సభాదేశంబు నన్ ధారణా**
**ప్రతిభాకౌశల దర్శనోత్సుకమతిన్ బాధించినాడన్, దయా**
**రతి నస్మత్కృత లోపముల్ సయిపు సుబ్రహ్మణ్య విద్వన్మణీ"**

**అని కొనియాడతారు జంధ్యాలవారిని శేషాద్రి రమణ కవులు.**

ఇలా అనేకమంది పండితులు, కవులు, సంస్థానాధీశులు సుబ్రహ్మణ్యశాస్త్రి గారి ప్రతిభా పాండిత్యాలను కొనియాడారు. ఈ ప్రశంసలకు వారు వంద శాతం అర్హులనటానికి ఎవరూ సందేహపడరు. అయితే వారికి దక్కాల్సినంత గుర్తింపు దక్కలేదేమోనని వారి రచనలు చదివాక నాకనిపించింది.

¤ ¤ ¤ ¤ ¤

# రచయిత పరిచయం

## నియోగి



అసలు పేరు : ముల్లపాటి వెంకటరమణ

తండ్రి పేరు : కామేశ్వరరావు

తల్లి పేరు : సీతాదేవి

పుట్టిన ఊరు : ఎఱుపాలెం మండలం
చప్పకట్లపాలెం, ఖమ్మం జిల్లా

విద్యాభ్యాసం : విద్యాభ్యాసం మొదలు డిగ్రీ వరకు సత్తుపల్లి,
ఖమ్మం జిల్లా

వృత్తి : జర్నలిజం

ప్రస్తుతం : ఉపసంపాదకుడు, ఆంధ్రప్రభ దినపత్రిక, హైదరాబాద్.

రచనలు :

మొదటి కవిత–1979లో ఆంధ్రపత్రికలో

ఆర్తి (2003), నెగళ్ళు (2007),వల్లడి (2009)–(వచనకవితా సంపుటులు)

కొలిమి(2011)–(సంపాదకత్వం, తెలంగాణ ఉద్యమనేపథ్యంగా వచ్చిన వచన కవితా సంపుటి. దీనిని ఖమ్మంలో నేటి ముఖ్యమంత్రి కె.సి.ఆర్ ఆవిష్కరించారు)

కొలిమి సినిమాకు మాటలు–2012

ప్రేరణ (2015)–(వి.ఆర్.విద్యార్థి "అపరిచితులు" కవితలో ప్రయాణం) (విమర్శ)

అక్షరముద్రలు (2015) – (ప్రముఖ సాహితీవేత్తల ఇంటర్వ్యూలు)

ఉద్యమస్వరానికి వందప్రశ్నలు (2016)–(విమర్శ)

ప్రశ్నలహోరు–ద్వానా జవాబుల జోరు (2017)– (విమర్శ)

వంద ప్రశ్నలు–వేలభావాలు (2017)–(విమర్శ)

సాహిత్యంలో సాగర్‌యానం శతప్రశ్నాసంధానం-2018

అక్షరనక్షత్రాలు-1(2019)- (111మంది దివంగతులైన మహాసాహితీవేత్తల పరిచయాలు)

అక్షరనక్షత్రాలు-2(2019)-(111మంది దివంగతులైన మహాసాహితీవేత్తల పరిచయాలు-ముద్రణలో ఉన్నది)

నాలుగు సంవత్సరాలు పరిశోధనగావించి అందించిన గ్రంథాలు (ఒక్కొక్కటి నాలుగువందల పేజీల గ్రంథాలివి)

అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని - జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

సాహిత్య సమాలోచన (విమర్శ)

మూడు ఆడియో క్యాసెట్లు(పాటలు-2004, 2007, 2011)

వివిధ సంవత్సరాలలో వ్యాసాలు, పుస్తకసమీక్షలు, ఇంటర్వ్యూలు, ముందు మాటలు రాయడం జరిగింది.

అక్షరాల అడుగుజాడల్లో పంచసహస్రావధాని-2020

## ముఖ్యమైన అవార్డులు:

ద్వానా ఆత్మీయపురస్కారం (హైదరాబాద్)

నాగభైరవ ఆత్మీయ స్మారక పురస్కారం (నెల్లూరు)

పెళ్లకూరు జమున స్మారక పురస్కారం (నెల్లూరు)

సీతారామరాజు స్మారక కళావేదిక పురస్కారం (కాకినాడ)

శ్రీసామసీతారాములు తెలంగాణ రాష్ట్రస్థాయి సాహితీపురస్కారం (ఆలేరు)

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభాపురస్కారం (విమర్శ)

¤ ¤ ¤ ¤ ¤



తల్లిదండ్రులు శకుంతలమ్మ, సుబ్రహ్మణ్యశాస్త్రి గారలతో
కుసుమకుమారి

చారిత్రక కావ్యాలను పరామర్శించే విమర్శకునికి చరిత్రజ్ఞానం లేకుంటే పరామర్శ చేయటం కష్టం. నియోగిగారు తెలుగు జాతి చరిత్రజ్ఞానం పుష్కలంగా ఉన్నవారని ఈ విమర్శ గ్రంథం రుజువు చేస్తున్నది.

–రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి

నియోగిగారు ఏ గ్రంథం రాసినా అది సమగ్రంగా ఉంటుంది. ప్రధానంగా పాఠకులలో విలువైన విషయాలపరిజ్ఞానం కలిగించటానికి వారు బాగా శ్రమ తీసుకుంటారు. కాబట్టే వారు రచించిన గ్రంథాలు జ్ఞానదాయకంగా ఉంటాయి.

–అమ్మంగి వేణుగోపాల్

ముంజేతి కంకణమునకు అద్దమేల. దీనిపూర్వభాగము నే చెప్పితిని. ప్రస్తుత భాగము సహృదయ సాహితీబంధువులు పఠించి సమాదరింతురుగాక. శ్రీనియోగిగారు ఇలా ఎన్నో వ్రాయాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

–హరిసనత్కుమార్

ఈ గ్రంథం తెలుగు విమర్శరంగానికి వన్నె తెస్తుందని నేను గాఢంగా నమ్ముతున్నాను. ఇదొక సాహిత్య విజ్ఞానగ్రంథంగా రూపుదిద్దుకున్నది. ఈ గ్రంథం ఆగకుండా చదివించగలిగే రీతిలో నియోగిగారు రాశారు.

–డా॥ కేతవరపు రాజ్యశ్రీ

కవియొక్క హృదయాంతర్గత భావాలను సుకుమారంగా స్పృశించి, ఒక విధమైన పారవశ్యంతో నియోగిగారు ఈ రచన చేశారనిపిస్తుంది. మూలగ్రంథాల ముఖ్యోద్దేశ్యాన్ని పదిలపరుస్తూ ఎంతో శ్రమించారు నియోగిగారు.

–జంధ్యాల కుసుమకుమారి



నియోగి